# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



మే 1978

సంపుటము : 55 సంచిక : 5



విడిపత్రిక వెల రూపాయిన్నర

# ప్రగతి పథంలో పారిశ్రామిక రథం

వివిధ రంగాలలో గణనీయమైన ప్రగతిని సాధించిన ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాదు నగరంలోనూ, పరిసరాల్లోనూ, అనేక కేంద్ర ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలను నెలకొల్పడంతో పారిశ్రామికాభివృద్ధికి చక్కని వాతావరణం ఏర్పడింది. **1956**లో **43** కోట్ల రూపాయల పెట్టుబడితో మన రాష్ట్రంలో మధ్యతరహా, పెద్దతరహా పరిశ్రమలు మొత్తం **45** ఉన్నాయి. అలాంటిది ఇప్పుడు **620** కోట్ల రూపాయల పెట్టుబడితో **150** పరిశ్రమలు నిర్వహించబడుతున్నాయి. చిన్నతరహా పారిశ్రామిక రంగం సత్వరాభివృద్ధి చెందుతున్నది. రాష్ట్రంలోని వెనుకబడ్డ, గిరిజన ప్రాంతాలలో కొత్తగా పరిశ్రమలు నెలకొల్ప దలచిన ఔత్సాహికులకు అనేక సదుపాయాలు ఆంధ్రప్రదేశ్‌లో కలుగజేస్తున్నారు. **1978-79** లో పారిశ్రామిక రంగానికి **11·54** కోట్ల రూపాయలు కేటాయించారు.

అభివృద్ధి పథంలో మన పారిశ్రామిక రథం శరవేగంతో పరుగిడుతున్నది.

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*
2/78-79



# విషయానుక్రమణిక

## మే 1978





# దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

## శ్రీ రాయప్రోలు సుబ్బారావు

ఆశాచక్రమునం దుషఃకలలు విస్ఫారన్, సమస్తాంధ్ర భూ
మీశుభ్రోప వనీవసంత మలరెన్, మేల్కొన్న జాతిన్ సుహృ
త్పాశ ప్రాప్తులఁ జేయుమింకఁ గృతకృత్యుంబౌ భవద్దీక్షయున్
కాశీనాథ కుల ప్రదీపకమణీ! నాగేశరాయాగ్రణీ

చదివించితివి నిరాశ్రయులైన యువకుల
నెందఱనో ధనమెల్ల నిచ్చి
పోషించితివి నవోన్మేషమోహనమైన
భావగీతికి తలన్ పాలుపోసి
సంధించి తధికవత్సల దృష్టి దూర దూ
రాంధ్రుల నేకలక్ష్యమున నిలిపి
పెదికి తర్జోన్ముక్త పృధులోదమున నాంధ్ర
పద వాక్య కల్పనా బహుళ పటిమ

ఆకు మరువున పువుబోలె నాంధ్రలోక
సేవఁజేసితి వాత్మ నిస్పృహ గుణాప్తి
తల్లి ఋణము దీరిచికొన్న ధన్యుఁడ వని
యెన్న రాదేల నిన్ను నాగేశరాయ!

ప్రతిపాదించితి వీవు శోభనగుణ ప్రాధాన్యమౌ నాంధ్రా
వితచైతన్యమటం చనేకముఖ బింబీభూత కార్యోత్సవా
యతి సంధించి, భవిష్యదభ్యుదయ లక్ష్యంబున్ నిరూపింపు, ము
న్నతి కింకేటి కేగ రాంధ్రులును శ్రీనాగేశరాయాగ్రణీ!

### అస్పృశ్యత

మేఘ గర్భమునుండి మేదిని బడ్డ చె
ర్వుల మంచి నీళ్ళల గ్రోలరాదా?
పందులు గాడిదెల్ బాహాటముగ బోవు
వీధుల యందేల వెళ్ళరాదా?
కాయకష్టముచేసి గంజియుంబల్రిదావి
ఊరి నడుమనేల యుండరాదా?
భగవంతుఁడిచ్చిన పరమార్థవాక్యమున్
మనుజుఁడై యేటికి వినఁగరాదా?

బోడపడ దీ విరుద్ధ ధర్మాధికార
సూత్రములకు సత్యార్థ మేమాత్రమిపుడు
చచ్చిపుచ్చిన యాచార శల్యములను
బట్టి పూజింతు రయ్య తత్వజ్ఞులెందు.

సోమయాజి కుమార్తె సూతికయ్యె సీమ
బ్రాందీని సుఖముగా ద్రావవచ్చు
అవధాని కొడుకు క్రైస్తవ కళాశాలలో
స్వేచ్ఛగా చేముద్దు లీయవచ్చు
కోర్టులో వాయిదా కొఱకు హోలులు దూరి
బహుముఖోచ్ఛిష్టమ్ము ద్రావవచ్చు
తన పెండ్లికోస మాత్మతనూజఁదెగనమ్మి
వృద్ధ విధురులు చరింపవచ్చు

ఏ స్మృతులనుజ్ఞల నొసంగె నీ నికృష్ట
కర్మపరిణామ సాంకర్యకాండకెల్ల
ధరశాస్త్ర ప్రమాణాలు తడవనేల
ఆత్మ వత్సర్వభూతాని యనరె బుధులు.

(ఆంధ్రపత్రిక 16-11-1925)

(హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము వారు, నవంబరు 1925 లో శ్రీ నాగేశ్వరరావుగారికి ఘనమైన సన్మానము చేసినారు. ఆ సమయమున ఆధునిక కవితా మూర్ధన్యులు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు చదివిన స్వాగత పద్యములు)

— సేకరణ: **సుందరేశ్వరరావు**



3–5–1978 చైత్రబహుళ ద్వాదశి బుధవారము

కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి

**110 వ జయంతి.**

# వసుధైవ సౌదర్యం

## శ్రీ సోమసుందర్

తమ్ముడూ ఈ గది ఇంత చీకటిగా
ఇంత ఉక్కగా ముక్కగా దిగులుగా
రోతగా రోదనగా ఉన్నదేమిటి ?
ఎవరో మూలల్లో ఒదిగిన పిల్లలు
బిగించిన పెదవులమధ్య
ఏడుపు వెక్కిళ్ళాపుకుంటూ
భయం భయంగా నిశ్శబ్దంగా
గుండె లవిసేలా దుఃఖిస్తున్నారేం ?
ఆ పసివాళ్ళ నిటలాలు
అష్టమినాటి చంద్రబింబాలు ...
ఇంత చీకటిలోనూ ఎంతస్పష్టంగా మెరుస్తున్నాయ్?!
కలల బరువులతో ఒంగిన వెలుతురు రేకుల్లా ...
మబ్బునోటికి చిక్కిన మెరుపు తీగల్లా ..
ఎదుట దిక్కులలో కలవరం
దిక్కూ తెన్నూ తోచని పిట్టల దీనరుతం
చుట్టూ కంపించే మంచు, దట్టంగా విడిసిన
జడిపించే చీకటి ...
జీవులపై మిడిసిపడే ఆకలి ...
విరిసీ విరియని రెక్కలు వాతంతో తిమ్మిరెక్కి
కదలలేని కఠిన శిలాశాసనం !
ఏమిటిది ? ఎదురవుతోంది ప్రకృతి మొగసాల ...
నాలుగు మూలలకీ పరచి భయంకర నిశ్వాసాల ...
దిగంబరంగా దండెత్తే డిశంబరు మంచు
ఉరకలిడే సమరాల చలిగాడ్పుల ముంచు
సాశ్రునయనాల విచలిత పక్ష్మల మధ్య
ఆశల విదళించే గగన తను మధ్య! ... ...

## 1

అబ్బాహ్ ! ... ఇదంతా నిన్నటి దుశ్చిత్రం ...
సమర విఘాతాల దుస్తంత్రం
పరపీడా పరాయణులు కల్పించిన
వసుధార్త స్వరూపం ... !

ఈ గది, గతలోకం మది
చీకటిలో చుంచుల్లా నక్కిన బిడ్డల హృది
భంగపడ్డ ధరిత్రి భవిష్యత్తు
గరపిల్లిన మానవ మహాక్రతువు
విషణ్ణమై ముగిసిన దుర్ముహూర్త
కోలాహల సంహర్తం ! అది శాపం !
చిగురుటాకు చివర మెరయు
మంచు బొట్టు మాదిరిగా
గోటి కొసల మెరయు బాష్పకణము !
అది తెలిపే జీవగాథ ...
అది శాపం, అది పాపం, అదీ గడచిన సమరం !

తమ్ముడా ఆ దుస్సహ ప్రకరణాల
మళ్ళీ మళ్ళీ వెనక్కి త్రిప్పకు !
భ్రాతృహత్యా మహాపాతకాల
కీటకాల ముడి విప్పకు !

ఎవరో ఊరికి దూరపు పొలిమేరలలో
చీకటిలో, చలిలో రాత్రీ నిశ్శబ్దంలో
లోగొంతులతో గతాన్ని పరామర్శించుకొంటున్నారు
భవిష్యత్తుపై ఆశాగీతం ఆలపిస్తున్నారు ...
అరుణార్క రోచిస్సుల నావిష్కరించేందుకు
ఉమ్మడిగా సమాలోచన జరుపుతున్న అలికిడి ...

ఆ కన్నులింక కార్చలేవు బాష్పాలు
ఆ మిన్నులింక కురవలేవు వర్షాలు
ఈ అక్రమ సమరార్భటి అందుకుంది ముక్తి ...
ఏ మూలిక లందించెనో నరాలకీ శక్తి ... ?

ఈ గాత్రము ఏ కీర్తన వినిపిస్తుందీ రాత్రి ?
ఈ పెదవులకే మధువుల నందిస్తుందీ పాత్రిక ?

గళమెత్తి చెరవదలిన ధరణినేడు
విరచిస్తుందా నవమంగళారాత్రిక ?

పులకాంకుర సుమహాస తొలికే కేదారం
భవిష్యత్తు క దిస్తుందా వాగ్దానం ?

ఎదలో త్రొక్కిపెట్టిన సంతోషం
క్రిక్కిరిసి ఉండబట్టలేక వెలికురికినట్లు —
కొండ కొమ్ము అంచుల్లో నిలవలేక
జలధారలు లోయలగుండెలపై
హర్షధ్వానాలై తుళ్లింత లాడుతూ దుమ్కినట్లు—
పుడమినోట ఆశల జలం ఊరినట్లు —
బిల బిలమని ప్రవహించే జలవాహిని !

మండలతో కనురెప్పల
నిద్దుర బరువులు నులుముకొని
చెదరిన ముంగురులను గాలికి వదలి
అలవోకగా అల్లరిగా గంతులు వేయగా
కన్నులలో కొత్తకాంతిరేక లద్దుకొన్న బిడ్డలు
ఆటవిడుపు దొరికిన ఆనందం మాదిరిగ
సూర్యోదయం తలుపులు భళ్లున తెరచి
బిల బిలమని ప్రవహించే జనవాహిని !

## 2

దారి పొడుగునా
గత బాధా శల్యాలను తుడుస్తూ
స్వేదంతో ఎగిరిపడే ధూళిని అణుస్తూ
ఆనందాశ్రు వార్నిధితో దారులు ప్రక్షాళిస్తూ
యుద్ధ పిశాచాల బాహుబంధాలనుంచి
నరులంత ఒక్కుమ్మడిగా వెలికురికి
ఉద్యమోత్సాహంతో తరంగలిస్తూ మెరవగా
ముద్దుల కురిపించే పాలపిట్ట రెక్కలుగా
ఏమిటి ఈ సందడి ? ఈ సంరంభం ?

పాదప శిఖపై కులికే
కుసుమ గుచ్ఛ జాలమట్లు
వసుమతిపై నడయాడే నరులంతా సోదరులై
జిలుగు నగవు కిరీటాల సుధావార్ధి కెరటాలై...
పచ్చని వరిచేలు లోకానికి పట్టెడన్నం పెట్టేదాతలుగా
కురిపించే నితాంత మర్మర ధ్వానాలై ...

ఒంచిన వీపుల కాల్చే సూర్యుడు
చల్లని మెత్తని నవ్వులతో నిమిరే
కపురపు టోదార్పుల క్రుమ్మరించినట్లు ...

పాటలు పాడే పిట్టలకై
ఊయెలలూచే కొమ్మలు !
పరవశించి మౌనంగా తలలూచే రెమ్మలు ...
ఏమిటి ఈ సందడి ? ఈ అనంత సంరంభం ?
సదానంత మంగళకర తూర్యారావం !

## 3

కట్టేరా యుద్ధానికి శాశ్వత సమాధి ?
పెట్టేరా దుర్మార్గుల ఉక్కుగోడ చెరసాలల ?
మట్టేరా పన్నగాల పాతాళం లోతులోకి ?
కొట్టేరా భ్రాతృహంత గోరీపై గట్టిమేకు ?

రండోహో నరులారా గట్లు తెగిన ఝురుల్లారా !
జనులంతా సోదరులుగ — ఇదె శాశ్వత జీవశాంతి...
రండీ మానవులారా, రండి వియచ్చరులారా !
వసుమతి కళ్యాణ వేది నధివశించె సుధాకాంతి...

## 4

ఎంత అందము పండి పరవశించిన దిపుడు ...
ఎంత సందడి జనుల హృదయ మందిర మందు...!
పాతలోగిలి మారిపోయె దివ్యాంగణం —
నందనోద్యానమై మెరసెను శ్మశానం !

నిన్నరాతిరి వరకు అగిడి మంటల బారు
మంటలకు నుసికాని పడకగది కనరాదు
వసుధ జ్వాలాముఖిగ విస్ఫులింగా లుమిసె
ఎరుపెరుపు కాంతిచ్ఛటల క్రమ్మెనో నిన్న !

భూగర్భ గ్రంధాలయముల తాళము చెవులు
ఎచట పారేసెనో భయదార్తు డధికారి !
ప్రాణాలు గుప్పిళ్ల దాచి పరుగున పోయి
ఎటు దాగిరో గ్రామవాసులంతానిన్న ?

అయ్యెయో నరులార ఆ భయానకరాత్రి
కుయ్యిలిడి దీనమై పారినది నరజాతి !
ఎంత ప్రళయ జ్వాల గడచినది గతరాత్రి
సమరమో సవనమో దురితాంధ పవనమో !

సుమ మంజులాంతరంగముల బూడిదచేసి
గడచినది విలయ కీలోగ్ర ప్రభంజనము
విడిచినది మబ్బుతెర శుభ్ర ప్రదోషమున
పుడమి నలుకెలకులందున్న మానవులార !

రండహో అందరూ జీవ చక్షువు లగుచు
రండోయి సర్వులూ సోదరుల మమతతో
సమరమో మరణమో ఇకరాదు రేపకడ
బవరమో జరరు జావరణమో పాడమదిక !

నిన్నవర కేడ్చి యేడ్చిన కనుల పొగిలినది
పుడమి బాలెంత రవ్వంత నెమ్మది లేక
తల్లికీ తనయులకు ఎడబాటు తీరింది
శాంతి దేవత చల్లగా తుడిచె కన్నీళ్లు !

నిదురలో తల్లడిలి పలవరించిన కనులు
సెలయేటి కెరటాల దొంతరలు కన్నీళ్లు ...
శిశువు లార్తుల కనులు రోదించి వాచగా
ఏ తల్లి చల్లనౌ చేయి వచ్చిన దిపుడు ?

ఏ తల్లి శాంతి దేవత తుడిచె కన్నీళ్లు ?
కొత్త ఊపిరి బ్రతుకు కందించి దిగతుడిచి
రాగలవు మంచి రోజులు మల్లెపూలకని —
ధవళాంగి ప్రియశాంతి రజితాద్రి దిగివచ్చె !

రారండి నరులార అందరేకోదరులు ...
దరులొరసి పారు జలదేవతల స్మేరాలు ...

## 5

ఈ చిరంతన స్వప్నమిక తొలగిపోదులే
ఈ అధరస్మిత కాంతి ఇవతళించగబోదు

ప్రతి గళాటవి గహ్వరమున చిక్కిన గీతి
మెల మెల్లగ ఇపుడె రెక్కల లార్చినది

ప్రతి గుండెలో మొరసి సన్నగా గుసగుసలు
పిరికిపడి డిల్లవడి సొమ్మసిల్లెను దిశలు ...

అందాల జాళువా వెన్నెలలు కురవగా
అరమోడ్పు కన్నుగవ లెక్కి ప్రవహించగా...

నేడె పుట్టిన భవిష్యత్తు సుందర శిశువు
చిని చిన్ని తెల తెల్ల చేతులాడించినది !

ఈ ఉషస్సు ధ్యానరంగ వేదిక — రంగు
అద్ది నారే ! — స్వర్గ దేవతలు కాబోలు !

మందార మాలికలు అరవింద మదవతులు
తీర్చినారే తోరణాలు వసుధకు నేడు ...

ప్రతి గవాక్షము శుభ్రగగన విస్ఫారితము
వలపువలె లేత నీలిమ కురిసె మొగసాల ...

ప్రకృతి దరహాసమై జాగరించిన దిపుడె
ఆదిత్య ద్యుతి ధాతు రసము గ్రోలిన దిపుడె

పృథివి పునరుజ్జ్వలోత్సవ హృదయ రూపమై
కొత్తసూర్యుని కౌగిలింతలో సోలినది !

పాత ఇళ్లకు కొత్త శోభ చేకూరింది
పాత గుండెల కొత్త హోయలు పులకించింది

దుఃఖమలిన దుకూల శ్రేణి కడలకు విసరి
కొసరి నవ్వుల పల్లకీల మువ్వలు మొరసె !

పాత లోగిళ్లలో ఏడ్పునీడలు సమసె
కడకంటి దాపులో మూల్గు రాజులు తొలగె !

కరువులూ బరువులూ ఇరులతో మాయమై
కనక చేలాంచలము రత్నరాసులునిండె

శిశువులూ అనదలూ సికతా తలిని మెరయు
మంచి ముత్యాలుగామారి కిరణాలైరి...!

ఆనంద వీచికల జల్లు కెరటాలవే
శాంతి పయ్యెద చెంగు విస్ఫుమర వీచింది !

రండిరా అందరూ అన్నలూ తమ్ములూ —
వసుమతిని కళ్యాణ వేదిగా మార్చగా ...

ఈ జగతి చిరస్వప్న సాఫల్యగీతిగా ...
మానవోత్సవ దివ్య సౌదర్య* కాంతిగా ...

---

* సౌదర్యం = సోదరత్వం.

శ్రీ చొప్పకట్ల సత్యనారాయణ

# శబ్ద పల్లవ క్రియలు

[గత సంచిక తరువాయి]

అహోబలుని తరువాత శబ్దపల్లవ ప్రశంస చేసినవాడు మంచెళ్ల వాసుదేవకవి. ఇతని గ్రంథమైన 'వైకృత చంద్రిక'ను ఆంధ్ర ప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్సు లైబ్రరీ వారు ఇటీవల లఘు టీకా సహితముగా ముద్రించియున్నారు. వాసుదేవకవి క్రీ. శ. 1758 ప్రాంతమువాడని అందే నిర్ణయించారు. అనగా ఇతడు అహోబల పండితునికి అనంతరుడవుతున్నాడు. ఈ గ్రంథానికి 'ఆంధ్ర సిద్ధాంత కౌముది' యను పేరు కూడ కలదు. దీనిలో, తిజంత విభాగము 205 సూత్రంలో శబ్ద పల్లవములు సూచింపబడినవి.

సూ॥ "సుసః పల్లవాత్.

వృత్తి — క్వచిత్ప్రథ మాంతాత్ పల్లవ సంజ్ఞాతా చ్ఛబ్దా దపి పరతః క్రియా యథా యోగవ్ అర్థాంతరే చస్యాత్—దిక్కుసెడు, పదనెక్కు, తెంపఱు, తళుకొత్తు, ఇత్యాద్యావ కర్మకత్వవ్ వివాహమగు, చెట్టబట్టు, కాల్ద్రొక్కు, దన్నాదు, ఇత్యానౌ సకర్మకత్వవ్. చేకొను, దాకొను, దీకొను, ఇత్యాదయో బహవో ప్రథమా నిపాతా దేశాః. అంగలించు, మ్రగ్గలించు ఓగలించు, చెంగలించు, తురంగలించు, రంగలించు, బెంగలించు, తొంగలించు, వెలదు, తవదు, ఏతెంచు, పుత్తెంచు, అరుదెంచు, ఇత్యాదీనావ్ బహుళం వర్ణలోపాగ మాదేశాః గ్రాహ్యాః"

వాసుదేవకవి ప్రకారము పల్లవ సంజ్ఞ ప్రథమాంత శబ్దానికి వర్తిస్తుంది. దీనికంటె పరమైన క్రియ అర్థాంతరము నందుతుంది. దీనికి పూర్వ సూత్రమునందు (సూ 20 లో) క్రియలు అర్థాంతరమున వర్తించునని చెప్పుచున్నాడు. "ఏకస్మిన్నర్థేవిహితో ధాతుః యథా ప్రయోగ మర్థాంతరే చస్యాత్ — మగువ నాథుని జంతించె, మగువ చింతిల్లె." ఆ వరుసలో శబ్ద పల్లవ ప్రశంసచేసినాడు. వాసుదేవుడు తన వృత్తిలో ప్రథమాంతాత్ అని ప్రథమా విభక్తి శబ్దాన్నే చెప్పినప్పటికీ 'సుసః' అని సూత్రంలో చెప్పడంచేత ద్వితీయావిభక్తి శబ్దం కూడా ఇతనికి ఉద్దిష్టమే అనుకోవాలి. తనకు పూర్వం ఈ యంశాలు ప్రకటించిన. అథర్వణునికాని, అహోబలపతిని కాని ఇతడు స్మరింపకుండుట విచిత్రము. అంగలించు మొదలైన వానిని ఇతడు శబ్దపల్లవములుగా భావించినట్లుతోచును సంస్కృతంబున కంగలాదుల కిఃచుక్కగునను చిన్నయసూరి సూత్ర ప్రకారము ఇంచు అనునది ప్రత్యయమాత్ర మవుతూంది. అప్పుడు వీటికి శబ్దపల్లవ వ్యవహారమెట్లో తెలియదు. వీటిల్లో శబ్దమేళనమే చూపట్టదు. చెంగలించు అనునది చెంగలవలె (ఒక రకము గడ్డి) విస్తరించినది అని అర్థము కల్పించుకొన్నను—ఇంచు—ప్రత్యయము గానే గ్రహించవలసి వస్తుంది. "లాంగలి చెంగలించె" కాశీ—3 ఆ. సంస్కృతము నందలి ఆచారార్థ ప్రత్యయమునుగా భావింపవచ్చును. కృష్ణతి—కృష్ణ ఇవ ఆచ రతి. ఏమైనను మంచెళ్ల వాసుదేవుడు శబ్దపల్లవ క్రియను గురించి లోతుగా తరచి చూడలేదు.

ఆధునిక యుగం వచ్చిన తరువాత చిన్నయసూరియే తొలుదొల్త శబ్ద పల్లవాలను గూర్చి, ఇతర ధాతు మేళనమును గూర్చి సూక్ష్మ పరిశీలన గావించినవాడు. అథర్వణుడు చెప్పిన అర్థ ఘటక క్రియావ్యవస్థను ఇతడు ఆదరించలేదు. అథర్వణుడైనా ఘటక క్రియలను మిక్కిలి కొద్ది సంఖ్యలో చెప్పాడు. సూరి వీటిని వేరే విభాగంగా పరిగణించడం అనవసరమని భావించి ఉంటాడు. భూ, గమి దాత పుల్లో భూ పర్యాయమైన అగు ధాతువునే ముఖ్య ఘటక క్రియగా చేపట్టి దానితో ఆయా రూపాల్ని సాధించడానికి వ్యాసక్త చేశాడు. "భూతంబు నలజికి ఓడంతంబగునగు ధాతువను ప్రయుక్తంబగు" (క్రియా 114 సూ) వాడు రాడయ్యెను. వారు రారయిరి. నీవు రావయితివి. మీరు రారయిరి నేను రానయితిని. మేము రామయితిమి. వాడు రాలేదు, నీవు రాలేదు. నేను రాలేదు మున్నగు రూపములే పై రీతిని అగు ధాతువును అను ప్రయుక్తం చేసి చెప్పవచ్చునని ఈతని మతము. లజికి లిడంతంబగు అగు ధాతువేగాక లాడంతము (తద్ధర్మార్థకము) అగు ధాతువును అను ప్రయుక్తమవు తూందని తరువాతి వారు ఈ సూత్రాన్ని సవరించారు. 'నమ్మనేర నయ్యెదను, వృష్టి లేదవు' వంటి నన్నయ ప్రయోగములు ఈ సవరణకు ప్రమాణము. అథర్వణుని అర్థ ఘటక క్రియా వ్యవస్థ ఈ సూత్రంతో గతార్థమ అయిందని చిన్నయసూరి భావించి ఉంటాడు.

అథర్వణుని శబ్దపల్లవ నిధానమునే ఇతడు ప్రధానంగా భావించి దానిని క్రమబద్ధం చెయ్యడానికి యత్నించాడు. శబ్ద పల్లవ సందర్భంగా చిన్నయసూరి రెండు క్రొత్త విషయాలు ఆవిష్కరించాడు. (1) శబ్ద పల్లవాలు సుబంత పూర్వపదంగానే ఉండ నక్కరలేదు. ధాతు పూర్వపదాలుగా కూడా ఉండవచ్చును. (2) అవి

విలక్షణార్థాభిధాయకత్వం కలిగి ఉండాలి. అంటే శబ్దపల్లవములో మేళవించిన క్రియ స్వార్థాన్ని కొంతవిడిచి విశేషార్థ ప్రతీతి కలదయి ఉండాలి. వికృతి వివేకకారుడు మొదటి లక్షణాన్ని ఉద్దేశించలేదు. రెండవ లక్షణాన్ని వాచ్యంగా నిర్దేశించక గమ్యమానంగా విడిచి పెట్టాడు. వైకృత చంద్రికాకారుడు శబ్దపల్లవము అర్థాంతరము ఇచ్చునదిగా ఉంటుందని సూచన చేశాడు. వికృతి వివేక టీకా కారుడు 'విలక్షణార్థాభిధాయకత్వము' అనే లక్షణాన్ని కంఠోక్తిగానే చెప్పాడు. శబ్దపల్లవ పూర్వావయవము విషయంలో 'ధాత్వాదుల కనుప్రయుక్తంబులై' అని ధాతువు, తదితర పదము పూర్వాపదంగా ఉండవోపునని ప్రకటించాడే కాని అట్టి ఉదాహరణలు ఇవ్వలేదు. వీటన్నిటిని పర్యాలోచనచేసి, సమన్వయించుకొని చిన్నయసూరి తన శబ్దపల్లవ నిర్వచనం చేశాడు. ఉన్నంతలో ఇది సమగ్రంగా ఉంది. క్రియ॥ 118 సూత్రంక్రింద ఇతడిచ్చిన ఉదాహరణలు 'కూరు చుండు, నిలుచుండు, పరుండు, పన్నుండు, అఁకొను, ఈకొను, ఈయకొను, ఇయ్యకొను, రక్కొను, త్రెక్కొను, మేకొను, మయి కొను, మేలుకొను, మేలుకను, మేలుకాంచు, అలవడు, ఏరుపడు. చొప్పడు, వెలుపడు, తలపోయు, వాసపోయు (వాపోవు—దూసివారు) ఆపోవు,కొంపోవు, కొనిపోవు,విజయంచేయు, కయివ్రాలు, తూపాడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు.'' ఈ యుదాహరణముల పదచ్ఛేదము, అర్థము, మొదలైన విశేషాలు సుప్తార్థ ప్రకాశిక; బా. వ్యా సారస్య సర్వస్వపేటిక; సంహితా సర్వస్వము మొదలైనవాటిల్లో చర్చింపబడి ఉన్నాయి. సంహితా సర్వస్వము మాత్రం కొంత వివాదం లేపింది. మొత్తముమీద చిన్నయసూరి ఇచ్చిన ఉదాహరణలు ధాతువు, నామ వాచకము, లాక్షణి కావ్యయము. (కూరిచి, నిలిచి, కొనివంటివి) శబ్ద పల్లవ పూర్వావయవంగా ఉండి అతని లక్షణానికి అను గుణంగా ఉన్నాయి. విశేషణ పదముకూడ పూర్వావయవంగా ఉండడం లోకంలో కనబడుతూంది. తెల్లబడు, నల్లబడు, పుల్లబడు, విన్న బోవు వంటివి. అవ్యయము పూర్వావయవంగా ఉండడం ఆంధ్ర భాషాను శాసనకర్త శబ్దపల్లవ నిర్వచనంలో చేర్చాడు. ''ధాతు నామావ్యయముల తుదఁజేరి కొన్ని ధాతువు లర్థాంతరములను దెల్పును. అవియే శబ్దపల్లవములనబడును.'' (ఆం. భా అను క్రియ 47 సూ) లాక్షణికావ్యయమే కాక సాధారణ అవ్యయము కూడ పూర్వపదము కావచ్చునని వజలవారు వ్రాసిరి. వీరి మతమున 'ఇయ్యకొను' అను శబ్దపల్లవ ధాతువులో 'ఇయ్య'అనేది అవ్యయము. ''ఇయ్య అవ్యయము (తు. ఇయ్యే) అంగీకారమును దెలుపును.'' [వ్యా. సం. స. పుట 1693.] ఈ విధముగా చిన్నయసూరి శబ్ద పల్లవ క్రియలకు ఒక నిర్దిష్ట రూపం ఇచ్చినవాడయ్యాడు.

విలక్షణార్థక కల్పనా శక్తి లేకపోయినను జంట పదముల మేళనముచేఏర్పడిన క్రియారూపములును తెలుగులో ఉంటున్నాయి. వీటికి వేరే సంకేతం చెయ్యకపోయినా సూరి వాటిని కూడా సాధిం చియే ఉన్నాడు. ఈ క్రింది సూత్రాలు స్వార్థమునందే విశ్రమించు జంట పద ధాతువులను గూర్చి చెప్పచున్నవి.

(1) పడుజీ కాను వొకానొకచో స్వార్థమునందను ప్రయుక్తంబ లగు; క్రియ—110 సూ.

చొచ్చు—చొరబడు; నిలుచు—నిలువబడు; కూడు—కూడ బడు; పండు—పండుకొను;

(2) తెంచు ధాతువగ్వాదుల కనుప్రయుక్తంబగునగుచో నుత్వంబు పయిని దాని తకారంబు దకారంబగు; క్రియ—110 సూ.

అగుదెంచు, నెగయుదెంచు, పోవుదెంచు, అగు, నెగయు, పోవు, చొచ్చు, పుచ్చు, తోఁచు, నడచు, పఱచు, మొలచు, వీచు—ఇత్యాదులు.

ఉత్వంబుమీ తకారంబు దకారంబగు నగుటచే చొత్తెంచు, పుత్తెంచు, తోఁతెంచు, నడతెంచు, పఱతెంచు, మొలతెంచు, వీతెంచు, ధాతువులలో త కారము ద కారము కాలేదు పోవుదెంచు ధాతువును చిన్నయసూరి విలక్షణార్థములేని ధాతువులలో పరించి నప్పటికీ నన్నయ దీనిని విశేషార్థవంతంగా వాడిన ప్రయోగము కలదు. ''ముని శాప దినంబులు పోవుదెంచె' (భార- ఆది—2 ఆశ్వా.) ఇక్కడ పోవుదెంచు—అనగా ముని శాప దినములు పోయినవి—అనికాక ఈ షదవశిష్టంగా చెల్లిపోయినవి అనియే కవి హృదయం. ముని శాపదినములు పూర్తిగాచెల్లిపోతే పరీక్షిత్తుకు ప్రమాదము గడిచి నట్లే. అతడు రక్షింపబడినవాడే అయి యుండును. అట్లు శాప దినములు పూర్తిగా చెల్లిపోక పోవడంచేతనే తక్షకుడు కుహనా బ్రాహ్మణ వేషంలో వచ్చి పరీక్షన్మహారాజును కాటువేసి చంపగలిగి నాడు. ఈ సన్నివేశంలో గాఢమైన విధి ప్రాతికూల్యం (Irony) కవి చేత నిక్షిప్తమయింది. పోవుదెంచు ధాతువునకు వట్టి స్వార్థ మునే చెప్పకుంటే ఈ ఘట్టము నందలి కష్టాంత నాటకస్ఫూర్తి నుండి వంచితులము అవుతాము. శబ్దరత్నాకరకారులు ఈ యుదా హరణమునే ఇచ్చి స్వార్థమున 'తెంచు' అని వివరించి యూర కున్నారు.

(3) అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యను ప్రయుక్తం బగు నగుచోగు వర్ణంబు విభాషను లోపించు;

క్రియ — 111 సూ.

అరుదెంచు, అరుగుదెంచు ఎతెంచు, ఏగుదెంచు, చను దెంచు;

ఇక్కడ మాకు కొంత విప్రతి పత్తి కలదు అరుగు, ఏగు, చనుధాతువులు ఒకచోట నుండి మరియొకచోటికిపోవు అనునర్థము కలవై యుండగా అరుగుదెంచు మున్నగునవి అభ్యాగతిని — అనగా ఎదురువచ్చుట — అను నర్థముతో ప్రయుక్తమగు చున్నాయని సూరియే చెప్పడంచేత వీటికి విలక్షణార్థ ప్రతీతిని ఇచ్చేశక్తి కలదని భావిస్తున్నాము. అందుచేత వీటిని శబ్ద పల్లవ కోటిలో చేర్చుకో వడం యుక్తమని తలుస్తున్నాము.

(4) అయ్యది పరంబగునపుడు చువర్ణంబు లోపించు;

క్రియ — 112 సూ.

చొచ్చు—చొత్తెంచు; వుచ్చు—వుత్తెంచు;
తోఁచు—తోఁతెంచు.

జంటపదములచే ఏర్పడి విలక్షణార్థాభిధాయకంబులు గాని వాటిని బహుజనపల్లి సీతారామాచార్యులవారు 'ద్వ్యవయవక్రియలు' అని వ్యవహరించినట్లు కనబడుతూంది. అనామకములుగా ఉన్న వాటికి నామకరణం చేసి వ్యవహారయోగ్యత కల్పించారు. ''శబ్ద పల్లవ క్రియలును, ద్వ్యవయవక్రియలును సమాప్తంబులయి పున ర్గృహీతంబులగు చోఁడత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు.'' త్రిలింగ లక్షణ శేషము—క్రియ—25 సూ

ఉదా :—(1) ఆ లతాంగి దోడ్కొని చనుదెమ్మతే నను వు గూడని పక్షమునందు; భోజ—3ఆ 229ప॥

(2) ఇలకుంది వికింజన నిచ్చు నిచ్చియే నని వేస నార్చు. రామా—అర. కాం—2ఆ. 136—ప.

వీటిల్లో మొదటి ఉదాహరణము 'చనుదెమ్ము' అనునది శబ్ద పల్లవక్రియ యనియు, 'వననిచ్చు' అనునది ద్వ్యవయవక్రియ యనియు వ్యాఖ్యానింపబడినది. శబ్దరత్నాకరములో చనుదెంచు క్రియకు వచ్చు, పోవు అను రెండర్థములు కలవు. చిన్నయసూరి క్రియ – 111 సూత్రములో చనుదెంచు పఠించియున్నాడు. ఈయన దృష్టిలో ఇది శబ్దపల్లవముకాదు. స్వార్థమునందే విశ మించు జంటపదముల ధాతువు. భోజరాజీయమునందలి ఉదాహరణ సందర్భమునుబట్టి 'వచ్చివేయుము, రమ్ము'అను అర్థము పొసగుటం బట్టి, ఇది చనుధాతువు మూలార్థముకంటె భిన్నమై ఆ గమ నార్థాన్ని సూచించడంచేతను, కాబోలు ప్రౌఢవ్యాకర్త దీనిని విలక్ష ణార్థయుక్తముగా భావించి శబ్దపల్లవముగా పరిగణించినాడు. ఇది యుక్తంగానే తోస్తోంది. ఫలానా ధాతువు శబ్దపల్లవమనీ, ఫలానా ధాతువు ద్వ్యవయవక్రియ అనీ నిష్కర్షగా సూత్రించడం అన్ని సందర్భాలకు సరిపడకపోవచ్చును. మహాకవి ప్రయోగాల్నిబట్టి ఉచిత మైన మార్పు చేసుకుంటూ ఉండాలి అధర్వణుడు కూడా దీనిని ఆమోదించాడు. ''శబ్ద శక్త్యాప్యపరిప్రాప్తస్సర్వ్యత్రార్థోహి గృహ్యతే। క్వచిద్వి భక్తి వైచిత్ర్యం దృశ్యతే కవిభాషితే'' దీనిని అహోబలు డిట్లు వివరించాడు:

''శబ్దశక్తిమహిమ్నాయో౽ర్థః పరిప్రాప్తః శాస్త్రమాత్రే త్రాదృశ ఏవార్థః ప్రామాణికైర్గృహ్యతేహి. వివక్షితార్థ ప్రతి పాదనాక్షమంపదం సంప్రయోజ్యమిత్యర్థః''. అంగుచేత ఒకధాతువు శబ్దపల్లవమా కాదా అనేది అర్థ సందర్భాన్నిబట్టే నిర్ణయించు కోవాలి. రెండవ ఉదాహరణమందలి 'వననిచ్చు' ద్వ్యవయవక్రియ మాత్రమని సీతారామాచార్యులవారి ఆశయము.

ఇతర భాషల్లో ధాతువులకు నూతనార్థకల్పన ఎట్లా జరుగుతూందని ప్రశ్నించుకొని సంస్కృతభాషా పద్ధతిని స్వల్పంగా సూచించియున్నాము. ఇప్పుడు తెలుగునకు సోదర ద్రావిడభాషయైన కన్నడ భాషలో ఎట్టి విధానమున్నదో కొంత అరయుదము కన్నడ వ్యాకరణాల్లో శబ్దపల్లవ సంజ్ఞలేదనీ, తెలుగులో మనం చెప్పుకునే జంటపద ధాతువుల్ని క్రియాసమాసములని వ్యవహరిస్తారనీ ఇది వరలో చెప్పియున్నాము క్రీ. శ. 13వ శతాబ్దివాడైన కేశిరాజు 'శబ్దమణి దర్పణం' అనే వ్యాకరణం వ్రాసియున్నాడు. ఈతడు క్రియాసమాసాలకు రెండు లక్షణాలు చెప్పినాడట.

(1) వీటిలో అరిసమాస దోషంలేదు. అరిసమాసాల్నే వైరి సమాసం అంటున్నారు.

(2) క్రియా సమాసాల్లో పూర్వావయవము సుబంతపదంగా ఉండాలి.

అధర్వణుడు కూడా 13వ శతాబ్దివాడే.

ఇతడు కూడా శబ్దపల్లవ పూర్వావయవము ప్రథమా విభక్తి పదంకాని, ద్వితీయా విభక్తి పదంకాని, కావచ్చునని వచిం చాడు. దీనినిబట్టి తెలుగు కన్నడభాషల్లో ప్రాచీనపద్ధతి—కవి ప్రయో గాల్లోను, వ్యాకరణ కర్తల అనుశాసనంలోనూ—చాలా సన్నిహితంగా ఉన్నట్లు విశదమవుతుంది. ఇది ఎంతయో హర్షదాయకము. ప్రకృ తము మేము ఉస్మానియా విశ్వవిద్యాలయ కన్నడ శాఖకు చెందిన డాక్టరు బి. రామచంద్రరావుగారి సిద్ధాంత వ్యాసమైన 'A Descriptive Grammar of Pampa Bharata' అనే గ్రంథం ఆధారంగా కన్నడ క్రియా సమాసాల పద్ధతిని యథాశక్తిగా నిర్దే శిస్తున్నాము. ఈ గ్రంథంలోని 8వ అధ్యాయము (పుటలు 152—159 Verb compound) వివరణగా ఉన్నది.

''క్రియా సమాసమనగా ఒకటికన్న ఎక్కువ ధాతుపదాలు కలసి ఒకటిగా అవుట. వీటిల్లో చివర ధాతువునకే తిజంత ప్రత్య యాలు చేరుతాయి. అట్టి జంట ధాతు క్రియాసమాసాలు ఔప చారికమైన అర్థవిశేషాలు కలిగి ఉంటాయి. ఈ నూతనార్థాలను ఆ జంటలో ఏ ఒక్కపదమూ వ్యక్తిగతంగా చెప్పజాలదు.

క్రియాసమాసాలు స్థూలంగా ఈ క్రింది తరగతుల్లో పడ తాయి.

I భూతకాల క్రియాంగము + అగుధాతు సమాపకక్రియారూప ములు

అ) భూతార్థ క్రియాంగము (Past tense stem) + అగు (to become) ధాతువుయొక్క వర్తమాన భవిష్యదర్థక తిజంత సమాపక క్రియారూపములు ఇందులో'ఆగుక్రియ' తెలుగు ''అగు క్రియ'' అని తెలియుమనే ఉన్నది.

ఆ) భూతకాల క్రియాంగము + అగు ధాతు భూతకాల సమా పక క్రియారూపమగు 'అత్తు'.

II ధాతుసమాసములు.

అ) ధాతువు + సమాపకక్రియారూపము.

ఆ) నామపదము + సమాపక క్రియారూపము.

III సమాపక క్రియా రూపము (+ నామ పదము) సమాపక క్రియ.

పై వాటిల్లో —

1) భూతార్థక్రియాంగము + ఆగు ధాతు సమాపక రూపములు

అ. ధాతువుల భూతకాలి కాంగములకు ఆగు ధాతు వర్తమాన భవిష్య దర్థక రూపములు చేర్చుటచే ఆ ధాతువుల వర్తమాన భవిష్యదర్థక రూపములు ఏర్పడును.

బంద (ఉ) అప్పన్ — he will be coming literaley Meaning = having come, he will be coming.

తెలుగులో—అతడు రాగలడు అనే రూపాన్ని అతడు వచ్చిన వాడు కాగలడు. వచ్చినవాడగును.

కొంద (ఉ) అప్పెన్—I shall kill నేను సంహరింతును లేక సంహరించిన వాడనగుదును.

కాదిద (ఉ) ఆపిర్ — You are fighting. —(తె) మీరు యుద్ధము చేయుచున్నారు లేక మీరు యుద్ధము చేసిన వారగు చున్నారు.

పై వాటిల్లో 'అన్' ప్రత్యయాంతము ప్రథమ పురుషైక వచనము 'ఎన్' ప్రత్యయాంతము ఉత్తమ పురుషైక వచనము. 'ఇర్' అనునది మధ్యమ పురుష ప్రత్యయము. ఇవి తెలుగు డుఁ, ను, రు ప్రత్యయములతో సంవదిస్తాయి.

ఆ) అటి*ద (ఉ) అత్తు — It got destroyed —అది నిర్మూలింప బడినదయినది.

ఉరిద (ఉ) అత్తు — It got burnt'up — అది కాలిన దయినది.

పై ఉదాహరణాల్లో ఒక విశేషం గుర్తించవచ్చును. ప్రతి దాని యందును 'అగు' ధాతువు అనుబంధముగా వస్తూంది. ఇటు వంటి దానినే అథర్వణుడు అర్ధఘటకక్రియాయోగంగా చెప్పాడు. నన్నయ ప్రయోగించిన 'సమ్మనేర నయ్యెదను' 'నీ పంపు సేయ రైరి' అను వాటికి, ప్రతి రూపాలు పై కన్నడ ప్రయోగాలు. ఇవి పంప భారతము నుండి ఉద్ధరింపబడినవి. పంప మహాకవి క్రీ. శ. 950 ప్రాంతమువాడు. నన్నయ భట్టారకునకు ఇంచుమించు ఒక శతాబ్దము పూర్వుడు. ఈ మహాకవు లిద్దరూ 'అగు' ధాత్వను బంధ రూపాల్ని ప్రయోగించారంటే ఇది తెలుగు కన్నడ భాషల ప్రాచీన సంప్రదాయంగా నిరూపితమవుతూంది.

II ధాతు సమాసములు (Root Compounds)

అ) వీనిలో ధాతువు + సమాపక ధాతు రూపము ఉండును. డా॥ రామచంద్రరావుగారి కథనము ప్రకారం ఈ తెగ జంట క్రియల్లో ఆసమస్త ధాతువు, పూర్వావయవమైన ధాతువు అర్థమునే వెలార్చును. ఉత్తరావయవమైన ధాతువునకు ప్రత్యేకార్థమేమియు ఉండదు. ఇవి తెలుగులోని అగుదెంచ వంటి ద్వ్యవయవ క్రియల శ్రేణికి చెందినవిగా కన్పించును ఉదా. + తర్ — (to bring) తర్=తెచ్చు.

ఉకుతర్ — to drop like tears — కన్నీళ్ళు తెచ్చు తెలుగులో నామ పద పూర్వంగానే వాడగలము.

నడెతర్ — to approach. నడతెంచువంటి రూపము

ఎయ్+తర్ to approach. ఏతెంచువంటిది.

ఆ) Noun root + head Verb.
ప్రాతిపదికము + క్రియారూపము

+ కొళ్, గొళ్=పట్టుకొను, తీసికొను, అంగీకరించు. ఇది తెలుగు 'కొను' ధాతు పర్యాయముగా ఉన్నది.

అడిగొళ్ — to take to heels, to run away పాదముగొను. తెలుగులో పారిపోవు.

ఆన్కె — గొళ్ — to resist or oppose
తె॥ ఆంకగొను, ఆంకపెట్టు.

ఇదిర్గొళ్ — to meet (out of respect or love)
తె॥ ఎదురుకొను, ఎదురేగు;

కణ్గొళ్—to catch the eye—కన్గొను, కన్నుదనియు.

పగెగొళ్ — to become hostile — పగగొను.

పెసర్గొళ్ — to name — పేర్కొను

భయంగొళ్—to be alarmed —భయముగొను, భయపడు.

మార్ — కొళ్ — to oppose — మార్కొను.

సూరెగొళ్ — to Plunder — చూఱగొను.

కొన్ని క్రియా సమాసములలో 'ఉ'కారాంతము మీద 'ప' కారము వచ్చుట కన్పిస్తుంది. ఆను (Skt-life) అసుంగొళ్ ప్రాణము గొనువుదు (Union Friendship) పుదుంగొళ్ పొందుకొను కావచ్చును.

అట్టు—to chase —అట్టుం — బరి—గొళ్ to chase or run after. తరిమికొను కావచ్చును. బా. వ్యా—క్రియ 110లో తెంచు ధాతువు అను ప్రయుక్తమగునపుడు 'ఉత్వంబుపై' దకారంబగునని సూరి విధించుట ఇక్కడ స్మరింపదగియున్నది

* ఇది తెలుగులోని వింత యక్కరము. మధ్య గీటు తీసివేసిన శకట రేఫమువలె కూర్చవలెను. ఇది ప్రాచీన భాషలో ఉండేది. ఇప్పుడు లేదు.

ద్రుతము ఇక్కడ కానరాకున్నను ద్రుతకార్యమగు సరళాదేశము జరుగుచున్నది. అదియు ఉత్వముమీద అనుట విశేషము. కన్నడములో 'అసుంగొళ్' అను స్థలమున ఇట్టి మార్పే జరుగుతూంది.

IV + కెయ్—గెయ్— to do, to make - తె చేయు;

ఒళ్ళి—కెయ్--to do good తె—మేలుచేయు

అరసుగెయ్—to rule—రాజ్యముచేయు.

దయెగెయ్— to grant with Royal grace తె — దయ చేయు.

పొల్ల—కెయ్—to commit a vile or sinful act తె—పొల్లచేయు.

బిజయంగెయ్—విజయం చేయు.

సెఱెగెయ్—to imprison —చెఱచేయు, చెఱవెట్టు.

+పోగు—వోగు to go. పోవు అను బంధ ధాతువుగా రూపములు

ఇదిర్—వోగు—to meet—ఎదురుపోవు—లేక ఎదురేగు.

ఉడివోగు— to be broken to pieces. ఉడివోవు.

కోళ్—పోగు— to be come prey. కోల్పోవు

+ ఆడు = to move.

అల్ల—ఆడు— to move, to shake. తె—అల్లాడు.

ఓల + ఆడు — to sportin water. ఓలాడు, ఓలలాడు

విర్దు + ఆడు = to make a feast. తె. విందుచేయు.

+పడు—వడు, మడు, బిడు = to get, to obtain, to incur, to under go.

ఒడమ్బడు to agree - ఒడంబడు

కట్టువడు — to be tied, to be imprisoned తె. కట్టువడు.

మూగు—వడు—to be silent or nute మూగవడు. మూగవోవు.

VI పెక్కు జాతీయములు క్రియాసమాసాలుగా ఉంటాయి. వీటిల్లో పూర్వపదము ఒక శరీరావయవంగా ఉంటుంది. ఉత్తరపదము ధాతువు

అడి foot + క్రియ

అడిగొళ్—to take to heel, to run away.

తె. పాదముగొను, పారిపోవు; కాలు జాడించు వ్యవహార రూపము.

కణ్ — the eye. + క్రియ

కణ్-గాన్ — to see with the eye. కన్గాను, కన్ను గానడు — వ్యతిరేకార్థము.

కణ్ — దెరె — to open the eyes. కన్దెరచు, కనువిప్పు అనుట.

కణ్ — ముచ్చు - to shut the eye, to sleep కన్ను మూయు.

కెయ్ — the hand + క్రియ

కెయ్—కొళ్—to accept, to obtain - కైకొను.

కెయ్యి — ఒడ్డు — to Join hands so as to receive some thing. చేయొడ్డు, చేయొగ్గు

కెయ్ — వీసు — to wave the hand before fight begins. చెయివీచు.

బాయ్ — the mouth. + క్రియ

బాయ్ — విడు — to cry — వావిడుచు, ఇట్టివే వావిడిచి అడుగు, వాయెత్తి ఏడ్చు.

బెన్ — the back + క్రియ

బెన్నిట్టు— having turned back, having retreated. — వెన్నిచ్చు.

బెంకోళ్ - to follow, to run after. వెనుకొను, వెన్నాడు ఇట్టిదే.

ఎర్దె — the mind. + క్రియ

ఎర్దెగొళ్ — to captivate the heart.
ఎదగొను — మనస్సు నాకర్షించు అనుట.

ఎర్దె — ముట్టు — to touch the heart — ఎదముట్టు.

మెయ్ — the body + క్రియ

మెయ్—దెగె—to run away, to keep oneself away. మెయిదాచు. ఒడలు దాచుకొనుట.

మెయ్—మఱె — to forget one self—to become Un-Conscion3. మైమఱచు.

మెయ్—వెర్చు—to be inflated with Pride.
—మెయివెంచు, విజృంభించు అనుట.

డాక్టరు బి. రామచంద్రరావుగారు ఈ అధ్యాయముయొక్క సారాంశము నిట్లు తేల్చిరి: పెక్కు క్రియా సమాసాల్లో అంత్యావయవము అగు, పోగు, తర్, కొళ్ / గొళ్, కెయ్ / గెయ్, ఇఱి, ఇక్కు, పడు, ఆడు, కిడు, ఇడు, — ధాతువుల తిజంత రూపంగా ఉంటుంది. ధాతువుగాని, నామ పదముగాని వీటి పూర్వావయవంగా వచ్చి, వాటి సహజార్థంకన్న భిన్నమైన అర్థాన్నిఇస్తూ ఉంటుంది. కొన్ని క్రియా సమాసాల్లో అంత్యావయవమైన—తర్, కొళ్, గొళ్ — విలక్షణార్థాన్ని దేన్నీ ప్రకటించదు. ఈ సన్నివేశం తెలుగు భాషకు కూడా చాలాదగ్గరగా వర్తిస్తుందని మీది అధ్యయనంవల్ల విశదమవుతూంది. రెండు భాషల్లోనూ అర్థ ఘటక క్రియా యోగం ప్రాచీన భాషలో కనబడుతూంది శబ్ద పల్లవ క్రియల వ్యవస్థ కూడా చాల సన్నిహితంగా సంవదిస్తూంది.

వర్తమాన ఆంధ్రభాషలో శబ్దపల్లవక్రియాకల్పన బాగా విస్తృతమైనట్లే కనబడుతూంది. ఇది భాషకు సహజమైన పరిణామమని చెప్పక తీరదు. సమాజములోని సాంఘిక సంబంధాలు చాలా సంకీర్ణం అవుతున్నాయి. శాస్త్రవిజ్ఞానం అపారంగా పెరుగుతూంది. ఈ క్రొంగ్రొత్త భావసంఘర్షణను ప్రకటించాలంటే తెలుగుకి శబ్దపల్లవ ప్రయోగావశ్యకత బాగా పెరుగుతూంది. ఎన్ని శతాబ్దాలు సంస్కృతభాషతో సహయోగంఉన్నా సంశ్లిష్ట పదభాష యైన తెలుగు, ప్రత్యయాంత భాషగా మారలేదు. ఏ భాష కూడా తన ఆనువంశికమైన లక్షణాల్ని త్యజించదు.

ఆధునికాంధ్ర భాషలో శబ్దపల్లవ ప్రాచుర్యానికి నిదర్శనంగా మాకు దొరికిన సాక్ష్యాన్ని సంగ్రహంగా నిర్దేశిస్తాము. శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారి ఆంధ్ర శబ్దరత్నాకరాన్ని—శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు, ప్రౌఢ్య నిఘంటువు—లతో పోల్చి చూడగా ఆంధ్రశబ్ద రత్నాకరంలో 1780 క్రొత్త ధాతువులు చోటు చేసుకొన్నాయి. వీటిల్లో 1497 శబ్దపల్లవ ధాతువులుగా ఏర్పడుతున్నాయి. 283 మాత్రమే ఇతర ధాతువులుగా కనబడ్డాయి. ఇందులో నికరమైన శబ్దపల్లవాలు (అంటే విలక్షణార్థాభిధాయకత్వం కలవి) ఎన్నో, కేవల ద్వ్యవయవ క్రియలెన్నో సావధానంగా పరిశీలించాలి. పైగా వీటిల్లో నామపూర్వపదములెన్నో, ధాతు, తదితర పదపూర్వములెన్నో వింగడించి చూడాలి. ప్రథమ దర్శనాన్నిబట్టి చూస్తే శబ్దపల్లవాల్లో సుబంత పదపూర్వకత్వమే అత్యధికంగా కనబడుతూంది. పూర్వపదం ధాతువైనవీ, విశేషణ, అవ్యయ, పూర్వపదమైనవీ తక్కువ తక్కువగా కన్పించాయి. దీన్నిబట్టి చూస్తే అధర్వణాచార్యులవారు ప్రకటించినదే—ప్రథమాయా ద్వితీయాయాస్సంబంధస్త్ర సమ్మతః — అనే దర్శనమే తెలుగు భాషకు ఎక్కువ సహజమేమో అనిపించకమానదు చిన్నయసూరి మున్నగువారు సందర్శించినది కూడ తప్పుకాదు. ప్రాచుర్యం విషయంలో మొగ్గు అధర్వణ సందర్శనంవైపే చూపిస్తూంది.

కన్నడ భాషా సాంప్రదాయాల విషయమై తోడ్పడిన డా. బి. రామచంద్రరావుగారికిని, సంస్కృతభాషా సంప్రదాయాల విషయమై అవసరమైన వివరణ ఇచ్చి, తోడ్పడిన డాక్టరు పుల్లెల రామచంద్రుడుగారికిని, మా కృతజ్ఞతలు.

# ఆర్తవగీతాలు ఆరు

## "సాంధ్యశ్రీ"

విశ్వోదయ తేజాన్ని
నిసర్గ సుందర సంకేత శబ్దాలుగా మలచి
విక్షిప్త శిల్పంగా
నిక్షిప్తం చేసిన
ఒక అనూహ్యశక్తిని
ఆత్మలో అనుసంధానంచేసి
ఆరాధించే కళగా ...
విశ్వ మేధస్సులో
కుంచె ముంచిన
ఈ కల్పనానంద ప్రోత్సాహం
రస్సైక జీవుల రసనాగ్రంపై
శక్తి సౌందర్య సుధగా ...
గగన పత్రంపై
ఈ
చెట్ల కలాలు
ఏ
నక్షత్ర అక్షరాలకు
రూపకల్పన చేస్తాయో
నీలి మబ్బుల దర్బారుగోడల నగిషీలో
ఏ ఉలి మొనలకు
ఊపిరి పోస్తాయోనని
మనసు పొరలను తెరపించే
ఒక జిగీషగా ...
నా లేఖినీ శిలీ ముఖాన్ని
పైకెత్తిన ఉద్రేకాగ్రంలో
ధ్వనించాయి ...
జలపాత సితార
రహస్తంత్రీ నిర్వాణ క్షేత్రంలో
కాసార సముత్పన్న
అదృశ్య వాయులీన స్వరగాత్రంలో
ఆర్తవ గీతాలు
ఆరు ...

వనజ్వాలా రుణిమ చైత్రాధరంతో
వసంత వాల్లభ్యాన్ని
హేమగాత్రంతో సామగానం
చేసినట్లు ...
గ్రీష్మాతపబాధిత
కాలకన్యక
శీతార్ద్రియై
ఈ రమ్య విపిన నిర్ఝరతటాన
నగ్నంగా నిలచి విడిచిన
నిట్టూర్పు శబ్దమట్లు ...
కరి మబ్బుల గమిగని
పురి విప్పిన నెమలిని
చూచి
వని
ఆకాశ పావనికై
మేఘమల్హార మాలపించినట్లు
వన పవనంపై తేలుతూ
పండు వెన్నెల చెండు చుట్టుకొని
శారదేందిర
విలాస లావణ్యాన్ని అంజనంగా
నా కళ్ల కమరస్తూ
విరహ గీతాన్ని వినిపిస్తున్నట్లు ...
తెలిమంచు
ముత్యాల దండలల్లుతూన్న
తీగచాన
తోట బాటలో
గాలిపాటతో పల్లవిస్తున్నట్లు ...
ఆకు కోక లూడిపోతుంటే
సిగ్గిలి శిరమొంచిన
సంధికాలానికి
ఆ మని దయచేస్తోందని
ఎక్కడో హిందోళ ...

డాక్టర్ ఎస్. గంగప్ప

# జానపదసాహిత్యం - సిరియాలునికథ

"...ధరణి లోపలను
గరమర్థి నూరూర సిరియాలు చరిత
మేటియై చను భక్తికూటు వలందుఁ
బాటలుగాఁ గట్టి పాడెడువారుఁ
బ్రస్తుతోక్తుల గద్య పద్య కావ్యముఁ
విస్తారముగఁజేసి వినుతించువారు
నటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
పటు నాటకంబుల నటియించువారు
నును మాడి వీరు వారననేల కూడి
కనుగొనరోళ్ల రోకళ్ల బాడెదరు
అనుమాన మొక్కింతయునులేదు..." (బసవ పురాణము - చతుర్థాశ్వాసం—పు. 289; 290)—అని పాల్కురికి సోమనాథుడు పేర్కొవడం సిరియాలుని కథా ప్రాధాన్యాన్ని వెల్లడిస్తుంది. 'గద్య పద్య కావ్య'రచనతోను, నాటకాభినయంతోను మాత్రమేగాక 'పాటలుగా గట్టి పాడెడివారు', 'రోళ్ల రోకళ్ల బాడెదరు'—అని పాల్కురికి చెప్పినట్లు ఏ సాధన సంపత్తిలేని పామర ప్రజలు పాడు కోడానికి తగినట్లు పాటలు కట్టి పాడడం సహజమే. జానపదులు సిరియాలుని కథఅని చెప్పకుండానే పాడుకోవడం విశేషం. ఈ సిరి యాలుని కథను పాల్కురికి "రోళ్ల రోకళ్ల పాడెద"రన్నట్లు దంపుళ్ల పాటగా పాడగా నేను వినలేదు. కానీ కలుపు తీతల సమ యంలో పాడుతూండగా నేను విన్నాను. అనేకమైన పాటలతోపాటు నేను ఈ పాటనూ సేకరించాను. పాల్కురికి సోమనాథుని మాటల వల్ల సిరియాలుని కథకుగల ప్రాముఖ్య ప్రాచుర్యాలెంతటివో మనకు విశదమవుతున్నాయి.

పాల్కురికి సోమనాథుడు బసవ పురాణం చతుర్థాశ్వాసంలో సుమారు తొమ్మిది (267–275) పుటల్లో ఈ సిరియాలని కథను చక్కగా వివరించాడు. ఇదే కథను ఆధారం చేసుకొని శ్రీనాథుడు హరవిలాసంలో ప్రథమ ద్వితీయాశ్వాసాల్లో ప్రపంచించి (45 పుటలు) తన సహజ ప్రౌఢ కవితా పాటవంతో రచించడం గమనించదగ్గ విషయం. పాల్కురికి ఆకాంక్షించినట్లే ఈ సిరియా లుని కథ పాటలుగాను, గద్య పద్యాత్మకంగాను ప్రజలలో ప్రాచుర్యం పొందిందని మనకు స్పష్టమవుతుంది. పాల్కురికి సోమనాథుడు ఈ కథలో తండ్రిని సిరియాలుడనీ, కుమారుని సిరాలుడనీ మొదట పేర్కొని, తరువాత తండ్రి కొడుకులను "చిఱుతొండడును... సిరాలు చాలు" (పు 289)ననీ పేర్కొన్నాడు. ఈ మావనని గ్రహించే కాబోలు శ్రీనాథుడు తండ్రి చిరుతొండడనీ, కుమారుని సిరియాలుడనీ పేర్కొన్నాడు తన కావ్యంలో. పాల్కురికి సిరాలుని తల్లిని 'సంగళవ్వ' అని పేర్కొనగా, శ్రీనాథుడు తిరువెంగనాంచి అన్న పేరుంచాడు. ఇది ఇలావుండగా జానపదుల పాటలో మాత్రమే ఎవరిపేర్లు లేకుండానే కథ నడిచింది. ఇదొక విశేషం. చిరుతొండ నంబి భక్తిని పరీక్షింప మాయాజంగమ వేషంలో వచ్చిన ఈశ్వ రునికి తిరువెంగనాంచి పుత్రుడు సిరియాలుని వధించి వండిపెట్టగా భక్తికి మెచ్చి, సంతోషించి వారి కుటుంబాన్నే గాక కంచిలోని ఏడు వాడలవారి నందరినీ కైలాసానికి పరమేశ్వరుడు కొనిపోయిన కథ ఇది.

ఈ సిరియాలుని కథను కలుపుతీతల సమయంలో పల్లె పట్టులలో పామర ప్రజలు పాడుకొంటారు. ఇందలి భాష జాన పదులకు సహజమై, నాతి కఠినమై వుంది. సహజసుందరమూ, నిసర్గ మనోజ్ఞమూ అయిన కవిత ఇందు జాలువారుతూ ఉంటుంది. సహృదయ హృదయాల్ని రంజింపచేసే చక్కటి రస నిష్యంది గుణం సైతంవుంది దీనిలో. మాయజంగానికి వంట వండిపెట్టి, భోజనం చేయమనగా, "బాలుకూరలు" లేనిది భోజనం చేయనంటాడు ఆ మాయజంగం. తన ఏకైక పుత్రుని ఆ తల్లి వధించి వండిపెట్టగా "బాలుపొత్తు"లేనిది భోజనం చేయనంటాడు. అప్పుడా కన్నతల్లి పుత్రుని పిలుస్తుంది. పుత్రుడు వస్తాడు. జంగం మెచ్చుకొంటాడు ఇదీ ఈ పాటలోని కథ.

"నడిమి దొంతిలేవి[1] నల్లకేసరులు
గీసి గీసి గిద్దె దొడ్లకేదీశా
శివుడోయమ్మ సిరిగల బాలుడోయమ్మ
గీసి గీసి గిద్దెదొడ్లకే దీశా
ఆరి యాకుల్లోన వడ్లారపోశా ||శివు||

ఏళ్లతోఁ సెరిగ[3] సన్నఁపు
నూదులతో బీము[4] పోటేశా ||శివు||

కంచుకుండ్లా కడిగి కం ఎసురుపోసి
అంటుకుండ్లా కడిగి అగ్గిరవిలేశా ||శివు||

అగ్గిరవిలేసి—గంధపు చెక్కలతో గజమంటవేశా ||శివు||

గజమంటవేసి—ఏరిన్ని సన్నబీము ఎసురుపోశా ||శివు||

గిలకల్ల తెడ్డేసి గిర్రున్న తిప్పొ
మేలంపు తెడ్డేసి మెదుకొత్తి చూశా ||శివు||

మేలంపు తెడ్డేసీ మెదుకొత్తి చూసీ
జాలారి సిబ్బేసీ జల్లన్న వంచా ||శివు||

జాలారి సిబ్బేసీ జల్లన్న వంచీ
కూడూ కూరాకు చేసీ కుదిటప్పొగించా ||శివు||

కూడూ **కూరా**కుచేసి కుదిటప్పొగించీ
చామంచి [5] పూలల్లే చెంబుల్లె తోమా
గన్నేర **పూ**లల్లే గిన్నెల్లే **తో**మా ||శివు||

''భోంచేతు రావయ్యి ఎలిది [6] జంగామ !''
బాలు కూరలు లేనిది భోంచేయనే మంగా'' ||శివు||

''ఆరు ఒట్లేస్తాను **అరటి** పండిస్తాను
అన్నల్లు పిలిసేరు రారా బాలుడా ||శివు||

పది అట్లేస్తాను పనస పండిస్తాను
బావల్లు పిలిసేరు రారా బాలుడా'' ||శివు||

అందెల్ల మూగులతో **ఆ**డుతా వొచ్చా
వొస్తున్ని బాలున్ని తల వుత్తరించా [7] ||శివు||

వొస్తున్ని బాలున్ని తల వుత్తరించీ
బాలున్ని తల గాట్లోన పెట్టా ||శివు||

గాట్లో పెట్టిన తల **గూ**ట్లోనా పెట్టా
కంకుణాలు [8] చేత గజ మందుకోనా ||శివు||

కంకుణాలు చేత గజమందుకోనా
మానవతి కన్నీరు మనసందే నిలిపా ||శివు||

మానవతి కన్నీరు మనసందే నిలిపా
వజ్రంపు కన్నీరు వాలె కొలుకులకీ ||శివు||

మానవతి కన్నీరు మనసందే నిలిపీ
ఉంగరాలచేతా **ఊ**పీ పోటేశా ||శివు||

ఊపి పోటేసీ–కూడు కురాకుచేసి కుదిటప్పొగించా ||శివు||

కూడు కురాకు చేసి కుదిటప్పొగించా
''**భో**ంచేతువు రావయ్య ఎలిది జంగామ ! ||శివు||

బోంచేతువు రావయ్య ఎలిది జంగామ !''

''బాలు పొత్తు లేనిది **బో**ంచెయ్యనే మంగా ||శివు||
బాలు పొత్తులేనిది బోంచెయ్యనే మంగా

అపుడు పిలిచిన పిలు**వు**ను మల్లా పిలీ మంగా'' ||శివు||

''ఆరు అట్లేస్తాను అరిటి పండిస్తాను
అన్నల్లు పిలిసేరు రారా **బా**లుడా ||శివు||

పది అట్లేస్తాను పనస పండిస్తాను
బావల్లు పిలిసేరు రారా బాలుడా'' ||శివు||

అందెల్ల **మూ**సలతో **ఆ**డుతా వొచ్చా
''ఒప్పితినే మంగా నిన్ని వొప్పితి'' ||శివు||

ఇలా ముగుస్తుంది ఈ పాట.

ఈ కథలో సంక్షిప్తత, సరళతా జానపదులకు సహజరీతిని కుదిరి ఉన్నాయి. **ఈ** గుణాలు భాషలోను ఉండడం గమనించవచ్చు. వంటా వార్పూ, వంట సామగ్రి సమస్తమూ పల్లెటూరి **వాతావర**ణానికి సముచితమూ, సహజ**మూ** అయినట్లు వర్ణితం కావడం ఇందులో ప్రాధాన్యం వహిస్తుంది. ''బాలు **కూ**రలు లేనిది **బో**ం చేయనే మంగా'' **అంటా**డు జంగం '**బా**లు కూరలు' అంటే బాలుని వధించి, వండిపెట్ట మనడానికి ఎంతచక్కగా చెప్పబడిందో సహృదయ హృదయులు గ్రహించగలరు. ''బాలు పొత్తు లేనిది బోం చేయనే మంగా'' అని జంగం అనడంలో ఔచిత్యం ఉంది. పైగా ఈ రెండూ ఆ తల్లికి జంగమయ్య పైగల భక్తిని పరీక్షించే నికషోపలాలు. పాట ఎంత సహజ రీతిని నడచిందో—

''గిలకల్ల తెడ్డేసీ గిర్రున్న తిప్పా
మేలంపు తెడ్డేసీ మెదుకొత్తి చూశా
మేలంపు తెడ్డేసీ మెదుకొత్తి చూసీ
జాలరి సిబ్బేసీ జల్లన్న వంచా
జాలారి సిబ్బేసీ జల్లన్న వంచీ
కూడు కురాకు చేసీ కుదిటప్పగించా.'' –

ఈ పంక్తులే నిదర్శనం. ఈ గేయంలో చక్కటి కవిత సైతం చోటుచేసుకోవడంవల్లనే దీన్ని మనం జానపద సాహిత్యంలో చేర్చడానికి వీలైంది—

''చామంచి **పూ**లల్లే చెంబుల్లెతోమా
గన్నేరు **పూ**లల్లే గిన్నెల్లేతోమా''—అనడం**లో** చక్కటి ఔపమ్యం ప్రయుక్తం కావడం ఆహ్లాదజనక విషయం. తనయుని తల **ఉ**త్తరించిన కన్నతల్లి మనసులోని మమతా మను కారాన్ని ఎంతగా వెనక్కి నెట్టినా ఆ మానవతి కన్నీరు మనసందే నిలిపా — అని చెప్పినా, ఆ వెనుకే ''వజ్రంపు కన్నీరు వాలె కొలుకు లకీ''—అనడం ఆమె హృదయం సువ్యక్తం చేయడం జరిగింది ''వజ్రంపు కన్నీరు'' సహృదయ హృదయరంజక ప్రయోగం.

తిరువెంగనాంచి పుత్రుని పిలవడం కరుణ రసార్ద్ర కలితమై, సర్వజన హృదయాల్ని ఆకట్టుకొని, సానుభూతిని ప్రకటింప జేస్తుంది.

''పూర్వజన్మార్జిత భూరికర్మముల
గుర్వణగించు నా కొడుక! రావయ్య!''—

అంటూ సంగళవ్వ ఎలుగెత్తి పిలిచినట్లు కరుణ **కరుడు** కట్టేలా పాల్కురికి సోమనాథుడు మూడు పుటల్లో (272–274) మనో జ్ఞంగా వర్ణించాడు. ఇలాగే—

''రారావణిగ్వంశ వారాశిహిమధామ !

రారావిక స్వరాంభోరుహాక్ష!'' (2–134) అంటూ రాల్లరిగేలా పిలిపించాడు తిరువెంగనాంచితో శ్రీనాథుడు. జానపద గేయంలోను ఆ తల్లి...

''ఆరు అట్లేస్తాను అరటి పండిస్తాను
అన్నల్లు పిలిసేరు రారా బాలుడా!
పది అట్లేస్తాను పనస పండిస్తాను
బావల్లు పిలిసేరు రారా బాలుడా !'' అంటూ జానపదులకు సహజమైన రీతిని కరుణరసం ఉట్టిపడేలా పుత్రుని పిలుస్తుంది. ఆ తల్లి పిలుపువిన్న సిరియాలుడు —

''అందెలు మ్రోయమోక్షాంగనడాయ''—వచ్చాడని పాల్కురికి వర్ణించినట్లే జానపద గేయంలోను—

''అందెల్ల మూసలతో ఆడుతావొచ్చా''—అని వర్ణితం కావడం మనం మెచ్చుకోదగ్గ అంశం. ఇంక ఈ జానపదగేయంలో కథాకథనంలోను చక్కటి ఔత్సుక్యాన్ని ప్రేరేపించే గుణం కూడా ఉండడం మరో విశేషం. ఇది సామాన్య ప్రజల సహజ సుందరమూ నిసర్గ మనోజ్ఞమూ అయిన కవిత! మాయ మర్మ మెరుగని మామూలు మనుషుల ఎదలోపలి సొద!

---

1. లోనివి, 2. వేళ్లతో, 3. చెరగు, 4. బియ్యం. 5. చేమంతి, 6. వెలది – అంటే నిర్మలం, ప్రసన్నం అని అర్థం. 7. ఉత్తరించా, 8. కంకణాలు.

---

# మేఘ సంగీతం

## శ్రీ నందిని సిధారెడ్డి

పెద్దగా
సంగీతం వాయిస్తామని
గాలి బుగ్గల్లా ఎగిరే చేతులకన్నా —
ఏ చేతులూ లేని
మేఘాలే నా హృదయాన్ని కదిలిస్తాయి !
జీవితాల్ని లయల్లో
ఇమిడ్చి
అసలు సంగీతాన్ని వాయిస్తాయి !!
ఆవేశం వచ్చినప్పుడు
మేఘాలు ఒళ్లంతా చిల్లులు చేసుకుని
చినుకుల్ని వదుల్తాయి —
మేడ
తడవకుండా కప్పుకున్న
రేకుల మీద పడి
ఆ చినుకులే 'ధృతగతి' ని వాయిస్తాయి !
సాగదీసిన రోడ్డుల్లా నిర్మించబడ్డ
చూర్ల గుండా
బయటికి నడిచి
బిందె మీద పడ్డప్పుడు
ఆ చినుకులే —
'సమగతి' ని వాయిస్తాయి !!
పిల్లి లేవనెత్తిన 'పెంకు' ని కాదని
మట్టిని చీల్చుతూ
బక్క కర్రల గుండా పాకి
ఖాళీ పాత్రల్లో పడ్డప్పుడు
ఆ చినుకులే —
'విలంబిత గతి' ని వాయిస్తాయి !!!
రాలిన ప్రతి చినుకూ
'లయ' పాటిస్తూనే
జీవితాల్ని
జీవ బద్ధం చేస్తుంది -

శ్రీ ఎమ్. పార్థసారధి

# కౌగిలి

*(గత సంచిక తరువాయి)*

## మనోరమ మొగుడు

పెళ్లికి సంవత్సరం క్రితంనుండీ ఒకరి కొకరు తెలుసు. రోజూ గంటలు గంటలు కబుర్లు చెప్పుకున్నారు. పెళ్లి తర్వాత సరేసరి. అనుభవాలు, అభిప్రాయాలు, ఆశయాలు, కలలు, బలహీనతలు, వాగ్దానాలు, ఎన్నో—కాని ఇన్ని చెప్పుకున్నా ఇంకా కొన్ని మిగిలి పోతాయి అవి ఎప్పుడో, ఎందుకో అనుకోకుండా, అప్రయత్నంగా బైటికి వస్తాయి. అప్పుడు ఇన్నాళ్ల మాటలూ, అనుభవాలూ అబద్ధమవుతాయి. లేకపోతే ఎందుకు కొన్నాళ్లకు ఒకరిమీద ఒకరికి విసుగెత్తుతుంది, కోపం వస్తుంది? అప్పుడు వాగ్దానాలు చేసిన వాళ్లకన్నా, వెయ్యనివాళ్ళే ఎక్కువ క్షేమంగా వుంటారు. వాళ్లు 'గిల్టీ'గా వుండక్కర్లేదు.

.. ... ... ...

బాలూ లేడీస్ మాన్‌కాదు. అందంగా వుండడు పైగా సోడాబుడ్డి కళ్లద్దాలు, వంకర కాళ్లతో అతడు మరికొంత ఎబ్బెట్టుగా వుంటాడు అదీగాక, కబుర్లు చెప్పటం, వూరికే మాట్లాడటం అతడికి వాతగాదు. కాని వాళ్ల కొలీగ్స్‌లో చాలామందికి అతడంటే అసహ్యం వుండటానికి కారణం అతడికున్న ఈ అలవాట్లూ, శారీరకమైన లోపాలూ కావు. వాళ్ల కోపకారణం అతడు ఆర్. ఎమ్. దగ్గర పి. ఎ. కావటం. వాళ్ల దృష్టిలో పి.ఎ. అంటే సింహం దగ్గర నక్కలాంటి వాడని. అందువల్ల అతన్తో చాలా మంది సన్నిహితంగా మాట్లాడరు మాట్లాడే కొద్దిమంది అతడి తరహా మనుషులు ఏవో వ్యవహారాలు మాట్లాడతారు. నిజానికి బాలూ కూడా యిన్నాళ్లూ మరే రకమైన స్నేహం గురించీ ఆలోచించలేదు. అతనికి అవసరమనిపించలేదు. ఇటీవల పెళ్లి తర్వాత కొద్దిగా 'పాప్యులారిటీ' పెరిగి ఇద్దరిపేర్లూ లంకె పడటంతో మంచికో చెడ్డకో అతడి గురించి మాట్లాడుకోవటం పెరిగింది మొదట జెలసీతో అతడివైపు చూసిన కళ్లు యిప్పుడు జాలిగా, సానుభూతిగా, పరిహాసంగా చూస్తున్నట్టనిపించింది ఎంత డబ్బున్నా, హోదావున్నా, మంచివాడైనా, గొప్పవాడైనా, తిరుగుబోతు పెళ్లాం మొగుడికి ఈ లోకంలో గౌరవంలేదు. ఓమధ్యాహ్నం రిసెప్షనిస్టు—ఆమె పేరు నీలం ఫిరోజ్‌వాలా—ఫోన్ చేసింది.

''మొన్న ఒకరోజు, మీ ఆవిడ ఆలస్యంగా యింటికొచ్చిన రోజున, మేం మాటినీకి వెళ్లాం. అక్కడినుండి మా యింటికెళ్లి కాఫీతాగి యింటికొచ్చింది మనోరమ. సారీ, ఆ నాటి ఆలస్యంవల్ల మీ మధ్యనేవైనా గొడవలొస్తే దానికి బాధ్యత నాదే.''

బాలూకు ఆడవాళ్లతో మాట్లాడ్డం అలవాటులేదు తడబడుతూ, 'లేదు లేదు'. ఆవిడ అలా చెప్పిందా? నేనసలు ఎక్కడికెళ్లావని గూడా అడగలేదు పైగా మా మధ్యన డిఫరెన్సెస్ కూడా ఏమీ లేవు.

కాని రిసెప్షనిస్టు మిస్చీవస్‌గా.

''కానీ మొగుడన్న తర్వాత 'ఎక్కడికెళ్లావని' అడగాలి. అడక్కపోతే ఎలా? ఏమంటారు?'' అంది.

బాలూకు యిబ్బందిగా వుంది. కాని ఆమెకన్నా ముందర ఫోన్ పెట్టెయ్యటం మర్యాదకాదు నీలం — ఇంతకుముందు ఓ బ్యాంకులో టైపిస్టుగా పనిచేస్తూ, ఎక్కువ జీతం ఆఫర్ చెయ్యటంవల్ల యిక్కడ చేరింది. ఆమె యిక్కడికి రావటానికి కారణం ఆర్ ఎమ్. గారు. ఆమె వాళ్లకు ఫామిలీ ఫ్రెండ్. నీలం—అందంగా వుంటుంది. ఎత్తుగా, తెల్లగా, పొడుగ్గా వుంటుంది. టాప్ అఫిషియల్స్‌తో చాలా సోషల్‌గా, ఫ్రెండ్లీగా వుంటుంది. ఇంకా పెళ్లి కాలేదు.

## ఆశ్రితజన పక్షపాతి

ఆర్. ఎం. గారు మధ్యాహ్నం లంచ్‌చేసి తన ఛేంబర్‌లోని కర్టెన్ వెనక ఈజీ ఛెయిర్‌లో కునుకు తీస్తున్నప్పుడు—కొన్ని కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు టైప్‌చేసి ఆయనకిచ్చి రావటానికి లోపలికెళ్లిన బాలూకు టేబుల్‌మీద తమ హెడాఫీసునుండి వచ్చిన ఓ వుత్తరం కనిపించింది గత సంవత్సరం ఇనస్పెక్షన్ వాళ్లిచ్చిన రిపోర్టు ఫలితంగానూ, దాన్ని ఎండార్సు చేసిన ఆర్. ఎం. 'కామెంట్స్' ఆధారంగానూ ఒక లోకల్ రీసర్చి డిపార్టుమెంట్ పెట్టాలనీ, దానికి సబ్—మేనేజర్ గ్రేడ్‌లోవున్న ఒక ఆఫీసర్ని నియమించాలనీ మరియు ప్రస్తుతమున్న పర్సనల్ అసిస్టెంట్ హోదాను అప్‌గ్రేడ్ చెయ్యాలనీ హెడాఫీసులో నిర్ణయించబడింది. ఇందుక్కావలసిన ప్రాసెస్—అప్లికేషన్సు 'కాల్‌ఫర్' చెయ్యటం, ఇంటర్వ్యూలు, అపాయింట్‌మెంట్స్ మొదలైనవి—చెయ్యటానికి

రీజినల్ మేనేజర్‌కు అనుమతి యివ్వబడింది. ఇది చదవగానె బాలాకు సంతోషమూ, ఆర్. ఎం. తనను చూస్తున్నాడేమోననే భయమూ కలిగి బయటికి వచ్చేశాడు

అప్‌గ్రేడ్ చేసిన వుద్యోగం తనకే వస్తుందా? లేదా మరొకణ్ణి తీసుకొచ్చి పెడతారా? తనను మరెక్కడికైనా ట్రాన్స్‌ఫర్‌చేస్తారా? రీసర్చి డిపార్ట్‌మెంట్‌కు సైన్సు గ్రాడ్యుయేట్లు కావాలి. మనోరమ తమ్ముడూ, చెల్లెలూ ఇద్దరూ సైన్స్ గ్రాడ్యుయేట్లే. ఇద్దర్లో ఒకరికైనా తను వుద్యోగం యిప్పించగలడా? అలాగే ఈ అప్‌గ్రేడ్ అయ్యే పి. ఎ. పోస్ట్ తనకే వుండేలా చూసుకోగలడా? ఆర్. ఎం. తలచుకొంటే ఏమైనా చెయ్యగలడు. హి ఈజ్ ఆల్ పవర్‌ఫుల్. కాని ఆయన్నాశ్రయించేవాళ్ళు కూడా చాలామంది ఆయన్ని ఆకర్షించే వాళ్ళు, ఆయన జాలిపడేవాళ్ళు తక్కువేమీలేరు. చాలా కారణాలకు చాలా మందినిచూస్తే ఆయన కిష్టం వాళ్ళతోవున్నప్పుడు'మీకోసం ఏమైనా చేస్తాను' అంటాడు. చేస్తాడు కూడాను. అంతేకాదు. అతణ్నాశ్రయించటం, ఆకర్షించటం కూడా సులభం. ఆర్. ఎం.కు అధికారదర్పం లేదు. ధనవంతుడు. కాని గర్వంలేదు. మస్కాకొడితే పొంగిపోడు. నజరానాలు పుచ్చుకోడు. తెలివైనవాళ్ళంటే అతడి కిష్టం. తనని అర్థం చేసుకుని నడుచుకునేవాళ్ళంటే అతడికి అభిమానం. అవును. పోటీ తీవ్రంగా వుంటుంది. ప్రస్తుతం డిప్యూటీ రీజినల్ మేనేజర్ వద్దవున్న స్టెనోక్కూడా ప్రమోషన్ కావాలి. అందరికీ వుద్యోగాలు కావాలి. ఉద్యోగులకు ప్రమోషన్లు కావాలి. తర్వాత 'అధికారం' చేజిక్కించుకోవాలి కీలకమైన పోస్టుల్లోకి చేరుకోవాలి. ప్రెస్టేజ్ కావాలి. తనకే ఈమధ్యన కంప్లేసెన్సీ వచ్చేసింది. కాని తన కంప్లేసెన్సీవల్ల వుద్యోగంయొక్క ప్రాముఖ్యత తగ్గలేదు. పోటీపోలేదు జనానికి వుద్యోగాల అవసరం తగ్గలేదు. నిచ్చెనలోని ప్రతి మెట్టుదగ్గరా ఘర్షణ. పోటీ.

## కోరికల కోలాటం

వేకెన్సీల గురించి పత్రికలకు అడ్వర్‌టైజ్‌మెంట్లు తయారుచేసి ఓ ఎక్స్‌ట్రాకాపీ జేబులో పెట్టుకుని వచ్చాడు బాలా.

స్కూటర్‌మీద కూర్చుని

''మారెడ్‌పల్లి పోదామా?'' అన్నాడు.

మనోరమ వులిక్కిపడింది. స్కూటర్ వెనక కూర్చున్నదల్లా గబుక్కున దిగి భయంతో ''ఎందుకూ?'' అంది.

మనోరమ ముఖకవళికలు చూసి, సంతోషంతో బిగ్గరగా నవ్వి,

''డోన్ట్ వర్రీ. మీ వాళ్ళకు ఫేవర్ చెయ్యటానికేలే. నీ కోసమూకాదు, నా కోసమూకాదు. పైగా మనం అక్కడ వుండక్కర్లేదు. వెంటనే వచ్చేద్దాం'' అన్నాడు బాలా.

మనోరమకు అర్థం కాలేదు.

'త్వరగా చెప్పరాదూ, చంపక', అంటో మనోరమ గిల్లుతూ, ఏడుపు గొంతుతో మాట్లాడుతూ, గునుస్తూ అంది.

''హావ్ పేషెన్స్ డార్లింగ్'' అన్నాడు బాలా.

ఇల్లు చేరేరు.

మనోరమ తండ్రి యింట్లోనే వున్నాడు. తల్లి మొహానికి పౌడరు వేసుకుంటూ నిలబడింది. తలలో పువ్వులు.

''ఎక్కడికన్నా ప్రయాణమవుతున్నారా, అమ్మా?'' అంది మనోరమ.

''అది వచ్చేస్తే సినిమాకు పోవాలనుకున్నాం. వాడికేమో తిరుగుడేనాయె. అదేమో యింకా రాలేదు'' అంది తల్లి.

''మనోరమ మళ్ళీ అడిగింది. బాలా అగమన్నట్టుగా చెయ్యి చూపించాడు.

''నాకు చెప్పదలచుకోనప్పుడు నన్నెందుకు తీసుకొచ్చావు?'' అంది.

కళ్ళద్దాలు సవరించుకుని తన బ్రీఫ్‌కేసులోనుండి ఓ కవరు తీసిచ్చాడు బాలా

''ఏమిటీ?'' అంది గబగబా కవర్లోంచి కాగితం తీస్తూ.

''అడ్వర్‌టైజ్‌మెంటు కూడా చదివే ఓపికలేనివాళ్ళు వుద్యోగాలెలా చేస్తారో!'' అన్నాడు బాలా

''వస్తుందంటావా?'' అంది మనోరమ.

''ష్, అప్పుడే అందరికీ హామీ యిచ్చెయ్యకు. మన పని ప్రయత్నించటం మాత్రమే'' అన్నాడు బాలా.

ఇంటిముందర రిక్షా ఆగింది.

నీరజ రిక్షా దిగింది. స్కూటర్ చూసి అక్కడి నుండే నవ్వుతూ యింట్లోకి వచ్చి ''నమస్కారమండీ!'' అంది.

''ఇంత ఆలస్యమేం, అమ్మను సినిమాకు పోనివ్వకుండా'' అంది మనోరమ.

''బాగుంది. నాకేం తెలుసూ వాళు సినిమాకెడతారని'' అంటూ హాండ్ బాగ్‌లో నుండి ఖాళీ టిఫిన్‌డబ్బా, పత్రికలూ కర్చీఫ్ తీసి పక్కనపెట్టి లోపలి కెళ్ళింది.

''అవునూ, మీ చెల్లెలికే క్లాస్ వచ్చింది?''అన్నాడు బాలా.
''మామూలే, సెకండ్ క్లాస్'' అంది మనోరమ.

బాలా పెదవి విరుస్తూ,

''ఇదే, చదువు లోనేమో మొద్దులు. మళ్ళీ మంచి ఉద్యోగాలు కావాలి'' అన్నాడు బాలా.

మనోరమ సాధిస్తున్నట్టుగా,

''ఇప్పిస్తే యిప్పించండి. లేకపోతే లేదు. ఇప్పుడది మీ కోసం మార్కులు మార్పించుకోలేదు. మళ్లీ పరీక్ష రాయలేదు'' అంది.

''పోనీ, మీ తమ్ముడి సంగతేమిటి? నీరజ కంటే ఏదో వుద్యోగం వుంది. అతడికదీ లేదు గదా'' అన్నాడు బాలూ.

## ఒక చల్లని సాయంకాలం

''వెళ్లమ్మా, ఆటోలో వెళ్లండి. టికెట్లు దొరుకుతాయిలే'' అంటూ తల్లీ దండ్రిని సినిమాకు పంపించి, 'ఇప్పుడే వస్తానండీ'. అంటూ లోపలికి పోయింది నీరజ. మనోరమ కూడా చెల్లెల్ననుసరించింది. ఇద్దరూ కలిసి, అర్జెంటుగా కాఫీ చేసి, ఓ సాసర్‌లో సాల్టు బిస్కట్లు వేసుకుని వచ్చారు. నీరజ మొహం కడుక్కుని వచ్చి ఆ రూంలోనే అద్దం, టాయిలెట్ సామగ్రి వుండటంవల్ల — అక్కడే మొహం తుడుచుకుంటూ నిల్చుంది.

''తర్వాత పౌడర్ వేసుకొందువుగాని, ముందు కాఫీ తాగవే. చల్లారిపోతుంది'' అంది మనోరమ. తుడుచుకుంటున్న తువ్వాలు బుజంమీద వేసుకుని వచ్చి కూర్చుంది నీరజ. విడదీసుకున్న జడ వంకలు వంకలుగా, పాయలు పాయలుగా చెదరివుంది.

''చాలా థాంక్సండీ.''

''అప్పుడే ఎందుకూ థాంక్స్? మొదట అప్లై చెయ్యండి'' అన్నాడు బాలూ.

''బాగుంది, నువ్వొస్తుందని చెబితే అప్లై చేస్తుంది. లేకపోతే ఎందుకు చేస్తుంది?'' అన్నది మనోరమ.

'నేనెవర్నీ వుద్యోగం యిప్పించటానికి, యాప్టరాల్ ఒక స్టెనోగాణ్ణి. మీరు అప్లై చెయ్యండి. ఇంటర్వ్యూకు హాజరవండి. మా ఆర్ ఎంను యింప్రెస్ చెయ్యండి. అప్పుడు మీకేమైనా అవకాశ ముంటుంది. కాకపోతే, నేనక్కడే వుంటాను గనక, మీకేదైనా యిన్ఫర్మేషన్ యివ్వగలను.''

''అలాకాదు. మనకు తప్పకుండా వచ్చేపద్ధతి.''

''అంటే, లంచం. అదేకదా నీ వుద్దేశం. నాకు తెలిసినంత వరకూ ఆర్ ఎం లంచం తీసుకోడు''

మరెలాగ? నా సెకండు క్లాస్ మార్కులతో, అంతంత మాత్రం ఇంగ్లీషుతో—''సరే, మీరు సీరియస్‌గా ప్రయత్నిస్తానంటే అప్లై చేస్తాను'' అంది నీరజ బాలూకేసి నవ్వుతూ.

''నన్ను రిక్వెస్ట్ చేస్తే లాభం లేదు. నా వుద్దేశం షార్ట్ కట్స్ చూపెట్టటం కాదు. కాని మీ కభ్యంతరం లేకపోతే...'' అంటూ, ఆగాడు బాలూ.

''చెప్పూ, ఆపేశావేం?'' అంది మనోరమ.

''ఆర్ ఎంతో ఓ గెట్ టుగెదర్ అరేంజ్ చేస్తాను. మీ కభ్యంతరం లేకపోతే మా ఫ్లాట్‌లోనే కలుద్దాం. కాసేపు కబుర్లు చెప్పుకుందాం. ఒకర్నొకరు పరిచయం చేసుకొందాం. ఆర్ ఎం అంటే మీకు భయం పోతుంది. అతనిక్కూడా మీతో స్నేహం కలుగుతుంది. జస్ట్ ఏ సోషల్ ఈవెనింగ్. నువ్వూ, నేనూ, ఆర్ ఎం, నీరజ — దట్సాల్.''

నీరజ మాట్లాడలేదు.

''నీ కోసమే, మాట్లాడవే, చెప్పేయ్'' అంది మనోరమ.

''నాకు భయంగా వుంది'' అంది నీరజ.

''మొదట అలాగే వుంటుందిలే'' అంది మనోరమ.

## మబ్బుల్లో పున్నమి చంద్రుడు

ఆదివారం.

బాలూకు దీపావళీ, దసరా, సంక్రాంతీ, తన బర్త్‌డే ఆన్నీ కలిసి ఒకనాడే వచ్చినంత సంతోషంగావుంది. అంత హడావిడిగానూ వున్నాడు.

మధ్యాహ్నం నాల్గింటికే వెళ్ళి హోటల్లో భోజన పదార్థాలు తెచ్చిపెట్టాడు. — ఆర్ ఎం గారు రాగానే ఓసారి కాస్త వేడిచేస్తే చాలు ఓ బాటిలూ, డజను సోడాలూ, లోపల దాచిన కట్‌గ్లాస్ గ్లాసులూ. డెకోలాం వేసిన టేబుల్ మెరిసి పోతోంది. మనోరమ కట్టుకోవలసిన జరీ ఎంబ్రాయిడరీ చేసిన తెల్ల సిల్కు చీరా, నెక్లెసూ. జడ వేసుకుంటానన్నది ఆమె. వద్దు. అలాగే వదులుగా వొదిలెయ్యి అన్నాడు బాలూ.

నీరజ ఐదింటికి వస్తుంది బాలూ తన కిష్టమైన ఆలివ్ గ్రీన్ పాంటుమీద వైట్ షర్ట్ టక్ చేశాడు. ఆర్ ఎం తో తను మాట్లాడవలసిన సబ్జెక్ట్ కూడా రెడీ చేసుకుని రిహార్స్ చేసుకొన్నాడు.

''నువ్వెళ్లి తీసుకురావాలా, అతడే వస్తాడా?''

''అతడి కలాంటి పట్టింపులేం లేవు. ఈ ఏరియా అతడికి బాగా తెలుసు. ఇటువైపు కొంత భూమి తీసుకొని ఇల్లు కట్టించుకోవాలనే వుంది అది సరేగాని, ఏమిటోయ్, ఐదు దాటిపోయింది. మీ చెల్లెలి కింత కేర్‌లెస్‌నెస్ ఏమిటి? ఆమెకేమీ యింటరెస్టు లేనట్టుందే.?''

''అదంతేలే. అదో తరహా మనిషి క్షణానికో రకంగా మారుతుంది దాని బుద్ధి. కాసేపు ఈ వుద్యోగం బాగుందంటుంది. కాసేపు ఆ వుద్యోగం బాగుందంటుంది. కాసేపు ఏ వుద్యోగమైనా ఒకటే అంటుంది. కాసేపు పెళ్లి చేసుకుని వుద్యోగం మానేస్తానంటుంది...''

''ఊఁ. ఊఁ. ఆమె అభిప్రాయాలు నా కనవసరం. చెప్పిన మాట చెయ్యాలి. నేను ఆర్ ఎంకు అప్పాయింట్‌మెంట్ కూడా యిచ్చిన తర్వాత యివన్నీ చెబితే ఎలా ?''

''వస్తూండొచ్చులే''

మరో అరగంట గడిచింది. ఆరైంది. బాలూ చిందులు తొక్కుతున్నాడు.

''ఆర్ ఎం సరిగ్గా ఆరున్నరకు వచ్చేస్తాడు. నో టైం. నన్ను వెళ్లమంటావా ? స్కూటర్‌మీద వెళ్లివచ్చేస్తాను.''

''ఊఁ, వెళ్లి వెనక కూర్చోబెట్టుకుని రా,'' అంది మనోరమ నవ్వుతూ.

బాలూకు చిరాకు పెరిగింది.

''అబ్బబ్బ. నీ జోక్స్‌చాలించి నువ్వే వెళ్లిరారాదూ. కమాన్, జల్దీ ఛలో ఆటోలో వెళ్లి వచ్చెయ్యాలి. క్విక్. సూపర్ ఫాస్ట్.''

మనోరమ బయల్దేరింది.

''ఛీ. ఛీ. ఇంత అశ్రద్ధా. డిసీన్ టూమచ్. ఏంమనుషులు! అప్పుడేమో బ్రతిమాలి బ్రతిమాలి అప్పాయింట్‌మెంట్ ఫిక్స్ చేసుకుని యిప్పుడేమో ఇలా సస్పెన్స్‌లో పెట్టాలి. భేష్. ఇదేం మీకూ నాకూ మధ్య వ్యవహారమనుకున్నావా ఏమిటి ? బాస్‌ను పిలిచి డిసప్పాయింట్ చెయ్యటం ! కాండిడేట్ రాలేకపోయింది సార్ అనాలా? ఇది మర్యాదా ? సరే, ఆవిడకు వుద్యోగం అక్కర్లేదు. నేను, ఆయన కింద వుద్యోగం చేస్తున్నవాణ్ణి, నా మర్యాద కాపాడ్డంకోసమైనా రావచ్చు గదా ! అతణ్ణి ఆహ్వానించకపోతే అదివేరు. అరె. లేక లేక ఆయన్ని ఇంటికి రమ్మని, ఇంత హంగామా, ఇన్ని ప్రిపరేషన్స్‌చేసి అసలు మనిషి రాలేదంటే .. అతను మనమీద దయతలుస్తున్నాడా లేక మనం ఆయన మీద దయతలుస్తున్నామా...''

అబ్బబ్బ, అదిక్కడ లేదుగదా, ఎవరికోసం ఈ దండకమంతా ? నేను వెళుతున్నాను. నీ పార్టీకి వచ్చిన నష్టమేం లేదులే'' అంటూ మనోరమ గబగబా మెట్లు దిగింది.

# ఎక్కలేని చివరి మెట్టు

ఆర్ ఎం కారాగింది. నీరజ రాలేదు. నీరజను తీసుకురావటానికి వెళ్లిన మనోరమ కూడా రాలేదు.

మూడంతస్తులూ పరుగు పరుగున దిగి,

''వెల్కంసార్, వెల్కం టు యూ'' అన్నాడు బాలూ.

ఆర్ ఎం ఒక్కడే వచ్చాడు. డ్రెస్ ఇన్ఫార్మల్‌గా వుంది. పాంట్, పోలో షర్ట్, చెప్పులు.

ఇల్లంతా లైట్లు వెలిగాయి.

''కమాన్ సార్, ఇల్లు చూద్దురుగాని, రండి'' అంటూ ఇంటిని పరిచయం చేశాడు.

''నా భార్యా, ఆవిడ చెల్లెలూ సికింద్రాబాద్ నుండి రావాలి. దారిలో వుండి వుంటారు'' అంటూ కథ చెప్పాడు

ఆర్ ఎంగారు సోఫామీద ఆసీనులయ్యారు.

ఎదురుగా టేబుల్‌మీద టైం మాగజైన్, బిజినెస్ మేనేజ్‌మెంట్ అనే ఒక పత్రికా, ఒక ఆర్థర్‌హెయిలీ నవలా పక్కపక్కగా పెట్టి వున్నాయి.

''షల్ ఐ మిక్స్ సమ్‌థింగ్ టు స్టార్ట్ విత్ , సార్,'' అంటూ గ్లాసుల్లో రెండు పెగ్గులు విస్కీ, సోడా కలిపి తీసుకొచ్చాడు.

ఆర్ ఎం గారి ఇంటరెస్టు తగ్గిపోకుండా వుండటానికి తమ పెళ్లి ఫోటోల ఆల్బం తెచ్చి చూపించాడు. స్టేట్స్‌లోవున్న తన కజిన్ బ్రదర్ గురించి చెప్పాడు. రెండో రౌండుతో సాన్నిహిత్యం పెరిగినట్టుగా తోచి దేశంలోని రాజకీయ పరిస్థితి గురించీ, ట్రేడ్ యూనియన్ల గురించీ, ట్రాన్సెండెంటల్ మెడిటేషన్ గురించీ మాట్లాడాడు. ఇండస్ట్రియల్ గ్రోత్ గురించీ, టాక్సేషన్ పద్ధతి గురించీ, ఆఫీస్ ఎక్స్‌పాన్షన్ గురించీ కబుర్లు చెప్పి, విని, ఎక్కడా అసందర్భం అనిపించకుండా ప్రస్తుతంజరుగుతున్న రిక్రూట్‌మెంట్ గురించి మాట్లాడాడు.

''ఐ థింక్ ఐ మస్ట్ బీ గోయింగ్ నౌ'' అన్నాడు ఆర్ ఎం.

బాలూకు మత్తు దిగింది.

''నో సర్. ఫుడ్ రెడీగా వుంది. రెండు నిమిషాలు'' అంటూ భోజనం పాకెట్ విప్పి, స్టౌమీద వేడిచేసి తెచ్చాడు.

భోజనం చేస్తూ ఆర్. ఎం. పార్టీ జోక్స్ చెప్పాడు తనకు వుద్యోగంమీద విసుగొస్తున్నదన్నాడు. తన కొడుకు 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్'లో చదువుకుంటున్నాడనీ, కూతురు దుబాయ్‌లోని ఒక అమెరికన్ ఆయిల్‌ఫంలో జూనియర్ ఎక్సిక్యూటివ్‌గా వున్న మొగుడితో వుంటోందనీ చెప్పి, డబ్బులు సరిపోవటంలేదని చెప్పాడు. అసలీ ఆర్గనైజేషన్‌లో ప్రమోషనల్ ఎవెన్యూస్ తగ్గిపోతున్నాయి. హెడ్డాఫీస్‌లో తనంటే పడనివాళ్లు యిలా తనను ఓ మూలకు గిరాటేసి పగ తీర్చుకున్నారు. ఛాన్స్ వచ్చినప్పుడూ తనూ తడాఖా చూపిస్తాడట.

అనుకోకుండా అది రైలు పట్టాల సంభాషణగా మారింది. బాలూ చెప్పదలుచుకొన్న విషయం యింకా పైకి రాలేదు ఆర్. ఎం. స్వంతగొడవ మొదలెట్టాడు.

తొమ్మిదైంది.

ఆర్. ఎం. వెళ్లిపోయాడు. నీరజ సంగతెందుకు, మనోరమకూడా తిరిగి రాలేదు. బాలూకు కోపమొచ్చింది. గాభర పుట్టింది. అసహ్యమేసింది. ఏడుపొచ్చింది. తలుపులు బిడాయించుకుని మంచంమీద పడ్డాడు. తిరిగిరాని ఈ సాయంత్రం యిలా

వృధా ఐనందుకు అతడి కళ్లు చెమర్చాయి. అతడి గుండె రగిలింది. అతడు కోపంతో బుసలు కొట్టాడు.

## ఇది ముగింపుకాదు

తెల్లారి ఆఫీసులో మనోరమ ఫోన్ చేసింది.

ఆమె గొంతు వినగానే బాలూకు చిర్రెత్తుకొచ్చింది.

''ఆఫీసు ఫోన్ ప్రైవేట్ టాక్‌కోసం కాదు'' అంటూ ఫోన్ పెట్టేశాడు.

ఆమెను కలిసే వుద్దేశంలేక లంచి టైంలో బైటికి వెళ్లిపోయి, తర్వాత వచ్చాడు సాయింత్రం ఆమె స్కూటర్ దగ్గరకు వచ్చింది. అతను యింటి తాళంచెవి యిచ్చేసి 'నాకు పనుంది. నువ్వెళ్లు'అంటూ వెళ్లిపోయాడు. ఆ రాత్రి పన్నెండుదాకా యింటికి చేరుకోలేదు.

మనోరమ విసుగ్గా తలుపు తీసింది

''నీకు కోపమొచ్చిందని తెలుసు. కాని కాస్త నా సంగతి కూడా తెలుసుకోకుండా అంత హడావిడి చేస్తావెందుకు?'' అంది.

''సారీ, నేనేమీ వినదల్చుకోలేదు. నువ్వా విషయం మాట్లాడితే నేనిప్పుడే వెళ్ళిపోతాను'' అన్నాడు బాలూ.

మనోరమ ఏడుస్తూ కూర్చుంది. బాలూ బట్టలు మార్చుకుని వచ్చి పడుకున్నాడు.

''నువ్వు వినాల్సిందే. వినాల్సిందే'' అంటూ మనోరమ అతడి మీద వాలిపోయింది.

బాలూ లేచి కూర్చున్నాడు.

''అది రానన్నది. చివరి క్షణంలో దాని బుద్ధి మారింది. అమ్మ వద్దన్నదట, 'ఈ పార్టీలూ, వ్యవహారాలూ ఏమిటి.నాకిష్టంలేదు' అంది. నిన్ను డిసప్పాయింట్ చేసినందుకు క్షమించమంది.''

బాలూ మాట్లాడలేదు. మనోరమ కూడా మాట్లాడలేదు. పక్కనే పడుకున్న ఆమె శరీరం అతనికి కోపం రెట్టింపు చేసింది. ఓ పది నిమిషాలాగి—సడెన్‌గా,

'అసలు సంగతి చెప్పవేం? అది రాకపోతే పీడాపోయింది నువ్వెందుకు రాలేదు? ఎందుకు రాలేదు, నీకేమైంది? ఇందులో దాని ఇంటరెస్టేకాదు, నా యింటరెస్టు కూడా వుంది. చెప్పు. చెప్పు'' అంటూ అరిచాడు ఆమె జుట్టు పట్టుకుని లేపి కూర్చోబెట్టి. మనిషి కోపంతో వణికిపోతున్నాడు భయంతో, అసహ్యంతో ఆమె నిర్వియణ్ణురాలైంది.

''ఎందుకు రావాలి? నీ పార్టీలకు, నీ ప్రమోషన్లకు, నీ బాస్‌ను సంతోషపెట్టటానికి నేనెందుకు రావాలి? సిగ్గులేదూ'', నన్నిలాంటి పార్టీకి పిలవటానికి! రానందుకు సంతోషించు'' అంది.

గాయపడిన బాలూ,

యూ డర్టీ బిచ్, ఎంత పని చేశావు! నీలో యిన్ని ఆలోచనలున్నాయని నాకేం తెలుసు! ముందరే చెప్పకూడదూ, నన్నిలా అవమానించటానికి నీకేం హక్కుంది? ఆఫీసులో కొలీగ్సుతో కులుకుతావు, మాట్లాడతావు, నవ్వుతావు, సినిమాలకు పోతావు. కాని నా పార్టీకి రావన్నమాట'' అన్నాడు.

''ఔను. రాను. రాను. డర్టీ బిచ్‌ని అని తెలిసే చేసుకున్న నువ్వెంత డర్టీ ఫెల్లోవి! ఏం, మీ బాస్‌వేసే డర్టీజోక్స్ విని నవ్వలేదనీ, నా చేతుల్తో అతనికి విస్కీ గ్లాసులందించలేదనీ, 'నన్ను చూడు, నా అందం చూడు' అంటూ అతడిముందర కూర్చోలేదనీ నీ బాధ. ఛీ. నువ్వు మొగుడివేనా? ఇంత నీచుడివి, నన్ను చేసుకోవటంలో అసలు నీ వుద్దేశమేమిటి! ఇలా నలుగురికీ చూపించుకోవటానికా నన్ను చేసుకున్నావు?''

''యూ డర్టీ బిచ్...'' అని మళ్లీ అరుస్తూ, కొట్టబోయ్యాడు. కాని భయపడ్డాడు. గాయపడ్డాడు. తనని హ్యూమిలియేట్ చేసిన ఆమెమీద పగపెంచుకున్నాడు.

''సారీ, డార్లింగ్'' అన్నాడు.

మనోరమ బిగ్గరగా ఏడ్చింది. ఆడవాళ్లు బిగ్గరగా ఏడ్చినప్పుడు ఎంత భయానకంగా వుంటుందో మొదటిసారిగా చూశాడు.

''సారీ, డార్లింగ్. పొరబాటు చేశాను. నువ్వు రానిదే మంచిదైంది. నేను అలా అడగటమే తప్పు. క్షమించు'' అన్నాడు. నీ అందం నీది. నీమీద నాకేమీ అధికారంలేదు. కాని నాకు పనికిరాని నీ అందం, నీ అహంకారం నాకు అపకారం చేసినప్పుడు, అవమానంగా తయారైనప్పుడు నువ్వు నా కెందుకు? నేను నిన్నెందుకు పోషించాలి? అనుకున్నాడు.

అలా రాత్రి గడిచింది. అలాగే తెల్లారింది. వాళ్ళు ఒకర్నొకరు చూసి చిరునవ్వు నవ్వినప్పుడు, సూటిగా కళ్ళల్లోకి చూసుకున్నప్పుడు వింతగావుంది. ఆ నవ్వు వెలవెలబోయింది. ఆ కళ్ళు ధైర్యంగా చూడలేకపోయాయి.

''నాకూ అవకాశం రాకపోదు'' అన్నట్టుగా వుంది అతడి చిరునవ్వు.

## ఫామిలీ ప్లానింగ్ - బాలూ స్టైల్

'' ప్రేమ కోల్పోయిన మనుషులు, పరస్పరం అసహ్యం, ద్వేషం పెంచుకునే వ్యక్తులు కలసి వుండక తప్పనప్పుడు ఒకర్నొకరు గాయపరచుకోవటానికి మాటల్లో, చేతల్లో పదునైన చురకత్తులు దాచుకుని అవకాశం దొరికినప్పుడల్లా ఒకరిమీద ఒకరు విసురుకుంటూ వుంటారు. మనోరమ ప్రవర్తన తనకు నచ్చదు. ఆమె కెందుకింత అహంకారం? తనంటేనే అశ్రద్ధ. చులకన. పరిహాసం. ఏం చూసుకుని? తను ఆమె మీద ఖర్చుపెట్టినడబ్బు— స్నాయింత్రాలు, సినిమాలు, చీరలు, మొహమాటంకోసం, మర్యాదకోసం తనకిష్టంలేకపోయినా, ఆమె సంతోషంకోసం చేసేవ పనులు. తనామెనెందుకు చేసుకున్నాడు? కొన్ని విషయాలు త్వరగ మరచిపోతారు మనుషులు. ఆమెలో తననాకర్షించిన ప్రత్యేకత ఏమిటో తన కర్థం కావటంలేదు. కాని ఆ భయం, బెరుకుదనం, సిగ్గుపడే మొహం — ఆ బలహీనమైన హస్కీవాయిస్ వెనక యిలాంటి మనిషి దాగుందా? డైవోర్స్ యిస్తే, తీసుకుంటే? తనకైతామ ఎందుకడగాలి, ఆమెవైపునుండి ప్రపోజల్‌వస్తే సరేగాని... మళ్ళీ మొదలు. మూడు నాలుగు రోజులు గడిచాయి అలా రాత్రంతా పక్కపక్కనే వడుకోవాలంటే యిబ్బందే. నిద్రమత్తులో, సంకెళ్ళులేని ఆలోచనలనుండి, శరీరంలో పెరిగే కోరికల ఒత్తిడి కింద ... — కాని ఒక ప్లాన్ ప్రకారమే, తన అవసరానికి ఒక ఆర్గ్యుమెంటు సృష్టించుకున్నాడు. ఈ ఆర్నెల్లలోనూ పిల్లలు పుట్టకుండా తనే జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. ఆమె మీద, కుటుంబనియంత్రణమీద అపనమ్మకం మొదలై, ఆ జాగ్రత్తలు మానెయ్యాలని నిశ్చయించాడు. మొదటి రోజుల్లో మనోరమ జ్ఞాపకం చేసింది. కృతకమైన చిరునవ్వులతో, 'ఏదో జరిగిపోతుంది. పోనీలే' అన్నట్టుగా వూరుకున్నాడు.

కాని ఆమె కావిషయం తెలుసుకోవటానికి ఎక్కువ రోజులు పట్టలేదు.

''డోన్ట్‌వర్రీ డార్లింగ్. యాప్టరాల్, ఆర్నెల్లు గడిచింది. ఓ అందమైన అమ్మాయిని ఎత్తుకోవటానికి యింకా టైం రాలేదా?'' అన్నాడు.

'ఏం, నామీద విసుగొచ్చిందా?'' అంది మనోరమ.

'ఛ. ఛ. అవేంమాటలు. విసుగా నీలాంటి మరో బుల్లి పాపాయి కావాలని కోరిక. మనమేమీ యింకా టీనేజర్స్‌మి కాము.

నీకు ఇరవైఆరు. నాకు ముప్ఫైమూడు. ఏ యాభైయ్యేటో పిల్లల్ని కంటావా ఏమిటి? అప్పుడు పోషించడానికి, పెంచటానికి నీకూ, నాకూ ఓపిక వుండదు. ఇలాగ మనం వరుసగా ఒకరిద్దర్ని కనేసి తర్వాత 'కట్' చేసుకుంటే తర్వాత ఏ గొడవా వుండదు. ఏమంటావు? అన్నాడు.

''ఔను. నేను పిల్లల వుత్సలగుడ్డలు తీస్తుంటే చూడ్డానికి నికంత బాగుంటుందన్నమాట.''

ఓహ్‌గాడ్! ఏమిటిది డార్లింగ్, కావాలంటే మనం మరో సర్వెంట్ గర్ల్‌ను పెట్టుకుందాం. ఐనా, మమా, పిల్లలొద్దనే వాళ్ళు ఈ దేశంలో యింతవరకూ ఎవరూ పుట్టలేదు. ఐష్టైశ్వర్యాలలో సంతానంకూడా ఒకటి ...

అలా వాదోపవాదాలు నడుస్తూనే వున్నాయి. ఆమె విసుక్కుంటూనేవుంది. భయపడుతూనేవుంది.

మరో రెండు నెలలకు వాళ్ళు లేడీ డాక్టరు దగ్గరకు వెళ్ళినప్పుడు లేడీ డాక్టరు ఆమె భయాన్ని ధ్రువపరిచింది. మనోరమ గర్భవతి. బాలూ విజయగర్వంతో ఆమెను గిట్టిగా కౌగిలించుకున్నాడు.

## పుత్రోదయం

ప్రసూతిరోజుకూడా మనోరమ ఆఫీసుకు వచ్చింది. లంచి తర్వాత మళ్ళీ మెక్లెక్కి సెక్షన్‌లోకెళ్ళగానే 'నొప్పు' లొచ్చాయి. బాలూ, మరో ఆడకొలీగ్ కలిసి టాక్సీలో ఆమెను మారెడ్‌పల్లిలో వున్న ఒక మెటర్నిటీ హోంకు తీసికెళ్ళారు. ఆమెను అక్కడ చేర్పిన విషయం ఆమె తల్లికి చెప్పివచ్చేలోగానే మనోరమ మగపిల్లవాణ్ణి ప్రసవించింది. సుఖప్రసవమేనన్నది డాక్టరు. బాలూ సంతోషానికి అంతులేదు. మరో గంటసేపట్లో మనోరమ తల్లీ దండ్రీ వచ్చారు.

'కంగ్రాచ్యులేషన్స్ డార్లింగ్. అంటూ ఆమె చేతిని తీసుకుని పెదాలకు నొక్కుకున్నాడు బాలూ. మనోరమ నవ్వింది. బలహీనంగా వున్న ఆమె నవ్వు అతనికి ధీరోదాత్తంగా కనిపించింది. అంత నొప్పినీ భరించి, గంటైనా తిరక్కుండానే నవ్వగలగటం గొప్ప విషయమనిపించింది. గతంలోని తిట్లూ, అవమానాలూ, పగలూ. సాధింపులూ అన్నీ మరచి స్వచ్ఛంగా ఆమెను మళ్ళీ ప్రేమించ గలిగాడు.

'నీ పోలికే' అంది మనోరమ.

ఆ చిన్న చిన్న చేతులనూ, ఆ షేప్‌లెస్ మొహాన్నీ సుకుమారంగా తాకేడు బాలూ. మరో నాలుగు రోజులకు మనోరమ పుట్టింటికి పోయింది. గతంలోని వైషమ్యాలను తాత్కాలికంగా మరిచి మళ్లీ వాళ్లింటికెళ్లాడు. బారసాలకు బాలూకు మూడు వందల రూపాయలదాకా ఖర్చయ్యాయి మెటర్నిటీ లీవ్‌లోవున్న నాలుగు నెలలూ ఆమె పుట్టింట్లోనేవుంది. రోజూ కాకపోయినా, బాలూ తరచుగా వెళ్లి చూసొచ్చేవాడు. ఆమెకు ప్రత్యేకించిన చిన్న గదిలో ఆమె మంచంమీద పక్కనే కూర్చుని అప్పుడప్పుడూ ప్రేమ వ్యవహారాలు నడిపించ ప్రయత్నించాడు గాని "ష్ష్ ఇక్కడకాదు మనింటి కెళ్లింతర్వాత" అంది మనోరమ. సుమారు ఆరునెలల విరహంతో బాలూకు పిచ్చెక్కినట్టుగావుంది. ఆఫీసు ఒంటరితనంతో మనసు స్థిమితపడక, కనీసం ఆమె దగ్గిరన్నా కూర్చుంటే కొంత సాంత్వన కలుగుతుందనుకునేవాడు. కాని తీరా వెళ్లింతర్వాత ఆ యిరుగ్గదీ, ఇటూ అటూ తిరుగాడే మనుషుల్పూ, ప్రైవేసీలేని ఆ వాతావరణమూ అతనికి విసుగెత్తించేవి. "అక్కడికెడదాం. అంటే, బావుంది. అక్కడ చేసేవాళ్ళెవరున్నారనీ, ఏదో యిక్కడుంటే అమ్మ చేస్తుందిగాని" అనేది మనోరమ ఈ లోగా ఓ పనిమనిషిని కుదర్చమని మనోరమ ఆదేశం. పనిమనిషి ఇరవై నాలుగ్గంటలూ యింట్లోనే వుండాలి. నమ్మకస్తురాలు కావాలి. ఇల్లంతా దానిమీద ఒదిలేపోతే జాగ్రత్త చేసేది కావాలి. పిల్లవాణ్ణి కంటి పాపలాగా చూసుకోవాలి. బట్టలు మార్చగలిగేదీ, పాలు పట్టగలిగేదీ, శుచీ శుభ్రం తెలిసిందీ కావాలి. దానికి పుళ్లుండకూడదు. జబ్బులుండకూడదు. రోజూ స్నానం చెయ్యాలి-దగ్గిర బంధువులెవరన్నావుంటే బావుండును. ఎవరూ దొరకలేదు. ప్రస్తుతమున్న పనిమనిషికి చెప్పాడు. దొరకటానికి టైంపడుతుందన్నది. ఈ నాలుగు నెలల్లోనూ బాలూ లాంఛనాలకు ఖర్చుపెట్టిన డబ్బులుకాక, పాలడబ్బాలుకాక, (మనోరమకు పాలెక్కువ రాలేదు. రెండోనెలదాకా గూడా పిల్లాడు తాగలేకపోయాడు) మనోరమ జీతమంతా పుట్టింటివాళ్ల కేపోయింది. బాలూకు అడగాలనిపించిరది కాని మళ్లీ పోట్లాట అవుతుందని భయమేసింది. నెలలు గడుస్తుంటే కుర్రాడికో ఆకారం వచ్చింది ఇప్పుడు ముద్దుగా, బొద్దుగా తయారైనాడు. ఇప్పుడు బాలూకు కొడుకుమీద మమకారం, ఎటాచ్‌మెంట్ పెరిగింది. తండ్రిపేరు పెట్టాలని బాలూ, మోడరన్‌గావుండే పేరుకావాలని మనోరమా చర్చించుకుని, చివరికి ఎవరికి నచ్చినపేరు వాళ్లు పెట్టుకుని తాత్కాలికంగా రాజీపడ్డారు.

## సంసార సుఖం

కుర్రాడి సామానుతో ఒక బుట్టా, తనగుడ్డలు మరో బాగ్‌లోనూ పెట్టుకుని తల్లితోసహా యిల్లుచేరేసరికి యింటిముందర పనిపిల్ల హాజరుగావుంది. అప్పటికే వుయ్యాల కొని జాగ్రత్తచేసిన బాలూ, పిల్లాణ్ణి పడుకోబెట్టి, మనోరమ చీరమార్చుకోవటానికి బెడ్‌రూంలోకి రాగానే చేసిన మొదటిపని, గది తలుపులువేసి, మాటా పలుకూ లేకుండా ఆమెను వాటేసుకుని 'మనూ, మనూ, మనూ,' అంటూ పెనవేసి వూపిరి సలుపకుండా ఆమె ఒంటినిండా ముద్దులు పెట్టుకోవటం.

'ఇలాగైతే నేను చచ్చిపోతానోయ్' అంది మనోరమ. 'నీకేమిటీ, కుర్రాడిమీద ఏమీ మమకారంలేదు, ఎంతసేపూ నన్ను నలిపెయ్యాలనే తప్ప,'అంది. బాలూకు ఆ మాటలేమీ వినిపించలేదు.

"ఇన్నాళ్లు వుండాల్సి వచ్చేట్లయితే నువ్వింకెప్పుడూ కనకూడదు" అన్నాడు.

"ఈసారన్నా జాగ్రత్త. తొందరలో ప్రికాషన్స్ మరచిపోకు," అంది మనోరమ.

కాని అర్ధరాత్రి కుర్రాడి ఏడ్పులతో లేచి పాలు పట్టవలసిన మనోరమా, బెడ్‌రూంలోకైనాసరే, కూతురికి సాయం వచ్చే ఆమె తల్లీ, మధ్య మధ్యన ఆటంకాలతో అతడెప్పుడూ ఆమెతో వుండవలసినంతసేపు వుండలేకపోయాడు.

...ఇదిగో, ఇప్పుడే నేర్చుకో. మా అమ్మ యిక్కడ పర్మనెంట్‌గా వుండటానికి రాలేదు నాకు సాయం చెయ్యాలి నువ్వు" అంది మనోరమ.

పాలడబ్బాలు ఎప్పుడుపడితే అప్పుడు దొరకవనీ, ముందే స్టోర్‌చేసి పెట్టుకోవాలనీ, వాడి మూత్రంతో, అవసరాలతో తడిసే ఆమె గుడ్డలు ఎప్పటికీ సెంటువాసన వెయ్యవనీ తెలుసుకున్నాడు. అకస్మాత్తుగా కుర్రాడికి జలుబుచేస్తే, కడుపునొప్పి వస్తే వూరికే హైరానా పడిపోగూడదనీ, అప్పుడప్పుడు మంచి నిద్రమత్తులో, తియ్యని విరహంలో, ప్రేమ తీవ్రతలో ఆమెను అల్లుకుని వున్న క్షణాలలోకూడా కుర్రాడేడిస్తే లేవాలనీ, వాణ్ణెత్తుకుని తిరగాలనీ, వాడితో ఆమె విసుక్కున్నప్పుడు తనామెకు సాయం చెయ్యాలనీ తెలుసుకున్నాడు. పనిమనిషి యిరవై నాలుగ్గంటలూ వుండదు సాయంత్రం ఏడింటికి వెళ్లిపోతుంది. మళ్లీ తెల్లారి వస్తుంది. మొదట మొదట నిద్రలో లేవాలంటే బద్ధకంగా, చిరాకుగా వుండేది కాని వాడి గోలతో తనకు మెలకువవచ్చినా, మనోరమకు మెలకువ వచ్చేదికాదు. పక్కన వుయ్యాలలోని కుర్రాడి ఏడుపు భరించలేకపోయేవాడు మనోరమను లేపాల్సి వచ్చేది. ప్రతిసారీ లేచి వుయ్యాలదగ్గరికి పోవటానికి బద్ధకించిన మనోరమ కుర్రాణ్ణి పక్కలో వేసుకుని పడుకుంటానన్నది. ఫోం బెడ్ పాడైపోతుందని బాలూ బెంగ. కాని తప్పదు. అలా పక్కలో యిప్పుడు ముగ్గురైనారు. మనోరమ తల్లి వెళ్లిపోయింది. వాడికి పోలియో డ్రాప్సూ, ట్రిపుల్ ఆంటిజెన్ మందులూ వెయ్యించటానికి మనోరమ ఒక్కత్తీపోదు. ప్రతిసారీ, డాక్టరు దగ్గరకు తను ఆమె వెంట వెళ్లాలి. ఎందుకో, ఎలాగోగాని మనోరమకు తమ కలయికలో యింటరెస్టు తగ్గినట్టుగా అతనికి తోచింది. సంసారంలో, కాపరంలో కొంత మొనాటనీ వచ్చినట్టుగా వుందతనికి.

## ఇది మామూలే

ఒక డిసెంబరు రోజు.

బాలూ, మనోరమా ఆఫీసునుండి వచ్చేసరికి పనిపిల్ల జ్వరం వచ్చిన ఆ కుర్రాణ్ణి అప్పగించి వెళ్ళిపోవటానికి రెడీగా వుంది.

'ఎప్పటినుండీ యిలా ?' అంది మనోరమ.

మధ్యాహ్నం నుండీ పడిశం పట్టుకుంది. అందుకే వొళ్ళు వేడెక్కింది. అది మామూలుగా పాలు తాగించింది. కాకపోతే ఏడుస్తుంటే ఎత్తుకుని తిప్పటమే తప్ప యింకేం చెయ్యగలదు !

''ప్చ్ ! అసలీ పనివాళ్లకు పిల్లాణ్ణప్పగించటమే తప్పు అది వాడి గుడ్డలు సరిగ్గా మారుస్తుందో లేక అలాగే వొదిలేస్తుందో, పాలు ఎలా తాగిస్తుందో ఏమో! ఫీడర్ శుభ్రంగా కడుగు తున్నదోలేదో !'' అంటూ మొదలెట్టింది మనోరమ

''డాక్టరు దగ్గరకు వెడదాంపద'' అన్నాడు బాలూ.

డాక్టర్ ఏవో డ్రాప్స్ రాసిచ్చాడు. తెల్లారి మళ్లీ రమ్మన్నాడు ఇంటికొచ్చిన తర్వాత బాలూ పిల్లాణ్ణెత్తుకుంటే మనోరమ వంట చేసింది. రాత్రి ఈదురుగాలి. అక్కడికీ తలుపులు, కిటికీలన్నీ మూసేశాడు. ఐనా చల్లగానేవుంది. పిల్లవాడికి ముక్కులు బిగుసుకుపోయి నోటితో వూపిరి తీస్తున్నాడు కళ్ళనుండి నీరు కారుతున్నది. జాలిగా, బలహీనంగా ఏడుస్తున్నాడు, ''ఎలా గాబోయ్, రాత్రి ఎలా గడుస్తుందో ఏమో నాకు భయంగావుంది'' అంది మనోరమ.

'పోనీ, మీ వాళ్ళింటికెళదాం' అన్నాడు బాలూ

''బాగుంది. మాటి మాటికీ వాళ్ళింటికెందుకు పోవాలి ? వాళ్ళమీద డబ్బంతా తగలేస్తున్నానంటావుగదా, ఇలాంటప్పుడు మాత్రం వాళ్ళు జ్ఞాపకం వస్తారు. ఐనా వాళ్లేం డాక్టర్లా, వాళ్ళింట్లో హాస్పిటల్‌వుందా?''అంది మనోరమ. వినుక్కుంటూనే, ''నువ్వైతే తినెయ్యి. తరువాత నేను తింటాను'' అంది. బాలూ తిన్నంతసేపూ ఆమె ఏదో చెబుతూనేవుంది.

'ఏమోనోయ్, లాభంలేదు. మన మెక్కడికో పోవాల్సిందే. డ్రాప్స్‌వేసి గంటసేపయింది. ఏమీ తేడాలేదు.''

బాలూ హడావిడిగా భోజనం ముగించాడు. మనోరమ తినలేదు. కుర్రాణ్ణెత్తుకునేవుంది. పద్దైంది.

ఇప్పుడెక్కడికెళ్ళదాం ? మరి కాసేపుచూసి ''అవసరమైతే పోదాం'' అన్నాడు బాలూ

''వాడికి శ్వాసపీల్చుకోవటం లేదంటే ఇంకా చూద్దామంటావేం ?'' ఆమె గాభరాపడుతోంది. బాలూను గాభరాపెడుతోంది.

''ఇప్పుడు డిస్పెన్సరీ వుండదు డాక్టరింటి కెళ్ళాలి.''

''అసలీ ఎం బీ బి ఎస్ వాళ్ళదగ్గరకి పోవటమే తప్పు నువ్వెప్పుడు పిసినారివే చిల్డ్రన్స్ స్పెషలిస్టు ఎంతమందివున్నా నువ్వేమో, దూరమవుతుంది అక్కడి కెందుకంటూ దగ్గర్లో బోర్డు కనిపిస్తే అక్కడికే పోతావు. సరే, ప్రైవేటు డాక్టరెందుకులే, నీకు డబ్బు మిగుల్తుంది, నీ లోఫర్‌కే పోదాంపద'' అంది మనోరమ.

ఆమె మాటల్లో అతనిమీద కసి, కోపం. కాకపోతే నిస్సహాయమైన ఆమె ఆందోళన మాటున అవి ఎదిరించలేకుండావున్నాయి.

వాళ్ల వాదనలో, కోపాల్లో మరో గంటగడిచింది.

'సరే వెడదాంగాని నువ్వైతే తిను' అన్నాడు బాలూ.

''ఛీ-ఛీ. నా తిండి తగలడ. మొదట వెడదాంపద'' అంది మనోరమ.

ఆమె ఒక పెద్ద షాల్ కప్పుకుని కుర్రాడికి వెచ్చగా కప్పింది. బాలూ స్వెటర్ వేసుకొని మఫ్లర్ చుట్టుకున్నాడు. ఆ అర్ధరాత్రి చీకటి చారులగుండా నీ లోఫర్ హాస్పిటల్ చేరుకున్నారు వాళ్ళు

'జలుబు చేసిందంటూ యిలా చలిలో తిప్పుతారేం బేబీని ?'' అంది ఇంచార్జి డాక్టరు. ముక్కుల్లో డ్రాప్స్ వేసింది. జ్వరానికి డ్రాప్స్‌వేసింది. 'మళ్లీ చలిలో వెళ్లి ఎందుకు గాభరాపడతారు ? తెల్లారిందాకా యిక్కడేవుండి వెళ్లండి' అంది. అక్కడికి పిల్లల్ని చేతుల్లో పెట్టుకుని భయవిహ్వలమైన మొహాలతో వచ్చిన మిగతా తల్లిదండ్రులనూ, సీరియస్ కేసులనూ, ఆ చీకటినీ, నిశ్శబ్దంగా అప్పుడప్పుడు పిల్లల, పెద్దల ఏడ్పులతో వులిక్కిపడుతూ—వున్న ఆ విశాలమైన కాంపౌండ్‌నూ, నల్లటి చెట్లనూ, నిద్రకు జోగుతున్న కాపలావాళ్ళనూ, బైట బీడీలు కాలుస్తున్న రిక్షావాళ్లనూ, టాక్సీల్లో ఏడ్పులతోవచ్చే జనాన్నీ, ఆక్సిజన్ సిలిండర్లనూ, వింతగ, భయానకంగావున్న మెడికల్ ఇక్విప్‌మెంట్‌నూ చూస్తూ, మనోరమకు మధ్య మధ్య ధైర్యం చెబుతూ రాత్రి గడిపాడు బాలూ. తెల్లారి ఆర్ ఎమ్‌ఓ వచ్చిచూశాడు. 'నథింగ్ టు వర్రీ.. జెస్ట్ కామన్ కోల్డ్' అన్నాడు. ఆరోజు యిద్దరూ ఆఫీసుకు పోలేదు.

''నీకేం బోలెడు సెలవులున్నాయి. హాయిగా యింట్లో కూర్చోగలవు నన్ను చూడు. సెలవంతా ఐపోయింది. ఎలాగో ఏమిటో ఇంట్లో పెద్దదిక్కంటూ లేంది ఈ పిల్లలతో వుద్యోగం చెయ్యటం ఇంపాజిబుల్'' అంది మనోరమ

''పోనీ, మానెయ్యకూడదూ!'' అన్నాడు బాలూ.

''ఆఁ. మానేస్తాను. ఇప్పటికే నన్ను యింత బాగా చూస్తున్నావు. ఇక వుద్యోగం మానేస్తే చెప్పేదేముంది?'' అంది మనోరమ.

అది వ్యంగ్యమో, అపనమ్మకమో, అసహ్యమో, వ్యాపార తత్వమో, భద్రత వుండదనే భయమో బాలూకు అర్థంకాలేదు.

*ఇంకా వుంది*

# మన సోషలిష్టు రాజ్యాంగము

(1950నుంచి సెప్టెంబరు 1976 దాకా మన రాజ్యాంగం కేవలం 'సావరిన్ డెమొక్రాటిక్ రిపబ్లిక్' మాత్రమే. కాని అప్పటినుంచీ, 42వ రాజ్యాంగ సవరణరీత్యా మనది 'సావరిన్ డెమొక్రాటిక్ సోషలిష్టు సెక్యులర్ రిపబ్లిక్' అయింది. సోషలిష్టు పదవిశ్లేషణకు ఈ వ్యాసంలో ప్రయత్నం జరుగుతున్నది.)

42వ రాజ్యాంగ సవరణరీత్యా ఈ 'సోషలిష్టు' పదాన్ని ఒక్క ముందుమాట (ప్రియాంబుల్)లోనే ప్రవేశ పెట్టటం జరిగింది. రాజ్యాంగంలోని మిగతా ఏ అనుచ్ఛేదాలలో (ఆర్టికల్స్) దీనిని ప్రవేశపెట్టటం జరగలేదు

అయితే ప్రియాంబుల్‌లో ఉన్నపదాలు రాజ్యాంగాన్ని బద్ధం చేస్తయ్యా లేదా అనే విషయంమీదనే పెద్ద వివాదముంది మన సుప్రీంకోర్టు, ఆ పదాలు, దాదాపుగా బద్ధం చేయవనే తేల్చింది. మన రాజ్యాంగ సభ (కాన్స్టిట్యుయెంట్ ఎసెంబ్లీ) ఈ ప్రియాంబులు తాలూకు చర్యను చివ్వరి విషయంగా, 1949 అక్టోబరు 17న తీసుకుంది అనేక సవరణలు ఆ దశలో సూచించబడ్డా, అవ్వన్నీ కాదనుకుని చివరకు ఉన్నదాన్నే యధాతథంగా స్వీకరించారు. రాజ్యాంగంలో చిట్టచివరగా ఆమోదించబడింది ఈ ప్రియాంబులు. అందుకనే అమెరికన్ రాజ్యాంగంలోవలె ఈ ప్రియాంబులు did not "walk before the consitution" అన్నారు

1960లో మన సుప్రీంకోర్టు బెరుబరీ వ్యవహారంలో తన అభిప్రాయాన్నిచ్చింది. దీనికి ముందుగల చరిత్రను ఒకసారి తెలుసుకోవటం మంచిది. తూర్పు బెంగాల్ శరణార్థుల విషయమై 1958 సెప్టెంబరులో నెహ్రూ—ఫిరోజ్‌ఖాన్ నూన్‌ల ఒడంబడిక జరిగింది. దీని ప్రకారం జిలపైగురి జిల్లాలోని బెరుబరి యూనియన్ భారత, పాకిస్థాన్‌లు చెరిసగం పంచుకోవాలి ఈ ఒడంబడిక జరిగిన మరుసటి నెల అక్టోబరులోనే పాకిస్థాన్‌లో మిలిటరీ నియంతృత్వ పాలన మొదలయింది ఈ నియంతృత్వ పాలనలో ప్రథమ చర్యగా 1950లో జరిగిన నెహ్రూ లియాఖత్ ఒడంబడికను రద్దు చేయటం జరిగింది. అయినా మనం ప్రజాస్వామిక భారత దేశంలోని ప్రజలను, నియంతృత్వ పాకిస్థానంలోకి మార్చేందుకు వెనుకాడలేదు. దీనిమీద దేశంలో కొంత ఆందోళన జరిగింది దాని ఫలితంగా రాష్ట్రపతి ఈ విషయంమీద సుప్రీంకోర్టు అభిప్రాయాన్ని కోరారు. ఇలా ఈ విషయం సుప్రీంకోర్టు ముందుకొచ్చింది.

దీనిలో పదిమంది ప్రతి వాదులున్నారు. కేరళ, మండి, విశాఖపట్టణం, మాంగుళూరు, సీతాపూర్, తాలిపరాంబు, కొచ్చిన్‌లకు చెందిన జనసంఘాల అధ్యక్షులు, జిలపైగురి జిల్లా సంఘం సోషలిష్టుపార్టీ కార్యదర్శి, కలకత్తాలోని ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాకు కార్యదర్శి, జిలపైగురిలోని నిర్మలబోస్‌లు ఆ ప్రతివాదులు.

ఎనిమిదిమంది న్యాయమూర్తులతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం 1960 మార్చిలో తీర్పునిచ్చింది ఇందులో శ్రీయుతులు గజేంద్రగడ్కర్, కోకా సుబ్బారావు, హిదయతుల్లా, నేటి షా కమీషను తాలూకు షాలున్నారు. కోర్టు తరఫున శ్రీ గజేంద్ర గడ్కర్ తీర్పు చెప్పాడు. రాజ్యాంగానికి ప్రియాంబుల్ అనేది "a key to the mind of the makers" అనే అమెరికన్ న్యాయవేత్త స్టోరీ వాక్యాలను ఉదహరించి కూడా, ప్రియాంబు లనేది రాజ్యాంగంలో భాగం కాదన్నాడు.[1]

1960నుంచీ నేటివరకూ దాదాపు ఇదే అభిప్రాయము మన న్యాయస్థానాలది 1973 కేశవానంద భారతి తీర్పులో కూడా ఒకే ఒక న్యాయమూర్తి జగన్మోహనరెడ్డి మాత్రమే, బెరుబరి అభిప్రాయంలో మన సుప్రీంకోర్టు, న్యాయవేత్త స్టోరీ అభిప్రాయాన్ని సరిగ్గా గుర్తించలేదన్నాడు. ఏది ఏమైనా అది రాష్ట్రపతి కోరిక మీద వెల్లడించిన అభిప్రాయపు తీర్పు 'advisory opinion' మాత్రమేనని, ఏదన్నా వివాదం సుప్రీంకోర్టు ముందుకొస్తే ఈ అభిప్రాయపు తీర్పు తమలను బద్ధం చేయదన్నాడు

అయినా కేశవానంద భారతి తీర్పులో ప్రతి న్యాయమూర్తి రాజ్యాంగ స్వరూపాన్ని గురించి లోతైన విశ్లేషణ చేశారు. అధిక సంఖ్యాకుల తీర్పుప్రకారం, మన రాజ్యాంగానికొక మౌలికస్వరూప (బేసిక్ స్ట్రక్చర్) వుందని అభిప్రాయపడ్డారు. ముగ్గురు న్యాయమూర్తులు వాటిని స్పష్టంగా ఉదహరించారు. ప్రధాన న్యాయమూర్తి సిక్రీ ప్రజాస్వామిక మరియు రిపబ్లికన్ స్వరూపము సెక్యులర్ స్వరూపము కూడా మౌలిక స్వరూపంలో భాగమంటే, న్యాయమూర్తులు షెలాట్, గ్రోవర్‌లు కూడా దీనితో ఏకీభవించారు. జగన్మోహనరెడ్డి గణతంత్ర ప్రజాస్వామికత్వను గురించి వక్కాణించాడు

ఒక విషయాన్ని మనం ఇక్కడ ముఖ్యం గుర్తించాలి. 'సావరిన్ డెమొక్రాటిక్ రిపబ్లిక్' పద సముదాయంలోలేని సెక్యులర్ పదాన్ని ప్రతి న్యాయమూర్తి ఆమోదించాడు. కొంత మంది స్పష్టంగా ఉదహరించారు. కాని ఎవ్వరూ సోషలిష్టు పదాన్ని ఉదహరించలేదు దానిని స్పష్టపరిచేందుకే శ్రీమతి ఇందిరాగాంధి అత్యవసరపరిస్థితి కాలంలో దీనిని ప్రవేశపెట్టిందని మనం భావించ

వచ్చనుకుంటాను. ఈ పదప్రయోగంలోని సాధక బాధకాలనిక్కడ చర్చించుకుందాం.

రాజ్యాంగంలోని భావాలను గురించిగాని, అనుచ్ఛేదంలోని పదాలను గురించిగాని గంభీరమూ, సున్నితమూ అయిన చర్చ సర్వసాధారణము. ఉదాహరణకు—కేశవానంద భారతి వివాదంలో ఎల్ సాల్వడార్, కోస్టారికా బోటి దేశాల రాజ్యాంగాలతో సహా 71 దేశాల రాజ్యాంగాలు ఉదహరించబడ్డాయి. 17వ శతాబ్దపునాటి గ్రోషియస్ నుంచి నిన్న మొన్నటి హెరాల్డ్ లాస్కి బోటి రాజకీయ శాస్త్రజ్ఞులు, అనేకమంది రాజ్యాంగ శాస్త్రవేత్తలు ఉదహరించబడ్డారు మన రాజ్యాంగ సభలో, రాజ్యాంగ నిర్మాణ సమయంలో జవహరలాల్ నెహ్రూ, సర్దార్ పటేల్, డాక్టరు. శ్యామ ప్రసాద ముఖర్జీ, సర్. అల్లాడి, డాక్టర్. అంబేద్కర్, కె యం. మున్షీ బోటి ప్రముఖుల ఉపన్యాసాల భాగాలు వినిపించబడ్డాయి. భారత జాతీయ కాంగ్రెసు తీర్మానాలన్నీ చూడబడ్డాయి. రాజ్యాంగంలోని పదాల విశ్లేషణకు ఇంత తతంగముంది.

ఈ పృష్ఠభూమి (బాక్ గ్రౌండ్) లో 'సోషలిష్టు' పద విశ్లేషణ ఏమిటి ?

* * *

ప్రారంభంలో రాజ్యాంగ సభలోని ఉపన్యాసాలమీద ఆధారపడటాన్ని గురించి కొన్ని సందేహాలున్నా కేశవానందభారతి తీర్పుతో ఆ సందేహం తొలగిపోయింది. ఉపన్యాసాలను ఉదహరించినా, వాటిమీద ఆధారపడ్డా, చిట్టచివరకు అర్థవివరణ అనే బాధ్యత స్వయంగా నిర్వహింపబడవలసిందే నని ఖన్నా స్పష్టం చేసాడు. 2 దీనికొక కారణాన్ని చెప్పాడు. ఆ ఉపన్యాసాలు ఆ రాజ్యాంగ నిబంధనయొక్క చరిత్రను, ఏ లోపాన్ని నిరోధించటానికి ఆ నిబంధన ప్రవేశపెట్టబడుతున్న మొదలైన విషయాలు ఆ ఉపన్యాసాలలో తెలుస్తాయన్నాడు.

ఈ సౌలభ్యము 'సోషలిష్టు' పదంలో మనకు దొరకదు. రాజ్యాంగ నిర్మాణ సభలో ఈ పదాన్ని గురించి ఉపన్యాసాలేమీ, న్యాయస్థానాలకు మార్గదర్శకంగా ఉండే ఉపన్యాసాలు సుమా, సాగినట్లు కనపడదు.

నేటి లోకసభ, రాజ్యసభలలోని ఉపన్యాసాలకుకూడా రాజ్యాంగ నిర్మాణ సభలోని ఉపన్యాసాల స్థాయినిచ్చి, రాజ్యాంగ వివరణకు లోకసభ ఉపన్యాసాలమీద కూడా న్యాయస్థానాలు ఆధారపడవచ్చా లేదా అనే విషయంమీద సుప్రీంకోర్టింకా ఖచ్చితమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చ లేదనుకుంటాను. ఏదైనా 1976 సెప్టెంబరు నాటి రాజకీయ వాతావరణాన్ని, అత్యవసర పరిస్థితిని గుర్తుకు తెచ్చుకుంటే, న్యాయస్థానాలకు మార్గదర్శకం కాతగినంతటి గంభీర ఉపన్యాసాలు లోకసభలో ఉన్నాయన్న నమ్మకం కుదరటంలేదు.

ఈ పరిస్థితిలో శాస్త్రీయ గ్రంథాలే ఆధారం కాక తప్పని పరిస్థితి ఏర్పడవచ్చు. అయితే దీనిలోనూ ఇంకొక తికమక ఉంది ప్రజాస్వామ్య వ్యవస్థ అనేది కనీసం, రెండు మూడు వందల సంవత్సరాల నుంచీ వస్తున్న వ్యవస్థ. దానిలో ఎన్ని లోపాలున్నా, ప్రపంచంలో అమెరికా, బ్రిటన్‌లు దానిని అవలంభిస్తున్నాయని విజ్ఞుల అంచనా. పైగా మనం మన రాజ్యాంగ నిర్మాణ సందర్భంగా అమెరికన్ రాజ్యాంగంమీద పూర్తిగా ఆధారపడ్డాము. ప్రపంచంలోని లిఖిత రాజ్యాంగాలన్నిటికీ దాదాపుగా అమెరికన్ రాజ్యాంగం మాతృక లాంటిది. కాబట్టే మన రాజ్యాంగ వివరణలో ఎక్కువగా అమెరికన్ రాజ్యాంగ శాస్త్రవేత్తలు, న్యాయ శాస్త్రవేత్తలు, అమెరికన్ తీర్పుల నుంచి ఉదాహరణలు కోకొల్లలుగా కనపడతాయి తరువాతి స్థానం బ్రిటిష్ రాజ్యాంగం దవుతుంది, కాని అది లిఖితమైనది కాదు.

నాకు తెలిసినంతవరకు సోషలిష్టు సమాజ నిర్మాణం తమ ఆశయంగా చెప్పుకుంటున్న దేశాల, మామూలు పరిభాషలో కమ్యూనిష్టుదేశాలుగా గుర్తింపబడుతున్నాయి వాటిలో సోవియట్ రష్యా, చైనాలు అగ్రగాములుగా ఉన్నాయి. సోవియట్ రష్యా, చైనాల రాజ్యాంగాలు కూడా లిఖితమైనవే. ఆ దేశాలు మట్టుకే తమవి సోషలిష్టు రాజ్యాంగాలనీ, సోషలిష్టు సమాజాలని చెప్పుకుంటున్నాయి. తరువాత, వారు వాడిన సోషలిష్టు అనే పదానికి ఒక ఖచ్చితమైన అర్థముంది. ఇప్పుడు ఆ రాజ్యాంగాలను క్లుప్తంగా పరామర్శిద్దాం మనం కూడా ఆ అర్థంలో సోషలిష్టు అనే పదాన్ని వాడామా లేదా అన్న విషయం కూడా పరిశీలిద్దాం.

* * *

సోవియట్ రష్యాలో 1918లో, 1924లో, 1936లో రాజ్యాంగాలు ఏర్పరచబడ్డాయి. నాలుగవ రాజ్యాంగం, 1977 అక్టోబరు 7న ఆమోదింపబడింది దాని ప్రకారం సోవియట్ రష్యా ఒక సోషలిష్టు స్టేట్ (1వ అనుచ్ఛేదము) ప్రజాస్వామిక కేంద్రీకరణము (డెమొక్రాటిక్ సెంట్రలిజమ్) ఆధారంగా ఈ స్టేట్ నిర్మించబడింది. (3వ అనుచ్ఛేదము) సోవియట్ సమాజానికి, అన్ని రాజ్య సంబంధమైన వ్యవస్థలకు, ప్రజావ్యవస్థలకు ధృవతార కమ్యూనిష్టుపార్టీ అది మార్క్సిజం—లెనినిజం ఆధారంగా నడుస్తుంది (6వ అనుచ్ఛేదము)

చైనా రాజ్యాంగం 1975 జనవరి 17న ఆమోదింపబడింది. దాని ప్రకారం కూడా, చైనా ప్రొలెటేరియన్ నియంతృత్వంతో కూడిన సోషలిష్టు స్టేట్ (1వ అనుచ్ఛేదము) చైనీసు ప్రజల నాయకత్వానికి మూలస్తంభం కమ్యూనిష్టుపార్టీ, దానికి సైద్ధాంతిక ఆధారము మార్క్సిజం—లెనినిజం—మావో ఆలోచనా విధానము. (2వ అనుచ్ఛేదము)

ఇంకా వివరంగా రష్యన్ రాజ్యాంగాన్ని పరిశీలిద్దాం. కమ్యూనిజం అనే గమ్యాన్ని చేరేందుకు చేసే పయాణంలో, అభివృద్ధి చెందిన సోషలిష్టు సమాజ మనేది ఒక స్వాభావిక దశ. ఎక్కడయితే ప్రభుత్వ, మరియు కమ్యూనిష్టుల 'స్వ'ప్రభుత్వముంటుందో అలాంటి వర్గరహిత కమ్యూనిష్టు సమాజాన్ని నిర్మించటమే

సోషలిస్టు రాజ్యం ముఖ్యోద్దేశాలలో కొన్ని ఏమిటంటే: కమ్యూనిజం కోసం కావలసిన భౌతిక, సాంకేతిక పునాదులను ఏర్పర్చటం, సోషలిస్టు సామాజిక సంబంధాలను బాగుపరిచి వాటిని కమ్యూనిస్టు సంబంధాల క్రింద రూపొందించడం కమ్యూనిస్టు సమాజంలోని పౌరులను నిర్మించటం వగైరా వగైరా.[3]

అలాగే చైనీసు రాజ్యంలో, రాజ్యాంగం, ''ఎవ్వరయితే పని చెయ్యరో, వారు తినగూడదు'' అనే సోషలిస్టు సూత్రాన్ని అమలు పరుస్తుంది. ఇంకొక సూత్రాన్ని గూడా అమలుపరుస్తుంది. ''ప్రతివ్యక్తినుంచీ అతని శక్తిప్రకారం, ప్రతివ్యక్తికీ అతని పని ప్రకారం'' (9వ అనుచ్ఛేదము) రాజ్యంలోని వ్యవస్థలూ, రాజ్యంలో పనిచేసే వ్యక్తులూ, అందరూ విధిగా మార్క్సిజం—లెనినిజమ్—మావో ఆలోచనా విధానాన్ని పఠించి తీరాలి. (11వ అనుచ్ఛేదము)

అయితే సర్దార్ స్వర్ణసింగ్ కమిటీ మార్క్సిజమ్—లెనినిజమ్ ఆధారభూతమైన సోషలిజాన్నిగాని, లేక మావో ఆలోచనా విధానంతో కూడిన సోషలిజాన్ని గాని కోరిందా, ఆ ఉద్దేశ్యంతోనే సోషలిజం అనే పదాన్ని ప్రవేశపెట్టిందా?

దురదృష్టవశాత్తు శ్రీమతి ఇందిరాగాంధీగాని, నాటి కాంగ్రెసు సిద్ధాంత కర్తలుకాని రష్యా, చైనాలతో దీని విషయమై తర్జన భర్జనలకు దిగలేదు, ఆ అదృష్టము పండిట్‌జీకి కలిగింది.

★ ★ ★

1958 ఆగష్టులో అఖిలభారత కాంగ్రెసు కమిటీ పత్రిక 'ఎకనమిక్ రెవ్యూ'లో 'ఒక ముఖ్యపరిశీలన' అనే వ్యాసం వ్రాశారు. అందులో ఆయన కమ్యూనిస్టు ఉద్యమాన్ని గురించి, దాని ఆశయాలను గురించి కొన్ని భావాలు వ్యక్తంచేశారు. ఆ వ్యాసంలోని విషయాలమీద తన అభిప్రాయాలను తెలియజేయవలసిందిగా ''వరల్డ్ మార్క్సిస్టు రెవ్యూ'' సంపాదకవర్గం సోవియట్ అకడమీషియన్ యూడిన్‌ని అభ్యర్థించగా, ఆయన తన విమర్శను డిసెంబరులో ప్రచురించాడు. భారత కమ్యూనిస్టుపార్టీ ఆ వ్యాసాలను ప్రత్యేకంగా ప్రచురించి వాటికి విస్తృత ప్రచారాన్నిచ్చింది కూడా.

పండిత నెహ్రూ ఇలా వ్రాశాడు : ''నా పాత సహచరుల్లో ఒకరు (డాక్టర్. సంపూర్ణానంద్) ఇందుకు కారణం మన జీవితానికొక గమ్యమంటూ లేకపోవడమని తెలియజేశారు. నిజానికి ప్రపంచంలోనే ఈ విధమైన తాత్వికదృష్టి కొరవడినట్లు కనిపిస్తూంది. దేశాన్ని భౌతికంగా ఐశ్వర్యవంతం మొనర్చేటందుకు మనం ప్రయత్నిస్తున్నాం. కాని ఆ ప్రయత్నంలో మానవ స్వభావంలోని ఆధ్యాత్మిక అంశను గురించి మనమేమీ పట్టించుకోవడం లేదు. అందుచేత మనం వ్యక్తికీ, దేశానికి ఒక జీవితలక్ష్యం చూపాలి : అవసరమైతే దానికోసం ప్రాణాలైనా అర్పించడానికి సిద్ధపడాలి. ఇందుకు మనం ఏదో ఒక తాత్విక దృక్పథాన్ని పునః కల్పన చేయాలి మన ఆలోచ ఉపయోగిస్తున్నాను) ఉండేటట్లు చూడాలి. నేడు మనం సంక్షేమ రాజ్యాన్ని గురించి, ప్రజాస్వామ్యాన్ని గురించి, సోషలిజాన్ని గురించి మాట్లాడుతున్నాం. అవి చక్కటి భావనలే. అయితే వాటివల్ల స్పష్టమైన, నిర్దిష్టమైన అభిప్రాయం కలగదు. ఇదీ ఆయన వాదం. ఇక మన చరమలక్ష్య మేమిటనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. ప్రజాస్వామ్యం, సోషలిజం అనేవి గమ్యాలుకావు గమ్యాన్ని చేరుకునేటందుకు సాధనాలు మాత్రమే ...''[4]

ఈ విధంగా డా. సంపూర్ణానంద్ ప్రశ్నను ఉదహరించి దానికి సమాధానాన్నిచ్చారు పండిట్ నెహ్రూ ''సోషలిజం విషయమేమిటంటే, అది ఉద్దేశ పూర్వకంగా సాధారణ పోకడలను అడ్డుకుంటుందనడంలో సందేహం లేదు. ఆ విధంగా అది ఉత్పత్తిశక్తులను అభివృద్ధి చేయడమే కాక అసమానతలను తగ్గిస్తుంది. కాని సోషలిజం అంటే ఏమిటి ? దీనికి ఖచ్చితమైన సమాధానం చెప్పడం కష్టం ఈ శబ్దానికి అసంఖ్యాకమైన నిర్వచనాలున్నాయి. కొంతమంది దృష్టిలో సోషలిజమంటే ఒక అస్పష్టమైన భావన. దానివల్ల మంచి కలుగుతుందనీ, సమానత్వం లభిస్తుందనీ వారు అభిప్రాయపడతారు. అట్టి నిర్వచనంవల్ల మన కాట్టే ఉపయోగం కలగదు. అనేక సోషలిస్టు భావాలను పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమంగా తనలో ఇముడ్చుకోవటంవల్ల రెండింటిమధ్యనున్న అగాధం సన్నగిల్లుతున్న మాట నిజమే. అయినా సోషలిస్టు దృక్పథం మౌలికంగా పెట్టుబడిదారీ దృక్పథంతో భేదిస్తుంది. సోషలిజం ఒక జీవిత విధానం మాత్రమే కాదు గదా ! ఆర్థిక, సాంఘిక సమస్యల పరిష్కారాని కదొక శాస్త్రీయ పరిశీలనా దృష్టి. వెనుకబడిన దేశాల్లో సోషలిజాన్ని ప్రవేశ పెడితే, ఒక్కసారి అకస్మాత్తుగా అవి అభివృద్ధి చెందిన దేశాలుగా మారిపోవు. నిజం చెప్పాలంటే, ఆ దేశాల్లో సోషలిజమే వెనుకబడ్డ స్వభావం, దారిద్ర్య స్వభావం కలిగి ఉంటుంది...''[5]

పండిట్‌జీ తన వివరణ నీ విధంగా ముగించారు : ''మన సమస్యలకు సంబంధించిన ఆర్థిక విషయాలను పరిశీలించేటప్పుడు శాంతియుత పద్ధతులే అనుసరణీయమను ముఖ్య విషయం ఎల్లప్పుడూ జ్ఞాపకముంచుకోవాలి. అంతేకాక, ప్రతిదానికీ మూలం జీవశక్తి ఒకటి ఉంటుందన్న వేదాంత బోధనుకూడా మనం దృష్టిలో ఉంచుకోవచ్చు.''[6]

ఈ భావ ప్రకటనకు, అనుకోకుండా రష్యానుంచి యూడిన్ ద్వారా సూటియైన, ఘాటైన సమాధాన మొచ్చింది.

''శ్రీ నెహ్రూ ఇండియాకు సోషలిజమే రాజమార్గమంటారు. అయినా కమ్యూనిస్టు పంథాకు భిన్నమంటారు. ఆ అభిప్రాయాన్ని నిరూపించేటందుకు ఒక భావన స్థానంలో మరో భావనను ప్రతిపాదిస్తున్నారు కమ్యూనిజానికి, సోషలిజానికీ మధ్య సరిహద్దు గీతలు గీసి ఒకదానికొకటి సంబంధంలేదని చెప్పడానికై ఆయన చాలా శ్రమ పడ్డారు సోషలిజం అంటే

ఏమిటో చెప్పేముందు పెట్టుబడిదారీ విధానం యొక్క స్వభావ లక్షణాలను వివరించారు. ఇక్కడికొచ్చేసరికి నెహ్రూగారు సోషలిజం అనుకునే దానికీ, అసలు సోషలిజానికీ పోలికలేవీ లేవని తేలింది...''[7]

''భారతదేశం సోషలిష్టుమార్గాన్ని అనుసరిస్తుందని శ్రీ నెహ్రూ చెప్పడంవలన ఆ మార్గాన్ననుసరించి లాభం పొందిన అనేక యూరోపియన్, ఆసియా దేశాలవలననే దాని విజయాలను ఆయన స్వీకరిస్తారని అనిపిస్తుంది. కాని అది సరికాదు. అనేక దేశాలలో అద్భుత విజయాలను సాధించిన సోషలిజానికి, ఆయన అనుకునే సోషలిజానికి తేడాఉండదు.''[8]

''......శ్రీ నెహ్రూ ఉద్దేశ్యంలో సోషలిజం అంటే ఏమిటో నిజంగా తెల్సుకోవడం కష్టం నిజంచేత ఆ కష్టం ఆయనకూ తోచింది. అందుకే ఇలా అన్నారు: ''కాని సోషలిజం అంటే ఏమిటి ? దీనికి ఖచ్చితమైన సమాధానం చెప్పడం కష్టం. ఈ శబ్దానికి అసంఖ్యాకమైన నిర్వచనాలున్నాయి.'' నలభైఏళ్లక్రితం ఈ మాటంటే అర్థం ఉండేది. సమీప భవిష్యత్తుకి సంబంధించిన విషయమైతే నేమి అది ఇంకా ఆ నాటికి భవిష్యత్తుకు సంబంధించిన మాటే. అయినా ఆ నాడుకూడా సోషలిజం అనేదానికి మార్క్సిజం బలమైన ఆధారాలతో శాస్త్రీయమైన నిర్వచనాన్నిచ్చింది. ఈనాడు సోషలిజాన్ని సిద్ధాంతరీత్యా ఊహించుకోనక్కరలేదు. అదో సజీవ మైన వ్యవస్థ. నూరుకోట్లమంది ప్రజలు సోషలిజాన్ని నిర్మిస్తున్నారు. కొన్ని దేశాలు ఎక్కువ అభివృద్ధి పొందియుండవచ్చు. కొన్ని తక్కువ పొందియుండవచ్చు. ఏమైనా మొత్తంమీద పెట్టుబడిదారీ విధానంలోనుండి సోషలిజంలోనికి చారిత్రకంగా పెద్దమార్పు వచ్చేసింది. సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయంపొంది క్రమంగా కమ్యూనిజంలోనికి మార్పుపొందు తోంది.''[9]

''సోషలిజాన్ని గురించి తాము చెపుతున్న ''కొత్తభావన''ను ప్రతిపాదించేటప్పుడు అనేకములైన యూరోపియన్, ఆశియా దేశాలలో ఈవేళ నిర్మింపబడుతూన్న నిజము, సజీవము అయిన సోషలిజాన్ని నిందించపూనుకున్నారు. మార్క్స్ చెప్పిన సోషలిజం కమ్యూనిజం ఒక్కటేయని శ్రీ నెహ్రూ అభిప్రాయం. దానికి రెండు లక్షణాలు ఉన్నాయి అన్నారు. ఒకటి హింస, రెండు వ్యక్తి స్వాతంత్ర్యం లేకపోవడమున్నూ. ఆ విధంగా కమ్యూనిజానికి సోష లిజానికి భేదం చూపించారు...''[10]

''ఆయన సోషలిజానికి, కమ్యూనిజానికి పోటీపెట్టారు. ఐనా మార్క్సిజం, లెనినిజం ప్రకారం ఈ రెండింటినీ విడదీసే స్పష్టమైన హద్దు ఏదీలేదు. కమ్యూనిజానికి రెండుదశలు ఉన్నాయి. ఒకటి దిగువదశ లేక మొదటిదశ. రెండోది ఉన్నతదశ లేక రెండవదశ. సోషలిజం అనేది కమ్యూనిజం యొక్క మొదటి మెట్టు లేక దిగువదశ. దీనికి మరో వ్యాఖ్యానం చేయడం అసలు సమస్యయొక్క శాస్త్రీయ వివేచనను త్రోసిపుచ్చటమూ, కళ్ళ ఎదుట కనిపించే ప్రగతిని నిర్లక్ష్యం చెయ్యడమూ అనిపించు కుంటుంది. శ్రీ నెహ్రూ మీదగాని మరొకరిమీదగాని మార్క్సిష్టు శాస్త్రీయ సోషలిజాన్ని రుద్దడం మా అభిప్రాయం కాదు. లేకపోతే కనీసం ఆలోచనా విధానంలోనైనా నిర్బంధిస్తున్నారని మమల్ని నిందించవచ్చు. కాని ఒక శాస్త్రీయ విషయాన్ని విమర్శించ పూను కుని దానిమీద తీవ్రమైన చర్యకు దిగదలచుకున్నపుడు పరిస్థితు లను గమనికలోనికి తీసుకుని పరిశీలించడం అవసరం అని చెప్పడం తప్పు కాదనుకుంటున్నాం.''

''... అందుచేతనే శ్రీ నెహ్రూగారి సోషలిజంయొక్క తత్వం గురించి ఎంత తెలుసుకుందామన్నా అది అర్థంకావటంలేదు. సోషలిజమంటే సోషలిజమే. అంతే...''[11]

ఇది 1958 నాటి సంగతి.

1978లో పరిస్థితులు మారాయి. సోషలిష్టులలో అధిక సంఖ్యాకులైన చైనీయులు, 'సోవియట్ సోషల్ ఇంపీరియలిజం' అని కూడా అంటున్నారు. ఏది ఏమైనా నేడు ప్రపంచంలో మేము సోషలిష్టులం, మాది సోషలిష్టుగమ్యం, మాది సోషలిష్టు సమాజం అని చెప్పేవారి సోషలిజం, కమ్యూనిజమనే అంతిమాశ యానికి మొదటిమెట్టు మాత్రమే. దాని నిర్వచనం, ఆచరణం మార్క్సిష్టు — లెనినిష్టు వివేచనతోనూ, ఇంకా మావోయిష్టు వివేచనతోనూ మాత్రమే చేయవలసినది, అనుసరింప వలసినది.

ఏ వివేచనకైనా ఆధారభూతమైనది శక్తి. ఈనాడు కమ్యూనిష్టులు అధికారంలోనికి రాకుండా, మాది సోషలిజమంటే, దానిమీద మనకంత వ్యామోహముండదు. ప్రపంచంలోని ఒక భాగంలో అధికారాన్ని స్వీకరించిన ఒక విశిష్ట దృక్పథం మాది సోషలిజ మంటుంటే, మాదికూడా సోషలిజమే సుమా అంటూ 1976లో, రాజ్యాంగంతోసహా, మనంకూడా శ్రుతి కలిపాం.

అయితే మన మనస్సూ, మన చరిత్రా వారి 'సోషలిజం' మన 'సోషలిజం'కు సామ్యం మాటలోనే కాని చేతలలో కాదు అని ధృడంగా చెపుతుంది. ఇపుడు మన సోషలిజాన్నికూడా పరిశీలిద్దాం.

★ ★ ★

మన దేశంలో సోషలిజం భావనది విచిత్రప్రయాణం భారత జాతీయ కాంగ్రెసులో భాగంగా బయలుదేరి, సోషలిజంగా వేరుపడి ప్రజాసోషలిష్టు పార్టీగా రూపొందాల్సి తిరిగి జాతీయ కాంగ్రెసుయొక్క 'సోషలిష్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటీ' తీర్మానం వలన ప్రభావితమై కాంగ్రెసులో లీనమైనంత కాగా, మిగిలిన వారు మొండిగా ఆ భావనే ఆధారంగా తమ ప్రయాణం సాగించారు. వీరి నాయకుడు డాక్టరు. రామమనోహర్ లోహియా. లోహియా తన జీవితకాలంలో కాంగ్రెసులో చేరలేదు

1967 సెప్టెంబరు 11 న లోహియా మరణించినప్పుడు, ఒక ప్రముఖ పత్రికా రచయిత ఆయన విశిష్టతను వివరిస్తూ

ఈవిధంగా నివాళు లర్పించాడు. ''మూడున్నర దశాబ్దాలు భారత రాజకీయరంగంలో మెరిసిపోయిన తార డా. లోహియా పోరాటానికి మారుపేరు **లోహియా** — స్వరాజ్యావతరణం వరకు స్వరాజ్యానికై పోరాడారు. స్వరాజ్యావతరణానంతర భారత ప్రజాజీవనానికి సంబంధించిన స్పష్టమైన కల్పనతో ఆయన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కల్పనను సాధించేందుకు సాధనంగా సోషలిజాన్ని స్వీకరించారు. స్వరాజ్యసమర ప్రాంగణంలోనుండే — 1934 లో కాంగ్రెసు సోషలిష్టుపార్టీ సంస్థాపకులలో ఒకరై — సోషలిష్టు ఆదర్శ సాధనకు పునాదులు వేశారు. జాతీయసమరంలో వీరుడుగా ఉంటూనే అంతర్జాతీయ విషయాలపై శ్రద్ధ వహించారు. కాంగ్రెసు కమిటీలోని విదేశీ వ్యవహారాల ఉప సంఘం కార్యదర్శిగా 1936 నుండి 1938 వరకు పనిచేశారు. ఆ విషయాలలో ఆయన పాత్రకు సూచన ఆకార్యదర్శిత్వం. ఎ. ఐ. సి సి కి ఆయన కొన్నాళ్లు కార్యదర్శి. ఆయన నామకః కాంగ్రెసు సమరంలో ఉన్న వ్యక్తి కావనేందుకు, కాంగ్రెసు పునాదిరాళ్లలో ఒకరనేందుకు నిదర్శనం ఇది.'' 12

''ఆయనకు స్వతంత్రమైన, స్పష్టమైన దృక్పథం, లక్ష్యం ఉంది. అందరికీ చెందిన ఉద్యమాలలో పాల్గొంటూ తన స్పష్టమైన లక్ష్యానికీ, తన విశ్వాసాలకూ అనుగుణంగా కృషి చేయడం ఆయన ప్రత్యేకత. ఆయన అందరి నిర్ణయానికి తలవంచవలసివస్తే దానికి తల వంచుతాడు. కాని ఏ ఒక్కరో చెప్పారు గనుక — వారు గాంధీ అయినా సరే నెహ్రూ అయినా సరే — తలవంచడం అనే ప్రవృత్తి ఆయనకు సుతరామూ పనికిరాదు...'' 13

కాంగ్రెసు పేరును ఈయన ''వదిలివేసి తన లక్ష్యాలకు అనుగుణమైన సంస్థలు పార్టీలు, ఆందోళనలు, ఉద్యమాలు స్వీకరించారు కాంగ్రెసుపేరు వాడు కొనకుండా ఉండడమేకాదు. అవసరాన్నిబట్టి తాను నీరుపోసి పెంచిన 'కాంగ్రెసు' అనేదాన్ని పదవీభ్రష్టం చేయడానికికూడా నడుం కట్టాడు. ఆంగ్లేయుల పెత్తనంతో ఎలా పోరాడాడో కాంగ్రెసు పెత్తనంతోనూ అలా పోరాటం ప్రారంభించాడు.'' 14

''సోషలిష్టు వ్యవస్థకోసం లోహియా సోషలిష్టులమనే వారితో కలిసి పార్టీలు స్థాపించారు, విడగొట్టారు అదంతా ఒక వ్యవహారం. దానిని విమర్శించిన వారూ ఉన్నారు, ప్రశంసించిన వారూ ఉన్నారు... ఆయన సోషలిజాన్ని స్వీకరించినా — సోషలిష్టు మొహమాటాలతో మాత్రం తన పోరాటాన్ని ప్రభావితం చేయలేదు. నెహ్రూ తానుకూడా సోషలిష్టునే అన్నాడు. కాంగ్రెసు సోషలిజమే నంది. అంతమాత్రాన లోహియా వారిని కౌగిలించుకోలేదు కమ్యూనిష్టులూ సోషలిజమేనన్నారు. చైనా రష్యాలు ప్రపంచ సోషలిష్టు ఉద్యమం అన్నాయి అంతమాత్రాన — చైనా దురాక్రమణను, ఆయన గర్హించకుండాను ఉండలేదు. సోషలిజం పేరుతో నెహ్రూ వ్యవహారణలో కానవచ్చిన బలహీనతలు లోహియాలో కానవచ్చాయనేందుకు అవకాశం లేదు'' 15

''...పార్టీల, నినాదాల మాటలెలాఉన్నా—ఆ జీవన సూత్రం, ఆ ఆకాంక్షలు, పీడితప్రజలపై శ్రద్ధ, నిరంతర పోరాటశక్తి, నమ్మిన ఆశయం కోసం నిర్మొహమాటంగా వ్యవహరిస్తూకూడా అందరితోనూ మైత్రి నెరపగల అలాక్కక్యం—అందరూ అలవరచుకొనగల్గితే ఈ జాతి ఇంకెంతో ఉన్నతస్థాయికి త్వరితగతిని రాగలదనేది నిస్సంశయం. అలా అలవరచుకొన గల్గడమే ఆయనకు మనమీయదగు శ్రద్ధాంజలి.'' 16 ఇలాంటి వ్యక్తిత్వం డా. లోహియాది.

అయితే సోషలిష్టుపదం రాజ్యాంగంలో చేర్చబడే శుభ సమయంలో ఈయన అనుయాయులనే వారుకూడా జైళ్లలోనే ఉన్నారు ఇప్పుడు క్లుప్తంగా డాక్టరు. లోహియా భావాలను పరామర్శిద్దాం. అనుదిన పరిపాలనా భారంతో సతమతమయ్యే నెహ్రూజీ తన భావాలను గ్రంధస్థం చెయ్యలేదు అందుకనే యూడిన్‌కూడా, భవిష్యత్తులో అవకాశం దొరికినట్లైతే సోషలిజాన్ని గురించి తమ అభిప్రాయాలను ఇంకా వివరంగా శ్రీ నెహ్రూ చెప్తారని ఆశిస్తున్నానన్నాడు. లోహియా అలా కాకుండా కొంతవరకు తన భావాలను గ్రంధస్థం చేశాడు.

లోహియా దృష్టిలో కమ్యూనిజమనేది ఆశియాకు ప్రతిగా యూరప్ ఖండం రూపొందించిన అధునాతన ఆయుధము షుమారు 300 సంవత్సరాల వరకు యూరప్ ఖండం ఉదార వాదము, క్రైస్తవ మతము, పెట్టుబడిదారీ విధానము మొదలైన వాటిని తయారు చేసింది అవి వాటి వాటి చారిత్రక బాధ్యతలను నిర్వర్తించాయి. ఇప్పటి నూతన ఆయుధం కమ్యూనిజం. కమ్యూనిజం

షుమారు వంద సంవత్సరాల నుంచి యూరప్ ఖండాన్ని ప్రభావితం చేస్తున్నది.[17]

అయితే మార్క్సు ఆలోచనావిధానంలోనే లోపముందంటాడు లోహియా. మార్క్సు పెట్టుబడిదారీ విధాన విశ్లేషణ గావించి అదనపు విలువ(surplus value) వర్గ కలహము (Class struggle) చిట్టచివరకు ఏది ఏమైనా విప్లవం వచ్చి తీరాలి (Ultimate revolution) అనే మూడు విషయాలను ప్రతిపాదించాడు. అయితే ఈయన విశ్లేషణ గావించిన పెట్టుబడిదారీ విధానం దాదాపుగా పశ్చిమ యూరప్‌కు సంబంధించినదే అంటాడు. గత మూడు లేక నాలుగు వందల సంవత్సరాల పెట్టుబడిదారీ విధాన చరిత్రను పరిశీలించినట్లయితే, అది దాదాపుగా ఇండియా, చైనా, మలయా, బర్మాలమంచి ఇంగ్లాండ్, ఫ్రాన్సు, జర్మనీ మొదలైన దేశాలకు, ఇప్పుడు రష్యా,అమెరికాలకు సంపదపోవట మంటాడు. పెట్టుబడిదారీ విధాన చరిత్రలో, గత మూడు లేక నాలుగు వందల సంవత్సరాల నుంచీ పశ్చిమ యూరపుదే ఆచార్యపీఠం ఈ ప్రత్యేకతను ఈ క్రిందివిధంగా ఉదహరించాడు :[18]

అమెరికను శ్రామికుడు నేడు దాదాపు పదివేల రూపాయల విలువగల పరికరాలతో ఉత్పత్తి సాగిస్తున్నాడు. పశ్చిమ జర్మనీ శ్రామికుడు అయిదువేల రూపాయల విలువగల పరికరాలతో ఉత్పత్తి సాగిస్తే, భారత దేశంలోని శ్రామికుడు కేవలం నూట ఏభై రూపాయల పరికరాలతో ఉత్పత్తి సాగిస్తున్నాడు. రెండవవైపున జనాభా బాగా పెరగసాగింది. 19వ శతాబ్దం కంటె యూరప్ జనాభా నాలుగు వంతులు పెరిగింది[19]

మార్క్సు సూత్రీకరణ ఏమిటంటే పెట్టుబడిదారీ విధానం పెరిగిన కొద్దీ, శ్రామికవర్గం కూడా ప్రక్క ప్రక్కనే విపరీతంగా పెరుగుతుందనీ, తద్వారా పెట్టుబడిదారీ విధానం తన గోతిని తానే త్రవ్వుకుంటుందనీ, విప్లవం తప్పక వస్తుందనీ అయితే లోహియా దృష్టిలో ఈ పరిణామాలన్నీ ఒకే ఆర్థిక వ్యవస్థలో జరగాలనటం, మార్క్సులోపమంటాడు. పెట్టుబడిదారీవిధానం పశ్చిమయూరప్‌లో పెరుగుతుంటే, బీదతనం అభివృద్ధి చెందటం వేరుదేశాల్లో జరిగిందంటాడు.[20]

ఉదాహరణకు—భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం అంతమైతే, ఏమి జరుగుతుందనేది మార్క్సిస్టు సిద్ధాంతానికి అవగాహన కాదంటాడు, ఎందుకంటె మార్క్సిస్టు సిద్ధాంతానికి, పెట్టుబడిదారీ విధానం తొలగిన తరువాత సమస్యలే ఉండవు.

భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం తొలగినా, ఈ దేశపు శ్రామికునికి నూట యాభై రూపాయల పెట్టుబడితో ఉన్న పరికరాలే లభ్యమవుతాయంటాడు.

మానవ మేధకు సహజమైన కుతితో రష్యాయొక్క పురోభివృద్ధిని చూచి మనం అలా చేయాలనుకుంటే అసంభవమంటాడు లోహియా, కారణం? ఒకటే. రష్యాలో చూపిన విపరీతమైన క్రూరత్వము ఎంతమాత్రమూ ఫలితాల నివ్వదంటాడు.[21]

మార్క్సిజం, సోషలిజం యొక్క భేదాలను గురించి ఇలా వివరంగా చెపుతాడు :

"If one were now to make a distinction between Marxisn and Socialism, so far as this analysis is concerned, one would have to admit that Marxism and Communism construe their task by one half. They think alone in terms of destroying the relations of capitalist production, whereas genuine socialism would have to think in terms of destroying both the capitalist relations of production and the capitalist forces of production or atleast vastly remodelling them. It would have to think of a society and a civilization in which the worker and the agriculturist and the other professions will be, equipped with tools with which they could porduce more wealth and yet not succumb either to the subjective temptation or to the objective reality of a continually increasing x standard of living. The socialist therefore has got to carry out two tasks at the same time. The Communist carries out only one task; he destroys the capitalist class and them there is an end to the matter, whereas the socialist will have to destroy the capitalist class as well as destroy the methods of production which capitalism has given to the world. It is a two fold task."

(Dr. Lohis's speech in Hyderabad in August 52.)

లోహియా యొక్క ఈ విశ్లేషణను ఇంకొక్క అభిప్రాయ వివరణతో ఆపివేస్తాను మార్క్సిస్టు లేదా కమ్యూనిస్టు ఆర్థిక సిద్ధాంతాల మీద, అహింసా సిద్ధాంతాన్ని లేదా ప్రజాస్వామ్యాన్ని రుద్దటం కేవలం మూర్ఖత్వమంటాడు. సూటిగా చెప్పాలంటే కమ్యూనిజం — హింస + ప్రజాస్వామ్యం=సోషలిజం లేక గాంధీఇజం కాదంటాడు.

ఈ వ్యాసంలో లోహియా విచారధారను పరామర్శించటం ముఖ్యోద్దేశ్యం కానేకాదు స్వాతంత్ర్య సంపాదనానంతరం పరిపాలనా బాధ్యతలలో నిమగ్నమైన పండిట్‌జీ సిద్ధాంతరీత్యా ఏ ఆలోచననూ ప్రజల ముందుంచలేదు. ఉంచినా అది తృప్తిగాలేదు. కొంతవరకు లోహియా స్పష్టధోరణిని వ్యక్తంచేశాడు. అందుకనే లోహియాను దీర్ఘంగా ఉదహరించటం జరిగింది ఇదయినా లోహియాయొక్క ఒక్క ఉపన్యాసం నుంచే సుమా !

దీని ఉద్దేశ్యమల్లా 'సోషలిజం' అనే మాటకు మనం వేరు అర్థాన్ని, మార్క్సిస్టు—లెనినిస్టు—మావో ఇష్టు ఆలోచనల కంటె భిన్నమైన అర్థాన్ని ఆపాదించుకుంటున్నామని చెప్పేందుకు పూర్తి ఆధారాలున్నాయని చూపించటమే.

కేశవానంద భారతి విషయంలో హాబ్స్, కాంట్, హెగెల్, గ్రాన్‌విల్ ఆస్టిన్, బ్రైస్, వి. వి. డైసీ, సర్ ఐవర్ జెన్నింగ్స్ మొదలైన వారిని ఉదహరించినప్పుడు 'సోషలిష్టు' పద విశ్లేషణకు మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల రచనలేకాకుండా, 'ఇండియన్ సోషలిష్టు'లుగా చలామణి అయిన నెహ్రూ, జై ప్రకాశ్, ఆచార్య నరేంద్రదేవ్, లోహియాలు అనవసరంకారుగదా! వీరందరినీ ఎప్పుడో ఒకప్పుడు ప్రభావితం చేసిన గాంధీజీ రచనలు కూడా చూడాలికదా!

అత్యవసర పరిస్థితి అనంతరం రాజ్యాంగ వివరణ, విశ్లేషణలలో ఏర్పడబోయే సన్నిత పరిస్థితి ఇది. దీనిని మన న్యాయమూర్తులెలా పరిష్కరిస్తారో వేచి చూడవలసిందే.

## అథోజ్ఞాపికలు

1. "...but nevertheless the preamble is not a part of the constitution, and, it has never been regarded as the source of any substantive power conferred on the Government of Indian Union or on any of its departments."

2. "It can therefore be said that this court has now accepted the view in its decisions since Golaknath's case that speeches made in the Constituent Assembly can be referred to while dealing with the provisions of the Constitution...The speeches, cannot, however, form the basis for construing the provisions of the Constitution. The task of interpreting the provisions of the Constitution has to be done independently and the reference to the speeches made in the Constituent Assembly does not absolve the Court from performing that task."

**Justice Khanna In Kesavananda Bharati Case**

"Developed Socialist Society is a natural, logical stage on the road to Communism.

"The supreme goal of Soviet State is building of a classless communist society in which there will be public, communist self government. The main aims of the people's socialist state are: to lay the material and technical foundation of communism, to perfect socialist social relations and transform them into communist relations, to mould the citizen of communist society, to raise the people's living and cultural standards, to safeguard the country's security, and to further the consolidation of peace and development of international cooperation." — Constitution (Fundamental Law) Of The Union Of Soviet Socialist Republics. in "NEW SOVIET CONSTITUTION" An Indian Assessment - Introduction And Editing by Jitendra Sharma Allied Publishers Private Limited, -1978. (Page 82)

4 నుంచి 11 వరకు –

- ఇవ్వన్నీ "ఒక ముఖ్య పరిశీలన – పండిత నెహ్రూ వ్యాసం : యూడిన్ జవాబు" అనే పేరుతో విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ వారు 1959 జనవరిలో ప్రచురించిన పుస్తకం నుండి ఉదహరించబడినవి

12 నుంచి 16 వరకు –

ఇవ్వన్నీ 16–10–67 నాటి విజయవాడ వారపత్రిక "జాగృతి"సంపాదకీయం నుంచి ఉదహరించబడినవి. విచిత్రమేమిటంటే నాటి సంపాదకులు శ్రీ తూములూరు లక్ష్మీనారాయణగారు సోషలిష్టుగా ఎప్పుడూ చలామణి కాలేదు. అయినా వారి లేఖిని నుండి ఇంతచక్కటి నివాళి సమర్పింపబడింది.

17 డాక్టర్. రామమనోహర్ లోహియా అప్పుడప్పుడూ ఇచ్చిన ఉపన్యాసాలు, వ్రాసిన వ్యాసాలు ఒక సంపుటిగా 'Marx, Gandhi and Socialism' అనే పేరుతో 1963 లో హైదరాబాద్ నుంచి ప్రకటించబడ్డాయి. ఇందులోని ఉదహరింపులన్నీ ఆ పుస్తకం నుండే. Page 260–"The International Aspect of Communism" written in 1948.

18 — Page 95, 96 "Marxism and Socialism" Speech in Hyderabad in August, 52.

19 — Pages 97, 98 from the same Speech.

20. — Page 102 from the same speech.

21 — "In India, any attempt whether under Communism or socialism or capitalism to achieve the modern civilization which the world has known for the past 300 years must result in barren cruelty, cruelty, which knows no success" Page 109 from the same speech.

# కాళిదాస విలాసము

శ్రీ పోచిరాజు శేషగిరిరావు

మందాక్రాంతము నీ వశమ్మయి
యసామాన్య ప్రభాచాతురీ
సౌందర్యమ్ములు రాశివోసె కవిరాజా !
'మేఘదూత' మ్మునన్
విందుల్ గూర్చుచు నీదు వర్ణనలు
పర్వెన్ విశ్వవిఖ్యాతమై
యెందున్ నీ కవితా కలాపములె ?
బ్రాహ్మదత్త మేధానిధీ !

వినిపించినాడవె విక్రమ్మోర్వీశు న
కఖిల పురాణ విద్యాగమములు
కల్పించినాడవె కావ్యత్రయము విశ్వ
సాహిత్య రసికులు సంతసింప
నిర్మించినాడవె నిర్ణిబంధ నిబంధ
నాటకత్రయము ప్రజ్ఞామయముగ
'వెదజల్లినాడవె విశదకీర్తి స్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు'
భాషించినాడవో బహుదేశ బుధులతో
కవితా విలాస విక్రమము మెఱయ

కథలు కథలుగాగ కమ్మని నీచాటు
కావ్యధారలెన్నొ కలవు జగతి
రసికరాజుగాగ రాణించితివో యేమొ !
విప్పి చెప్పలేము ! వినికి యొకటె!

ఒక 'యక్షకాంత' ప్రియునికినై విరహమ్ము
పడి మేఘమాలతో పంపె వార్త

ఒకతలోదరి 'మాళవిక' రసోత్తర నాట్య
భంగిమచేత సంబరము కూర్చె
ఒక 'యప్సరఃకాంత' యునికి ఆశ్రమవాటి
లావణ్యవీణ హేలగను మీటె
ఒక్క 'యూర్వశి' విక్రమోర్వీశు తన దృగ్వి
లాసమ్ముతోడ లాలసుని జేసె

ఊహ చేసిన మూర్తులై యుండు నొక్కొ
ఊహతో సృజియించిన వేమొ యివ్వి !
వాస్తవజగాన నీకు సంప్రాప్తమయిరొ !
భోగపుష్కల ! ఏమి చెప్పుదుము మేము ?

'ప్రణుతింతు రసభావ భావనా మహనీయ
కవితా సముల్లాసు కాళిదాసు'
'భజియింతు సాహిత్య పదవీ మహారాజ్య
భద్రాసనా సీను' పద్య వితతి
గణుతింతు నిరవద్య కావ్య ధారాస్రష్ట
పదబంధ పరిమళ ప్రతతి విరియ
వచియింతు గీర్వాణ వాణీ విలాసు చా
తురు లెల్ల విబుధులు మురియునట్లు

కాళిదాస గిరాంవీథి కదలి రండు !
ఆస్వదింపుడు తత్కవితాసవమ్ము !
అల కనిష్ఠికాధిష్ఠితామర కవీంద్ర !
ప్రకట పుంభావ శారదా ! వందనమ్ము !



# కవితా కాళిదాసము

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

కాళిదాస కవీంద్ర, నీ కావ్యలోక
మదీ మధుజగత్తు, అందు నా మనసు ఒక్క
హంసయ్యి పోయి, తేలుచు హోయి, రెక్క
విసరిసాగు కైలాసమాన సముదాక —

ఇచట మంచు కొండ, ఇచట మొయిలు కూన,
శ్యామ కాననమ్ము, హరిణకమ్ము,
చెఱకుతోపు నీడ చేడె తీయని పాట
ప్రణయ వేదమునకు భాష్యములగు —

సాగు, నీ కవితాసౌధ చంద్రశాల
స్వామి, మంగళ సంగీత సౌరభమ్ము
ఎదియొ, అదియు చల్లగ సోక హృదికి తోచు
కొసరి వాగ్దేవి మెయితావి విసరినట్లు.

ఓయి రసికావతంస సమా, ఒక్కసారి
మనసు పులకించిపోవు కన్గొనిన యంత
నింగిపై నీవు పంపిన నిర్భర రస
పూర్ణ ప్రణయరేఖ, తొలి కారొమ్మగిలు లేఖ!

విమల కవితా మధుర యోగ వేళ నీవు
సృష్టికర్తవు, వపుడు ఊర్వశి కనుగొన ని
లుచు విరహ వీణతో, మదిలోన ఋగమ్ము
సాంబశివమగు తేజమ్ము, సలలితమ్ము!

ఏ విహాయసములనుండొ ఎగసివచ్చి
సొగసుగా లాస్యమాడుచు చుట్టు చేరి
కొలుచుచుందురు ఋతుసుందరులును, అపుడు
విశ్వవిశ్వమ్ము నీ మ్రోల వినమితమ్ము.

కవి కుల స్వామి, యుగకవీ, కాళిదాస!
మహిత మానవధర్మమే మరచిపోయి
అసలు త్రోవ తెన్నును లేక మసలు మాకు
అగును, నీ మహా కావ్యము లమృతభిక్ష.

తనువు కంటుకొన్న తరళరాగజ్వాల
గాలి, కాంచన కళవోలె తేలి;
స్వర్గమెత్తు కెదుగు ప్రణయ తపస్విని
నీ శకుంతల యది నిజము నిజము.

అకుచాటు మొగ్గ అతి సహజముగ విడి
నెమ్మి వికసించి వలచిన నేరమునకు
ఈసు సంకెల చెరజిక్కి గాసివడిన
మంచి మల్లెపూవు గద నీ మాళవికయు —

వెల్ల గొడుగునీడ వెలుగు ధర్మకథకు
కర్పూర హారతి కావ్యమొకటి
అర్ధనారీశ్వరమ్మైన దివ్యప్రేమ
కల్యాణ గీతమ్ము కావ్యమొకటి
జీవన గానమ్ములో విరహస్వర
మ్మెట్టిదో వినిపించు మేఘ మొకటి
అలరెడు ఋతులీల చలియించు అలనాటి
ప్రకృతి జీవితపు దర్పణము ఒకటి

భరత జాతి భోగ భాగ్య వైభవములు
భరత నీతి ధర్మ పరిమళమ్ము
ఇచటి వెలుగు మెరుగు, ఇచటి వలపు తీపి
అన్ని నీ రచనల అక్షరములు!

శ్రీ నా. భక్తవత్సలరెడ్డి

# కాల్పనిక ప్రస్థానావిర్భావం - కుమారన్ ఆశాన్

ఆంగ్ల సాహిత్యంలో 'రొమాంటిసిజం' అన్న వుద్యమానికి చాలా విధాల పోలికలు కల్గిన వుద్యమాలు భారతీయ బాషల్లో వచ్చాయి. మలయాళంలో 'కాల్పనిక ప్రస్థానం' అనీ, తెలుగులో 'భావకవిత్వం' అనీ ఇవి పిలువబడ్డాయి.

సూక్ష్మంగా 'రొమాంటిసిజం' అంటే ఏమిటి? ఎన్నో సిద్ధాంతాలు ఈ విషయంలో వెలువడ్డాయి. మలయాళ విమర్శకులు, కవులు "రొమాంటిసిజం ఒరు మనోభావ మాణు, ప్రస్థానమల్ల" (రొమాంటిసిజం భావనామయమైంది; వుద్యమం కాదు) అన్నారు.[1] శ్రీశ్రీ చెప్పింది కూడా ఇదే ఎ. బాలకృష్ణపిళ్లె అనే అతను దీన్ని "మనం నోక్కి" (మనస్సు చూసింది)గా వర్ణించాడు. ఇందువల్ల రొమాంటిక్ కవి అహంకారబుద్ధి కల వాళ్లలో మొదటి తరగతిలో చేర్చబడ్డాడు అతని దృష్టి ఎప్పుడూ తన్నుగురించే; సంఘానికి తనకూ వున్న సంబంధం గురించే

రొమాంటిక్ కవుల్ని, జీవిత సత్యాన్ని గణిస్తూ, దాన్ని తమ మనస్సుతో చూసి, సమన్వయ పరచుకొనేవాళ్లుగా కూడ గుర్తించొచ్చు. రొమాంటిసిజం సాధారణంగా రియలిజంకి వ్యతిరేకమైంది. పలాయనవాదంతో కొంత సంబంధం కల్గింది అది మానవునికి అందని ఆకాశం, నక్షత్రాలు, ప్రకృతి విలాసం మొదలైన వాటి గురించే వాళ్ళు కవిత్వం రచించారన్న ఫిర్యాదు వుంది. ఈ ఫిర్యాదుని భారతీయ భాషలన్నిటిలోనూ చూడగలం. పి మ్యూర హెడ్ అన్న తత్వజ్ఞాని "అనంతమైన ప్రకృతిని వెదకటం రొమాంటిసిజం ముఖ్యలక్షణం" అని అన్నాడు

రొమాంటిసిజం సంఘంలో జరుగుతున్న పునరుజ్జీవనాన్ని ప్రతిబింబిస్తూ వుంటుందని మలయాళ విమర్శకులు చెప్తుంటారు. రొమాంటిసిజంని గురించి రాసే కవి సాంఘిక పునరుజ్జీవనం కూడా తెల్సికొని వుండాలి. ఆ మాటకొస్తే ఏ కవి అయినా, సాంఘిక పునరుజ్జీవనం తెల్సికొని, ఆ మార్పుల్ని తన రచనల్లో చొప్పించకపోతే, అది కవిత్వం అయితే కావొచ్చునేమో గాని, అన్ని హంగులూ గల గొప్పకవిత్వం మాత్రం కాజాలదు. వాటి రెంటికీ విడదీయరాని సంబంధం వుంది. విస్మరింప బడ్డ శక్తుల్ని, సంపదని, భావనా పరంగా పునర్దర్శించటం రినైసెన్స్ ముఖ్యలక్షణం.

ఈ విధంగా చిన్న చిన్న భేదాల్తో జీవితాన్ని దర్శించటం రొమాంటిక్ కవులు చేసినప్పటికీ, వాళ్లకీ కొన్ని సామాన్య ధర్మాలున్నాయి. అంతులేని జిజ్ఞాస, అద్భుతం, సౌందర్యతృష్ణ, స్వాతంత్ర్యవాంఛ మొదలైనవి కొన్ని. వాటి శక్తి అజేయం, నిరర్గళం.

కవులు తమ కవితా వస్తువుగా ఎన్నుకొన్న దాన్నిబట్టి సంఘంకి దాని అవసర ప్రాముఖ్యంబట్టి వాళ్ల కవితా ప్రమాణం గుర్తించగలం. రొమాంటిక్ కవుల్ని పరిశీలిస్తే[3] "కొంతమంది మనస్సుతో చూసేవారు, అంటే ఆత్మాశ్రయపరంగా రాసేవాళ్ళు ఇంకొంతమంది పరాశ్రయపరంగా రచించేవాళ్ళు, మరికొంతమంది గత వైభవాన్ని స్మరించేవారు" అక్కడక్కడా కన్పడుతూవుంటారు

ఇలా విభిన్న భావాలుగల రొమాంటిసిజం ఆంగ్లసాహిత్య ప్రభావంవల్ల, దాదాపు భారతీయ భాషలన్నిటిలోనూ తల చూపించింది—ఇరవై శతాబ్ది మొదటి రెండు దశాబ్దుల్లో మలయాళ సాహిత్యంలో రొమాంటిసిజం పుట్టుక—దానికి ఆద్యుడుగా కుమారన్ ఆశాన్ లెక్కింపబడ్డ తీరుని గురించి తెల్పుట, ఈ వ్యాసోద్దేశం

కుమారన్ ఆశాన్, ఉళ్ళూరు ఎస్. పరమేశ్వర అయ్యరు వల్లత్తోళ్ నారాయణమీనన్ మలయాళ సాహిత్య విహాయసంలో తారలై వెల్గినవారు. ఆంగ్లంలో 'రొమాంటిసిజం'గా స్థిరపడ్డ దానికీ, మలయాళంలో 'కాల్పనిక ప్రస్థానం'గా చెప్పుకొంటున్న దానికి సంబంధం వుందనీ, ఆ సంబంధంలో ముడివేయబడ్డవారు ఈ ముగ్గురనీ చెప్పటం సర్వసాధారణమే.

ఈ ముగ్గురిలో ఎవరు ఆద్యులు, ఎవరు రొమాంటిసిజం ప్రభావం కలవారు అంటే, నిస్సంశయంగా ఆశాన్ అనే చెప్పొచ్చు. ఉళ్ళూరు పరమేశ్వర అయ్యరూ, వల్లత్తోళ్ సంకేత బద్ధమైన 'నియోక్లాసికల్' సాహిత్యంని కలసి కట్టుగా తీసుకొనిపోయే ఆ రోజుల్లో, ఆశాన్ బెంగుళూరు, బెంగాల్లో చదివి, ఆంగ్లంలోని ఆధునికత్వంవైపు మొగ్గే మనసు తీరుని, స్వభావంని గ్రహిస్తూ, వాటిని మలయాళంలోకి తీసుకొచ్చాడు ఆంగ్లంలోని కొత్త తరం గాల్పి నిశితంగా పరిశీలించి వాటికి రూపం కల్పించాడు వల్లత్తోళ్ అంటే ఇంగ్లీషు భాషాపరిచయం బొత్తిగా లేనివాడు. అయితే భారతీయ సాంప్రదాయిక కవిత్వంలో అసలు సిసలైన ప్రావీణ్యంకలవాడు.

ఉళ్ళూరికి ఆంగ్లభాషా పరిచయంవున్నా, రొమాంటిక్ కవిత్వ ఛాయలువున్నా, క్లాసికల్ కవులపై, సాహిత్యంపై అభిరుచిని పెంచుకొన్నాడు.[4] రొమాంటిసిజం అనేది మనసుకి సంబంధించింది. జీవితంకి, ప్రకృతిలోని వస్తువులకి సంబంధించి, అందంగా మలచుకొన్న ఒక భావనాశక్తి అని క్రోంచి చెప్పిన వివరణంని తీసుకొంటే, ఉళ్ళూరులో ఈ భావనాశక్తి తర్వాత తర్వాతకూడా గణనీయం అయిన స్థానాన్నే కల్గి వుండిందని చెప్పొచ్చు. ఆశాన్‌లో ఈ భావనాశక్తి బ్రతుకుని అలరిస్తూ, స్వాభావికంగా వుంటుంది. షెల్లీ, కీట్సు, బ్రౌనింగ్‌ల ప్రభావం కుత్తుక బంటిగా కలవాడు కుమారన్ ఆశాన్ అతని రచనల్లో అందాలు మాత్రమేకాదు, ఆవేదనలు కూడా వుంటాయి ''ఆశాన్ రొమాంటిసిజంని యధాతథంగా మలయాళ సాహిత్యంలో ప్రవేశపెట్టారు అంటారు. కాని దాన్ని, ఆ మాటకొస్తే ఏ వుద్యమం అయినా పూర్తిగా అనుకరింప వీలుకాదు. ఆశాన్ కృతుల్లో ఆ అనుకరణ వుండొచ్చు. అయినా అది తనసొంత భావాల్తో తనదైన తనం గల్గి అలరారుతూ వుంటుంది''[5]

రొమాంటిసిజంకి మలయాళ సాహిత్యంలో ఒక సుముహూర్తాన దీపం వెలిగించి, వ్యాప్తికి కారకుడైనవాడుగా కీర్తింపబడ్డ ఈ ఆశాన్ దానికి ఆద్యుడా? అసలు లోతుగా పరిశీలిస్తే కవులంతా రొమాంటిక్ కవులే. వర్షాకాల మేఘాన్ని దర్శించినంత మాత్రాన్నే, గుట్టల కోసం, చెట్టులకోసం వువ్విళ్ళూరిన కాళిదాసు హృదయం, హిమగిరిలో 'అంబర చుంబి శిరస్సర జ్ఝరీ పటలం' ని తనివి తీరా తిలకించిన పెద్దన మది. నదిలో, గిరిలో మానవత్వాన్ని కాంచిన భట్టుమూర్తిడెందం రొమాంటిసిజంగాక మరేమవుతాయి. అంటే ప్రాచీన సాహిత్యంలో రొమాంటిక్ లక్షణాలు వున్నాయనటం చెప్పకోదగ్గ నిజం. అయితే నియో క్లాసికల్ రచనలచేత ఆ లక్షణం అణగదొక్కబడ్డది. అలా అణగదొక్కబడ్డ రొమాంటిసిజంయొక్క పునరుజ్జీవమే పద్దెనిమిదో శతాబ్దం ఆంగ్లంలో, ఇరవయ్యోశతాబ్దం మలయాళం, తెలుగు ఇతర భాషల్లో వచ్చిన రొమాంటిసిజం. దీనికి, 'రొమాంటిక్ రివైవల్' లేక 'కాల్పనిక పునరుజ్జీవం' అన్న పేరు కూడా వాడుకలోకి వచ్చింది.

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభ పరిస్థితి అర్థం చేసుకొంటే గాని, ఆశాన్ అడుగిడటంలోని ప్రత్యేకత కన్పడదు. 1900 వ సంవత్సరం మలయాళ సాహిత్యంలో పెద్ద విశేషం అయింది ఏం కాదు గాని, కుమారన్ ఆశాన్ కలకత్తాలో చదువు ముగించుకొని సొంత రాష్ట్రానికి తిరిగి వచ్చాడు.

మలయాళంలో పేరుబడ్డ పత్రికలన్నీ ఇరవయ్యో శతాబ్ది ముందే ప్రారంభింపబడ్డాయి. 1890లో విద్యావినోదిని, మనోరమ; 1892 లో భాషా పోషిణి; 1893 లో సుజనా నందిని అన్నీ పక్క పక్కనే. జంట కవుల రచనలు, సమస్యా పూరణలు మొదలైన ఎన్నో సాహిత్య ప్రక్రియల్తో అభిరుచిని పెంచుకొని ఈ పత్రికలు ప్రచురింపబడుతూ వుండేవి. 'కవి సమాజం' (1892) లో తమ రచనల్ని చదివి విమర్శించుకొనేవారు — తెలుగు 'కవితాసమితి' లాగా. ఈ పత్రికల్లో పద్యాలూ, ఎక్కువగా శ్లోకాలాంటివి వుండేటివి. అయితే అన్నీ కాల ప్రవాహంలో కొట్టుక పొయ్యాయి. కష్టపడితే రెండో, మూడో గుర్తు చేసుకోవచ్చు. ఏ. ఆర్. రాజ రాజ వర్మగారి 'మలయ విలాసం' (1895), కె. సి. కేశవ పిళ్లగారి 'ఆసన్న మరణ చింతా శతకం' (1895), కుందూర్ గారి [6] 'కోమప్పన్' (1904) — ఇవి కొన్ని.

'మణినాథం'అన్న రచనకి రాసిన అవతారికలో ఏ. బాలకృష్ణ పిళ్ల ఇలా అన్నాడు: 1908 సంవత్సర ప్రాంతంలో వంగ సాహిత్య గాలి దుమార ప్రభావంతో రచింపబడ్డ వి. సి బాలకృష్ణ ఫణికర్ గారి 'విశ్వరూపం', కుమారన్ ఆశాన్‌గారి 'నళిని' బాగా ప్రసిద్ధిని సంపాదించుకొని, మలయాళ సాహిత్యంలో రొమాంటిక్ ప్రస్థానంకి అంకురార్పణ కావించాయి.[7] అయితే వీటి ప్రచురణ కాలం విషయంలో కొంత అభిప్రాయభేదం వుంది. 1913 లో 'విశ్వరూపం' ప్రచురింపబడితే, 1911లో 'నళిని' ప్రచురింపబడ్డది.

ఆశాన్‌ని ప్రభావితం చేసిన వ్యక్తుల్లో రాగూర్, వివేకానందుడు ముఖ్యులు. 'బ్రహ్మసమాజం'లోని మతాన్ని పరిష్కరించే సూచనలు, 'కాయస్థసమాజం'లోని జాతిని బహిష్కరించే విధానాలు ఆశాన్‌ని ఆకర్షించాయి. ఆనాడు స్వదేశీయులు ఎక్కువగా మహమ్మదీయ మతాన్నీ, క్రైస్తవ మతాన్నీ స్వీకరించటం ఆశాన్‌కి నచ్చేది కాదు. అది వారి తెలివి తక్కువతనాన్ని సూచిస్తుందే తప్ప మరేం కాదనేది అతని అభిప్రాయం. బ్రహ్మసమాజం గూర్చి చెపూ్త — [8] బ్రహ్మమతం నవీన జీవితాదర్శాల్కి విరుద్ధం గాకుండా, రాజ రామమోహనరాయ్ లాంటి ప్రపంచ ప్రఖ్యాతవ్యక్తులు స్థాపించిందీ, రవీంద్రనాథ రాగూర్ లాంటి ఋషులవల్ల, ఇండియాలోని అనేక స్త్రీ పురుష రత్నాల త్యాగాలవల్ల నిల్చి, జాతి ప్రస్తావన లేకుండా వ్యాపిస్తూవున్న బ్రహ్మసమాజం మిమ్మల్ని ఆకర్షించలేదా? అని ప్రశ్నించాడు. అంతేగాక జాతి, వర్గ భేదాల్తో కూడుకొన్న ఈ లోకాన్ని చేతులెత్తి నమస్కరించి వదలండి అనికూడా చెప్పాడు.

'బ్రహ్మసమాజం', స్వామి దయానంద స్వామి స్థాపించిన 'ఆర్యసమాజం', బెంగాల్, హిందూస్థానం మొదలైన స్థలాల్లో బహుళప్రచారం పొందుతూ, అనేకుల్ని ఆకర్షిస్తూ వున్నప్పుడే ఆశాన్ కూడా ఆకర్షింపబడ్డాడు. అప్పటినించి సంఘసంస్కర్తల్తో, వివేకానంద, కేశవ చంద్రసేన్, రాగూర్ మొదలైన గొప్ప వ్యక్తుల్తో పరిచయాన్ని పెంపొందించుకొన్నాడు. ఇల్లా ఇలాంటి మహాకవుల్తో, వ్యక్తుల్తో, పరిచయం కల్గి వుండేటప్పుడే, ఆశాన్ సొంత రాష్ట్రానికి తిరిగి వచ్చాడు. అదీ 1900 వ సంవత్సరం. అప్పుడే అతడు 'వంగ దేశీయుడు' అని గౌరవంగా పిలవబడ్డాడు. అతడు ఏడెనిమిది ఏండ్లు కవిత్వాన్ని సంఘ సంస్కారానికే వినియోగించాడు. ఆ కాలంలో రాయబడ్డది ''వీణ పూవు'' (రాలిన పూవు) అన్న గొప్పకావ్యం. అప్పటికి అతని వయసు ముప్పై అయిదేండ్లు. అది అతని మొదటి భావ కావ్యం.

ఆశాన్‌కి ఆంగ్ల భాషా పరిజ్ఞానంతో బాటు సంస్కృతంలో మంచి అభినివేశం వుంది. అతను పద్దెనిమిదేండ్లకే సంస్కృతంలో తలమానికాలుగా వున్న కావ్య నాటక, అలంకారాల్తో పరిచయం సంపాదించుకొన్నాడు. కౌమారంలో శ్రీనారాయణ గురుస్వామిగారి శిష్యరికం సంపాదించాడు. పదహారేండ్లకి పూర్వమే శృంగార కవన కౌతుకం కల్గివున్న ఆశాన్, స్వామి వుపదేశంవల్ల భక్తిరస ప్రధానంగా రాయటం మొదలెట్టాడు. విద్యాభ్యాసం పూర్తి అయిన తర్వాత సొంత వూరు 'కాయిక్కర'వదలి 'అరు విప్పురం'కి నివాసం మార్చి స్వామిగారి శిష్యరికం పొందటం, తర్వాత గురు శిష్య సంబంధం దృఢం కావటం జరిగింది ఆచార్యుని ముఖతః విని, సంస్కృతంలోని అనేక వేదాంత శాస్త్రాలని చదివి, ఆధ్యాత్మిక విషయాల్ని తెల్సికొని, విపుల పరిజ్ఞానం సంపాదించటం ఆశాన్‌కి తర్వాత తర్వాత వుపయోగపడ్డది. గురునాధుని మూలంగా పలు ప్రదేశాలు తిరిగాడు. అది కవుల్కి సహజమైన భావ చాపల్యాల్కి ఇంద్రియ నిగ్రహంకల్గించి, భావనల్ని సమున్నత స్థాయిలో విహరింప చేసేందుకు ప్రేరణ కల్గించింది. శ్రీ నారాయణన్ వుపదేశ, ఆదేశాల్ని అనుసరించి డాక్టరు పి. పల్పుతో కూడి 1895 నించి మూడేండ్లు బెంగుళూరులోని సంస్కృత కళాశాలల్లో, తర్వాత మద్రాసులో, మరి రెండేళ్లు కలకత్తాలోని సంస్కృత కళాశాలల్లో వున్నత విద్యాభ్యాసాన్ని ముగించాడు.

సంస్కృత శాస్త్ర గ్రంథాల్లో అసాధారణ పాండిత్యం, సంస్కృతంలో సునాయాసంగా కావ్య రచన చేయగల నేర్పు కల్గి, తన అభిలాష చేతనే ఆంగ్ల భాషని చదివి, అందులో సాహిత్య గ్రంథాల్ని పఠించి, కైవసం చేసుకొన్న నూతన సంస్కారం అతన్ని దారి మళ్లించింది. విజ్ఞాన సముపార్జనకే తన జీవితం అంతా వినియోగింపబడ్డ ఈ కాలంలోనే 'ప్రబోధ చంద్రోదయం' అన్న నాటకాన్ని, 'సౌందర్య లహరి' అన్న స్తోత్ర గ్రంథాన్ని సంస్కృతం నించి అనువదించాడు.

ఈ విధంగా సంస్కృత భాషా పరిచయం పెంపొందించుకొని, మహా కవుల్తో, వ్యక్తుల్తో పరిచయం సంపాదించుకొని, నారాయణగురు ఆధ్యాత్మిక ప్రబోధనల్ని విని, ఆచరణలో పెట్టి, రవీంద్రనాథ ఠాగూర్ అందే వాసియై, ఆంగ్ల సాహిత్యంలోని రొమాంటిసిజంకి — యధాతథంగా కాకపోయినా — మలయాళ సాహిత్యంలో జ్యోతి వెల్గించిన ఘనుడు కుమారన్ ఆశాన్.

పాత కావ్య వస్తువుల్ని, ఇవి సమయాల్ని పూర్తిగా నిరాకరించటం కాదు, స్వీకరించేది ఏదయినా భావనలో పునః సృష్టించి కొత్త భావ బంధురాలతో, చైతన్య నిర్భరంగా, పుష్కలమైన కొత్త అర్థాల్తో అవతరించింది కాల్పనిక ప్రస్థానం. భావనాలోకం లోని మధురోధాత్తమైన వాటిని ముందు పెట్టటం తన కావ్య శిల్పంగా మలచికొని, తన అవసానకాలం (1924) వరకు, రచించిన భావ కావ్యాలు ఇవి:

వీణ పూవు (1907), సింహ ప్రసవం (1909), నళిని (1910), లీల (1913), శ్రీ బుద్ధచరితం (1915), బాల రామాయణం( 1916), గ్రామ వృక్షత్తిలె కుయిల్ (1918), ప్రరోదనం (1918), చింతా విష్టయాయి సీత (1919), దురవస్థ (1922), చండాల భిక్షుకి (1923), కరుణ (1923).

## చూసిన పుస్తకాలు

1. ఇసజ్జీక్ కృప్పరం — S. గుప్తన్నాయర్.
2. చింతా విష్టయాయి సీత — ఉపోద్ఘాతం.
3. నళిని — ఉపోద్ఘాతం.
4. నళిని ఒరు పఠనం — M. శివదాసన్.

## అథోజ్ఞాపికలు

1. శ్రీ శ్రీ సాహిత్యం. ఒకటి. పుట · 216.
2. The craving of the infinite is the essential quality of Romanticism,
3. "చిలర్ మనం నోక్కిగళ్, మర్రు చిలర్ మానం నోక్కిగళ్, చిలర్ పిన్నోక్కి గళ్ (అంగణె యుంగణె" ఇసజ్జీక్ కృప్పరం : పుట : 28.
4. పై పుస్తకంలో ఉదహరింపబడ్డది.
5. S. గుప్తన్నాయర్.
6. కోమప్పన్ ఒక జానపద నాయకుడు.
7. ఇసజ్జీక్ కృప్పరం
8. పైదే.



# దక్షిణాది ధాన్యాగారం

దేశానికే అన్నపూర్ణగా ప్రసిద్ధిచెందిన ఆంధ్రప్రదేశ్ ఆహార ధాన్యాల విషయంలో మిగులు రాష్ట్రం. మన రాష్ట్రం ధాన్యోత్పత్తిలో దేశం అంతటికీ తలమానికంగా రూపొందింది.

అధిక దిగుబడినిచ్చే వరి వంగడాలను బాగా వినియోగించుకొనేటట్లు చూడడానికి అవిరళ కృషి జరిగింది. తత్ఫలితంగా జయ, సోనా, రత్న, జగన్నాథ్, ఆర్. పి. **193** వంటి విత్తనాలు రైతుల్లో బాగా ప్రచారం పొందాయి.

**1977-78**లో వ్యవసాయోత్పత్తిని ఇతోధికంగా చేయడానికి అనేక చర్యలు తీసుకొన్నారు. ఖరీఫ్, రాబీ వ్యూహాలతోపాటు రైతులకు **24.58** కోట్ల రూపాయల మేరకు స్వల్పకాలిక ఋణాలు విరివిగా పంచిపెట్టారు.

ఆహార రంగంలో అఖిలభారత కీర్తిని సముపార్జించుకొనే విధంగా ఆంధ్రప్రదేశ్ ముందంజవేసింది.

కాయికష్టంతో పంటలు పండించే

కర్షకులు మన గర్వానికి కారకులు

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

1/78–79



**కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు**

# విమర్శిని

కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు విభాగమువారు ప్రకటించిన ఈ 'విమర్శిని సంచిక' యంతయు "విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక" ఆద్యతన యుగమున, ఆంధ్రసాహిత్య ప్రపంచమున, అరువదేండ్లు నిలువెత్తు సారస్వతమూర్తిగా నిలిచిన విశ్వనాథ సత్యనారాయణగారి 'వాఙ్మయ జీవిత విశేషముల'ను దెలుపునదీ సంపుటము. ఇందు **మూడు** భాగములు గలవు.

1. ఆత్మచిత్రం.
2. వాఙ్మయ చిత్రం
3. జీవిత చిత్రం.

పై విభాగములలో మొదటిదానియందు 10 శీర్షికలు—రెండవ భాగమున 18 శీర్షికలు—మూడవ భాగమున 17 శీర్షికలు గలవు. ఇందు మొదటి భాగమున పది శీర్షికలలో **మూడు** ఆంగ్ల భాషలో నున్నవి. ఇవి ఇందు 64 పుటలలో నున్నవి. రెండవ భాగమున డైరీలలో ఆంగ్ల వాక్యములున్నవి ఈ ఆంగ్ల భాషారచన లన్నియు శ్రీ సత్యనారాయణగారివే.

## ఆత్మచిత్రం

ఇందు 1. నా తొలిరచన 2. నా గొప్ప రచన 3 నేను నా రచన 4. వేయి పడగలలోని అంతరార్థము 5. ఆత్మకథలో ప్రథమాధ్యాయము 6. నేనూ నా రచనా స్వరూపము 7. పల్లెల శోభ తెలియని వారికి నా కావ్యసంపద అర్థముకాదు- అను శీర్షిక లన్నియు విశ్వనాథవారి రచనలే. ఇందు—'ఆత్మకథ' అనునది ముఖ్యమైనది వారు తమ 'స్వకీయ చరిత్ర'ను రచించుటకు పూనుకొని నట్లున్నది. కాని పూర్తిచేసినట్లు లేదు.

## వాఙ్మయ చిత్రం

ఇందు రెండు విభాగములున్నవి. 1. ఉత్తరములు—డైరీలు, 2. అముద్రిత రచనలు. ఇందు ఉత్తరములు—డైరీలు 120 పుట లున్నవి. ఇవి యన్నియు విశ్వనాథ వాఙ్మయ జీవితమునకు సంబంధించినవిగావు. అవి ఆయన స్వంత ఖర్చులు తెలిపెడి. ఉత్తరములు—డైరీలు. వీనివలన తెలిసినదొక ముఖ్యాంశము గలదు. అది విశ్వనాథ చేసిన జపముల వివరణ.

## జీవిత చిత్రం

విశ్వనాథవారినిగూర్చి ఆయన సమకాలికులైన 17 మంది వ్రాసినవి ఈ విభాగమున గలవు. ఈ సమకాలికులలో విశ్వనాథ గురువులైన ఒక్క చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తప్ప తక్కిన వారందఱూ నవ్యసాహిత్యమునకు సంబంధించిన రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, పింగళి కాటూరి కవులు, అభ్యుదయ కవితాచార్యులైన శ్రీ శ్రీ మొదలగువారు. కురుగంటి సీతారామభట్టాచార్యులు — గిడుగు సీతాపతి వంటి నవ్యాంధ్ర సాహిత్య చరిత్రకారు లిందున్నారు. ఇంకను అడవి బాపిరాజు, చింతా దీక్షితులు గలరు. విశ్వనాథవారి ప్రియశిష్యుడైన జలసూత్రము రుక్మిణీనాథశాస్త్రి తన గురువును గూర్చి వ్రాసినదీ సంపుటమునకు విలువను గూర్చుచున్నది. రష్యను రచయిత పెత్రునిచేవా ఆంగ్లమున వ్రాసినదానికి ఆంధ్ర పరివర్తన మిందున్నది.

విశ్వనాథసాహిత్యముతోగాక సాంఘికముగా సంబంధించినవి రెండిందున్నవి. ఒకటి— నేనూ మా అన్నగారు అని విశ్వనాథవారి సోదరులూ, వేంకటేశ్వరులుగారూ వ్రాసినది రెండవది విశ్వనాథ వారి ఆప్త స్నేహితులగు కొడాలి ఆంజనేయులుగారు వ్రాసినది.

ఈ జీవితచిత్రమున- నవ్యకవులుగా ప్రసిద్ధిజెంది, విశ్వనాథ వారి అనుయాయులైన కవుల ప్రశంసలేయున్నవి కాని ప్రాచీన సాహిత్యసంప్రదాయానుసారులైన కవుల, ప్రాచ్య సాహిత్య నిష్ణాతులైన విమర్శకుల ప్రశంసలు లేనేలేవు. విశ్వనాథవంటి మహాసాహితీవ్యక్తి ప్రత్యేకవ్యక్తిత్వము ప్రదర్శించునపుడది అన్ని దృక్కోణములనుండి ప్రసరింపవలెను. ఇందు నవ్యసాహిత్యమునకు సంబంధించినవే యుండుటచేత నీ చిత్రమ సమగ్రమని చెప్పవలసివచ్చుచున్నది. ఇంకొక విశేషము. నవ్యసాహిత్యమునందైన సాహితీ సమితి సభాధిపతియై, అనేకమంది నవ్యకవులను దిద్దితీర్చినతల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి ప్రసక్తియిందు లేకుండుటచిత్రముగా నున్నది. ప్రాచ్యసాహిత్యమున, గీతాధికగ్రంథకర్తయై కవిసార్వభౌముడైన శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రి. విద్వత్కవి వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, విమర్శకాగ్రేసర దీపాల పిచ్చయ్యశాస్త్రి, ప్రసిద్ధ

[ విమర్శిని. విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక. కాకతీయ విశ్వవిద్యాలయము. ఒరంగల్లు. వార్షిక పరిశోధన పత్రిక—1977. సంపాదకుడు : డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రి. ఉపసంపాదకుడు : డాక్టరు సుప్రసన్న— పుటలు 427. డెమ్మీ—వెల : సాధారణ ప్రతి 15–00. బవుండు ప్రతి 25–00. ]

సాహిత్యవిమర్శకుడని పేరెక్కిన— రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ— వీరి ప్రసక్తియే యీ సంపుటమున గానరాదు వీరందఱూ విశ్వనాథ సమకాలికులే దీనినిబట్టి సాహిత్యప్రపంచమున ఒక ప్రాచీన సంప్రదాయమువారు విశ్వనాథవారి రచనలనుగూర్చి ఎరుగరని వ్యక్తమగుచున్నది.

## రామాయణ కల్పవృక్ష ఖండనము -

ఇది విశ్వనాథవారి 'రామాయణకల్పవృక్షము' పై విమర్శనము. శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి వ్రాసినది. ఇది పెద్ద గ్రంథమే ఇందుమూల సంస్కృత వాల్మీకి రామాయణమునను సరించి విశ్వనాథవారి రచన తీవ్రవిమర్శనకు గురియైనది ఇది ముద్రితమై వ్యాప్తిలోనున్నది కాబట్టి దీనికి ప్రతివిమర్శన ప్రకటించు 'ధ్యత ప్రస్తుతసంచికా సంపాదకులపై నున్నది

విశ్వనాథవారినిగూర్చి ప్రప్రథముగా వ్రాసినకీర్తి— ఆంధ్ర పత్రికాధ్యక్షులైన శ్రీ శివ లెంక శంభుప్రసాదుగారిది వారు ''తెలుగు వెలుగులు''— అను శీర్షిక క్రింద తెలుగు దేశములోని— సాహిత్యకళాకారుల, జీవితచిత్రణములను 1961లో రేఖా చిత్రములతో ప్రకటించినారు. అందు, విశ్వనాథవారిదే మొదటిది.

ఇట్లే, ''మఱపురాని మనీషి'' అను గ్రంథములో విశ్వనాథ వారినిగూర్చి గలదు.

కేంద్ర సాహిత్య అకాడమీవారు ప్రకటించిన— "History of Telugu Life nature" అను గ్రంథమున— విశ్వనాథ వారిని గూర్చి విపులముగా గలదు.

విశ్వనాథవారినిగూర్చి, సమకాలికులందఱునేమి వ్రాసిరో అవియన్నియు సేకరించి, వానిలో నొకదానినైనా విడిచిపెట్టకుండ ప్రకటింపవలయునన్న సంకల్పము గల వారగుటచే గాబోలు సంపాదకులు ఇందు తాము సేకరించిన వానినన్నింటిని ప్రకటించి యున్నారు. కాని ఏ కారణము చేతనో శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు— ''ఆంధ్ర రచయితలు'' అను గ్రంథమున విశ్వనాథవారిని గూర్చి వ్రాసినది యిందు లేదు ఇందు 12పుటలు గలవు

భాష విషయమున సంపాదకులు శ్రద్ధవహింప లేదు.

''ఆత్మచిత్రం, వాఙ్మయచిత్రం, జీవితచిత్రం''

అని యిట్లు శీర్షికలు నిండు సున్నతో నున్నవి. తెలుగు భాషలో పదాంతమున నిండుసున్న యెంతమాత్రము నిలువదు. అవి

''ఆత్మచిత్రము, వాఙ్మయచిత్రము. జీవితచిత్రము''

అని ముకారాంతములుగానే యుండవలెను.

నిండుసున్నలంతమందుండుట ఈ గ్రంథమునకు కళంకము తెచ్చుచున్నది

## అ ము ద్రి త ర చ న లు

ఇది యీ సంపుటమున చాలాముఖ్యమైనది. విశ్వనాథ రచనలలోనేదియు నముద్రితముగా నుండదని వాడుక. ఆయన ''నేను— నా రచన అన్న శీర్షికలో నీ విషయము తెలిసినాను—(పుట 15) అట్టి సందర్భమున విశ్వనాథ వారి అముద్రితరచనలనగానే మనకాశ్చర్యము గలిగించును కాని యీ సంపుటమున వానికి తగిన ప్రాముఖ్య మీయబడలేదు ఇంత గ్రంథములోను 26 పుటలు మాత్రమే అముద్రితరచనలకై వినియోగింపబడినవి. ఇందలి రేఖా మాత్రముగా తెలుపబడినవి. విశ్వనాథ రచనలలో సంస్కృతము, తెలుగు రెండును గలవు. వానిని విడమర్చి యిందు చూపుట జరుగలేదు. పాఠకలోకము పయోగించునని వానిని వివరించుచున్నాను.

## అముద్రిత పద్యకృతులు (తెలుగు)

1. నారాముడు—
2. పిల్లల రామాయణము
3. ఇంద్రధనుస్సు
4. విశ్వనాథమధ్యాక్కరలు
5. మంగళాద్రి స్వామిమేల్కొలుపు.

నాటకములు

6. రామనాటకము
7. యక్షుడి అప్పు—[నాటిక]

నవల

8. నందిగామ రాజ్యము—

## సం స్కృ త ము

1. శ్రీ శారదా చంద్రమౌళీశ్వర సుప్రభాతమ్ 102 శ్లోకములు
2. శివసహస్రమ్. నాలుగు శతకములున్నవి
3. దేవీత్రిశవి 300 శ్లోకములు.

'జీవిత చిత్రం'లో సంపాదకులు 120 పుటలు వినియోగించినారు. అందు విశ్వనాథ వారిని గూర్చి యితరులు వ్రాసినవియే యని ముందు నిరూపించి యుంటిని. అందుముకొన్ని విడువబడినవి చూపితిని. ఈనాడు మనకు కావలసినది. విశ్వనాథ రచనలుగాని విశ్వనాథను గూర్చి యితరు లేమివ్రాసినది యనునదికాదు. దాని వలన నే ప్రయోజనము లేదు. అముద్రిత రచనల వలన విశ్వనాథ విశ్వతోముఖ ప్రజ్ఞ వెల్లడియగుటయేగాక, అది నవ్యాంధ్ర సాహిత్య చరిత్రకు నుపయోగపడును.

సంపాదకులు ఈ 'జీవిత చిత్ర శీర్షిక'లో ముఖ్యమైనవి ఒకటిరెండుంచి, తక్కిన పుటలు 'అముద్రిత రచనల ముద్రణకై వినియోగించిన సమంజసముగానుండెడిది.

## గ్రంథము

1. ఆత్మచిత్రము
2. అముద్రిత రచనలు

అని రెండు భాగములుగా నుండిననిదియొంతయు ప్రయోజనకారియై పేరును సార్థకము చేసికొని యుండెడిది. ద్వితీయ ముద్రణమున సంపాదకులట్లు చేయుదురుగాక.

ఈ విశ్వనాథ వాఙ్మయ విశేష సంచిక యందు వారిని గూర్చిన విషయములు కొన్ని విస్మరింపబడుట వింతగ నున్నది. వాని నుదాహరించు చున్నాను—

## పాషాణ పాక ప్రభువు

లాక్షణికులు, ఆలంకారికులు చెప్పిన ద్రాక్షాపాకము, కదళీపాకము, నారికేళపాకము అను మూడు విధములైన పాకములు గాకుండ— ''మురారేస్తృతీయ పంథా'' అను రీతిని విశ్వనాథవారు నాలుగవ పాకము సృష్టించిరి. పాషాణ పాకమును వారి కవితా పాకమిదేయని నిరూపించుటకు వారి ముఖ్య శిష్యుడు, అనుయాయులలో నొకడైన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి వ్రాసిన కృతియే నిదర్శనము. ఆతడు ''పాషాణ పాక ప్రభూ'' అను మకుటముతో తన గురువున కంకితముగా నొక శతకము రచించినాడు. ఆ శతకము నుండి యొక పద్యము మాత్రము వ్యాప్తిలో నున్నది.

> ''కించిత్తిక్త కషాయ షాడబరస క్షేపాతిరేపాతి వా
> క్సంచార ప్రచయావకాశములలో కవ్యుద్ఘ గండాశ్మముల్
> చంచ ల్లీలల తల్లక్రిందులును గా సాధించి వేధింతు వా
> పంచారించి నీ ప్రహేళికలతో పాషాణపాక ప్రభూ.''

వారి పద్య కృతులలో మేటియైన రామాయణ మీ పాషాణ పాకమున నుండుటచే నది వ్యాప్తిగాంచలేదని కొందరు విమర్శకుల యభిప్రాయము.

## విశ్వనాథ వారితో నా పరిచయము

శ్రీ విశ్వనాథవారు క్రీ. శ 1940లో గోపాలరెడ్డిగారి వివాహమునకు ''గోపాలోదాహరణము వ్రాసిరి దానిని వారు ముద్రించి శివశంకరశాస్త్రిగారికి అభిప్రాయార్థమై పంపిరి. వారును గోపాలోదాహరణమును చూచి, ఇందు కందపద్యమున్నదని—ఉదాహరణములో కందపద్యములుండవని అంతేగాక పెక్కుచోట్ల లక్షణముతప్పినదని; ఉదాహరణము సరిగా లేదని యభిప్రాయమిచ్చిరి. ఆపైని సత్యనారాయణగారు, తమకప్పటికి యీ ఉదాహరణము వ్రాయుటకు లక్షణముగల గ్రంథము లభింపలేదనియు — తాను క్రొత్తగా నీ ప్రక్రియను ప్రారంభించితినని వ్రాసినారు

ఆ సందర్భమున శివశంకరశాస్త్రిగారు, నా త్రిపురాంతకోదాహరణము ప్రతిని విశ్వనాథ వారికి పంపిరి. విశ్వనాథ వారు నన్నెరుగుట ఇదే మొదలు.

## పరిశోధనా పరమేశ్వరుడు

క్రీ. శ 1950లో నేను ఉదాహరణ వాఙ్మయ చరిత్రను ప్రకటించితిని. అందు విశ్వనాథవారి — గోపాలోదాహరణమును పేర్కొంటిని. ఆ గ్రంథమును విశ్వనాథవారికి అభిప్రాయము కొఱకు పంపితిని వారు గ్రంథము నామూలాగ్రముగా పరిశీలించి నాకు ''పరిశోధనా పరమేశ్వరుడు'' అని బిరుదము నిచ్చి లేఖాముఖమున దానిని తెలియజేసినారు కాని నేను విశ్వవిద్యాలయమున నుద్యోగమున నుండుటచేత, దానిని వాడుకొనుట కవకాశము లేకపోయినది. నాకు వారు బిరుదము నిచ్చుటయే కాదు దానిని ప్రచారములోనికి తెచ్చిన వారు వారే. వారు నేను దీనిని గ్రంథస్థము చేయలేదని విచారించినారట. నేను 'శబ్ద రత్నాకరము'ను అనుబంధములో చేర్చి ప్రకటించినపుడు దీని నుపయోగించినాను. దానిని చూచి, విశ్వనాథ వారాశ్చర్య చకితులై, తను మాటను సార్థకము చేసి నందులకు చాల సంతోషించినారట ఇదియే మా ప్రథమ పరిచయము. అదియు లేఖా మూలముననె. ముఖాముఖీని కాదు ఈ బిరుద ప్రధాన మూలమున విశ్వనాథవారి నెల్లప్పుడు కృతజ్ఞతతో స్మరియించుచునే యుందును.

## ఆంధ్ర క్రియా మణి దీపిక (ధాతు నిఘంటువు)

విశ్వనాథవారి రచనగానిది ప్రకటితమైనను దీని వెనుక చరిత్రకలదు. దానిని వివరించిన పై గ్రంథము విశ్వనాథవారి స్వంత రచనగాదని తెలియగలరు. దాని మొదటి పేరు ధాతునిఘంటువు.

## ధాతునిఘంటువు

ఇప్పటికి పదునారేండ్ల క్రిందట— అనగా 1962లో విశ్వనాథవారు తెలుగున ధాతునిఘంటు (క్రియాపదములు) నొకటి తయారుచేసి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికి అందజేసిరి. అకాడమీవారు దానిని కార్యనిర్వాహకవర్గము వారియెదుట పెట్టగా, ఆ కార్యనిర్వాహకవర్గమువారీ గ్రంథము ఆ మూలాగ్రముగా సంస్కరింప బడవలెననియు, నిది వారు వ్రాసిన ప్రకారము ముద్రించుట కెంతమాత్రము వీలులేదనియు, తీర్మానించిరి. అంతేకాక, దీనిని సరిచూచి, ముద్రణ ప్రతిని సిద్ధము చేయుటకు నిడుదవోలు వేంకటరావు మాత్రమే సమర్థుడని ఆయనకుకూడ యీ గ్రంథ రచనమున స్థానము నుండవలెనని తీర్మానించిరి.

ఆనాడు నేను మదరాసు విశ్వవిద్యాలయము ఆంధ్ర భాషా శాఖాధ్యక్షుడనుగా నుండెడి వాడను. నాకీ సంగతి అకాడమీవారు తెలిపిన తరువాత నేను పదునైదు దినములు సెలవుపెట్టి హైదరాబాదు వచ్చితిని. నేను, శ్రీ సత్యనారాయణగారు గ్రంథమును చూచుకొనుటకు ప్రారంభించితిమి ఇదియే వారికి నాకు ప్రత్యక్ష పరిచయము

గ్రంథ పరిశీలన నేను, సత్యనారాయణగారును కలసి మొదలు పెట్టితిమి. కాని మొదటినుండియు నాకు అది సంస్కారార్హముగా నున్నట్లు తోచినది. మేమిరువురము కలసి రూపమును, అర్థము చర్చించెడువారము. మాకు సహాయముగా, కావలసిన గ్రంథములను వెంటనే చూచుటకు, అర్థభేదములు తెలుపుటకు శ్రీమతి యశోదా రెడ్డిగారును, మరుపూరి కోదండ రామరెడ్డిగారును తోడ్పడిరి.

ఇది సత్యనారాయణగారి ప్రతిభ కనుగుణమైనది కాదు. అయినను పూనుకొన్నారు. అందువలన నేను నెల దినములు చూచిన తరువాత వారు ప్రస్తుతమున్న రీతిని ముద్రించుటకు వీలులేనందున గ్రంథము నామూలాగ్రముగ సంశోధించి, ముద్రణ ప్రతిని తయారుచేసి పంపమని చెప్పిరి. కార్యదర్శియగు రామానుజరావు గారు నాకు వారి వ్రాత ప్రతిని వప్పజెప్పి ముద్రణ ప్రతిని త్వరలో పంపమని ఆదేశించిరి.

వారి ఆదేశానుసారముగా నేనీ గ్రంథమును మదరాసు గొనిపోయి ఇరువురి లేఖకులను నియమించి నేను పూర్తిగా తిరుగవ్రాసి క్రొత్త క్రియాపదములు చేర్చి మరియొక రెండు నెలలలో పంపుదునని తెలిపితిని. కాని విశ్వనాథవారంగీకరింపలేదు. వెంటనే గ్రంథము ముద్రణ కావలెనన్నారు. అందుచేత నేను ఎప్పటికప్పుడు వ్రాయించి వారికి పంపుచుండెడివాడను. వారును అవి తమ కందినట్లు వ్రాసెడివారు.

తరువాత మూడు నెలలవరకు నాకీ గ్రంథము విషయమై ఏమియు తెలియలేదు ఇట్లుండగా నాలుగవ నెలలో అకాడమీవారు ''ఆంధ్రక్రియామణి దీపిక'' అనుపేర పై గ్రంథమును ప్రకటించి నాకు పంపినారు. దానిని చూచి నేనాశ్చర్యపడినాను. గ్రంథము, మీ యిరువురి పేరులతోను ప్రకటింపబడునని తలంచితిని. విశ్వనాథ వారే, మేము దీనిని పరిశీలించుటకుముందు ఇది మా యిరువురి పేరులతోను ప్రకటింపబడునని తెలిపినారు. అయినను తీరా గ్రంథము ముద్రితమైన తరువాత నా పేరులేదు. కారణము నూహింపలేక అకాడమీవారికి ''ధాతునిఘంటువు'' అను పేరుమార్చి ''ఆంధ్రక్రియామణి దీపిక'' అని ప్రకటించుటకు హేతువేమియని వ్రాసితిని. వారును తరువాత కార్య నిర్వాహక వర్గము వారట్లు తీర్మానించిరని వ్రాసినారు

## ఆంధ్రపత్రిక - భారతి - విశ్వనాథవారు

'భారతి' సంపాదకులైన శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు బందరు జాతీయ కళాశాలలో విశ్వనాథవారి శిష్యులు. ఈ సంగతి విశ్వనాథవారే యిట్లు చెప్పినారు :

"By that time my Veyi padagalu was published in the fore most Telugu daily in the Telugu Country. The Editor was a student of mine- (పుట 68)

విశ్వనాథవారి నవలలు తొలుత వ్యాప్తికి తెచ్చినది ఆంధ్ర పత్రిక వేయిపడగలు, వీరవల్లడు, చెలియలికట్ట, బద్దన్న సేనాని, యివి యన్నియు తొలుత ధారావాహికగా ఆంధ్రపత్రిక సారస్వతానుబంధమున ప్రకటితమై పాఠక లోకము ఆదరాభిమానములను చూరగొన్నవి. ఈ విషయమును విశ్వనాథవారే (పుట 68లో) చెప్పినారు.

## భారతి

విశ్వనాథవారి నవలా రచనమే గాక వారి కవితా రచనయు, వారి సాహిత్య విమర్శనలను విశేషముగా ప్రకటించి, లోకమునకు వెల్లడించినది 'భారతి'. 'భారతి'యందే వారి నవలలో ప్రసిద్ధినందిన 'ఏకవీర' ధారావాహికగా ప్రచురమైనది. వారి—మాస్వామి, ప్రాతస్తవము, కేదార గౌళ, విశ్వనాథ మధ్యాక్కరలు మున్నగు పద్యరచన లన్నియు 'భారతి' మూలమువనే పాఠకులకు పరిచితములైనవి.

వారి సాహిత్య విమర్శనాత్మక రచనలలో తొలిదైన ''నన్నయ ప్రసన్న కథా కవితార్థ యుక్తి'' భారతియందే ధారావాహికగా ప్రకటితమైనది. తరువాత వారు ప్రత్యేక గ్రంథముగా వెలువరించినారు. వారి నవ్యసాహిత్య పరిషత్తు అధ్యక్షోపన్యాసము (1940) 'భారతి'యే ప్రకటించినది.

వేయేల, విశ్వనాథవారి ప్రతిభా విశేషములను లోకమున వెల్లడించుటలో భారతియే యేకైకముగా ప్రథమ గణ్యమని చెప్పవలెను. కాని రామాయణ కల్పవృక్షముపై, కొత్త సత్యనారాయణ చౌదరిగారి విమర్శక వ్యాసములు ప్రకటింపబడిననాటినుండియు విశ్వనాథవారికి 'భారతి'యందు వైమనస్యమేర్పడినది. ఈ సందర్భమున 'భారతి' సంపాదకులగు శంభుప్రసాదుగారు పత్రికా సంపాదక ధర్మము ననుసరించి, విశ్వనాథవారిపైని వ్రాసిన విమర్శనలు ప్రకటించినారు కాని విశ్వనాథవారికీ దృష్టి పొడకట్టలేదు. విశ్వనాథవారు వాస్తవముగా తమ గ్రంథముపై విమర్శ ప్రకటింపబడినప్పుడు వారు 'భారతి'యందే ప్రతి విమర్శన ప్రకటింపవలసి యుండెను. వారట్లు చేయక పోవుటయేగాక, పత్రికా సంపాదకులైన శంభుప్రసాదుగారంతవరకు వారి రచనలను వ్యాప్తము చేసిన విధానము నంతయు పూర్తిగా విస్మరించి ''భారతిస్థాయి పడిపోయినది'' అని ప్రచారము చేయ మొదలిడిరి.

'భారతి' సంపాదకులు తమశిష్యులుకాబట్టి తమపై విమర్శనలు ప్రకటింపకూడదని విశ్వనాథవారి అభిప్రాయము. శంభుప్రసాదుగారు, ఈషన్మాత్రము చలింపలేదు.

"భారతి సంపాదకులైన శంభుప్రసాదు మీవద్ద చదువుకొని యుండవచ్చును" కాని 'భారతి' మీవద్ద చదువుకొన్నదా? మీరు మీ గ్రంధముపై వచ్చిన విమర్శకు ప్రతి విమర్శన వ్రాసి పంపుడు. ఎన్ని పుటలైనను ప్రకటించెదను. అట్లు చేయుట నా విధ్యుక్త ధర్మము." అని వారికి తెలియపరచినారు.

కాని విశ్వనాధవారు 'భారతి' విమర్శనకు ప్రతి విమర్శన వ్రాయనేలేదు అందుచేత క్రొత్తవారి "రామాయణ కల్ప వృక్ష ఖండన"యే నిలిచినది.

నాటి నుండియు, విశ్వనాధవారికి 'భారతి'కి సంబంధము తెగిన దనియే చెప్పవచ్చును. ఇట్టి సంఘటన జరిగినను శంభు పసాదు గారు తమ జీవితాంతము వఱకును సత్యనారాయణగారిని మిక్కిలి గౌరవముతో చూచెడివారు.

విశ్వనాధవారి ప్రతిభా వ్యుత్పత్తులను లోకమునకు వెల్లడించుటకు సంపాదకులు చేయుచున్న ప్రయత్నములు ప్రశంసనీయములు. ఈ సందర్భమున నీ క్రింది సూచనలనిచ్చుచు నీ సమీక్ష ముగించుచున్నాను.

1) విశ్వనాధవారిని గూర్చి వారి సాహిత్య జీవిత చరిత్ర తెలుగులో ప్రకటించుట. ఇందు వారి వ్యక్తిగత జీవితముతోబాటు సాహిత్య జీవితము కూడ సమానస్థాయిలో నుండుట మేలు.

విశ్వనాధవారిని గూర్చి ఇంగ్లీషు భాషలో నొక గ్రంధము అత్యావశ్యకముగా ప్రకటింపవలెను. అట్లయిన రాష్ట్రేతరులు, పాశ్చాత్యులు వారి ప్రతిభ గ్రహింపగలరు.

విశ్వనాధవారి సంస్కృత రచనలు తెలుగు లిపితో గాక దేవ నాగరి లిపితో ప్రకటించిన యావద్భారత వర్షమునకు వారి సంస్కృత కవితా పాండిత్యము తెలియగలదు.

---

# అమృతం తెచ్చాను రండి

## శ్రీ ఎస్. మునిసుందరం

నేను
జనం మధ్య పుట్టిన సగటు జీవిని
జన హృదయాలు మథించి
హాలాహలాన్ని నేను త్రాగి
మీ కోసం అమృతం తెచ్చాను.

విరులనుండి, నిర్ఝురులనుండి
గిరులనుండి, మరుత్తరంగిణులనుండి
సమతా సుగంధాలు సేకరించి
ఈ అమృతంలో కలిపాను.

ఆ మురికిగూళ్ళు విడిచిరండి
ఎత్తయిన భవనాలు వదలిరండి
వాహనాల జోలికి పోకండి
నిర్ వాహకులూ, వేగిరం రండి

శీతల తరుచ్ఛాయల క్రింద
పచ్చిక పరుపులపై కూర్చోండి
వర్గాల జోలికి పోకండి
వర్గీకరణలు చేయకండి
అన్ని దిక్కులగాలి వీస్తుంది ఇక్కడ.

అందరూ ఒక పంక్తినే
ఆడుతూ పాడుతూ కూర్చోండి

మోహిని మోసం లేదిక్కడ
మమతకు మరకలు లేవిక్కడ
వెలుగులానిండి వెన్నెల పంచుతాను
అదురు బెదురూలేక హాయిగ సేవించండి.

నా అమృతం మానవత్వం
మీ హృదయం నా ఆవాసం.

డాక్టర్ బి. ఆర్. కె. రావు

# నోబుల్ బహుమతి గ్రహీత
# జె. ఆర్. హిక్స్ ఆర్థిక ఆలోచన

సర్ జాన్ హిక్స్ 1904లో జన్మించాడు. అర్థశాస్త్రానికి ఎనలేని సేవచేసిన ఇతడు విద్యాభ్యాసం పూర్తికాగానే ''లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ పొలిటికల్ సైన్స్''లో లెక్చరర్‌గా చేరాడు తదుపరి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ఫెలోగాను, అటు పిమ్మట మాంచెస్టర్ విశ్వవిద్యాలయంలో ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గాను పనిచేసారు. ప్రస్తుతం ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో 'డ్రమ్మండ్ ఛైర్ ఇన్ పొలిటికల్ ఎకానమీ'ని స్వీకరించి ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. 1974లో 'నోబుల్ బహుమతి'ని అందుకున్నారు. ఇందుమూలంగా ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి ఆర్థిక శాస్త్ర బోధనా పరిశోధనలలో చాలగొప్ప విద్యాసంస్థ అనే పేరు దక్కింది. ఆయన వ్రాసిన 'వాల్యూ అండ్ కేపిటల్' అర్థశాస్త్రంలో ఉత్తమగ్రంథాల్లో ఒకటి. వాల్‌రస్ వ్రాసిన 'ఎలిమెంట్స్ ఆఫ్ ప్యూర్ ఎకనామిక్స్', పారెటో వ్రాసిన 'కోర్స్'లతో సమానమైనదిగా, ఈ గ్రంథం, భావించబడుతోంది. హిక్స్ ప్రధానంగా జెనరల్ ఈక్విలిబ్రియం (సాధారణ సమతౌల్యం) అర్థిక శాస్త్రవేత్తగా భావించబడుతున్నారు. ఈయన తనరచనల్లో గణిత ఫార్ములాలను, సమీకరణలను హెచ్చుగా ఉపయోగించిన కారణంగా గణితంతో సంబంధంలేని మేధావికి, వీరువ్రాసిన అర్థ జ్ఞానము గ్రాహ్యం కాకుండాపోయింది. ఆయన వ్రాసిన ముఖ్య గ్రంథాలు : (1) థీరీ ఆఫ్ వేజెస్ (1932). (2) వేల్యూ అండ్ కేపిటల్ (1939); (3) టాక్సేషన్ ఆఫ్ వార్‌వెల్త్ (1941) (4) స్టాండర్డ్స్ ఆఫ్ లోకల్ ఎక్స్‌పెండిచర్ (1943): (5) ఇంసిడెన్స్ ఆఫ్ లోకల్ రేట్స్ (1945) (6) ఎ కాంట్రిబ్యూషన్ టు ది థీరీ ఆఫ్ ట్రేడ్ సైకిలు (1950): (7) ఎ రివిజన్ డిమాండ్ థీరీ (1956): (8) ఎస్సేస్ ఇన్ వరల్డు ఎకనామిక్స్ (1959)

## అర్థశాస్త్ర నిర్వచనము :

మానవశాస్త్రంలో అర్థశాస్త్రం భాగమనే విషయం నిర్వివాదాంశం. ''వాణిజ్య వ్యవహార విషయాలను వివరించే శాస్త్రం'' అర్థశాస్త్రం అని ''ది సోషల్ ఫ్రేమ్ వర్క్'' అనే పుస్తకంలో హిక్స్ వ్రాసారు. మానవప్రవృత్తిని అధ్యయనం చేయడానికి ఇతర మానవశాస్త్రాలకంటె ఉన్నతమైన శాస్త్రీయపద్ధతుల్ని అనువర్తింపజేసినందువల్ల మానవశాస్త్రాల్లో అర్థశాస్త్రం మెరుగైనది. అర్థశాస్త్రం యదార్థాలను అధ్యయనం చేస్తుంది కాబట్టి, ఈ యదార్థాలను తగినట్లుగా కూర్చుచెయ్యాలి; లేకపోతే ఆ యదార్థాల వల్ల ప్రయోజనం ఉండదు అని 'ది సోషలు ఫ్రేమ్ వర్క్' (పే. 3)లో వ్రాసాడు.

## జనాభా :

అధికజనాభా సమస్య హిక్స్‌ను బాధపెట్టలేదు. ''పారిశ్రామికీకరణద్వారా ప్రత్యేకప్రాంతాల అధికజనాభా సమస్యను తేలికగా పరిష్కరించవచ్చు'' అని 'ది సోషలు ఫ్రేమ్ వర్క్' (పే. 55)లో వ్రాసాడు. ఇందుకు ఇంగ్లండును తార్కాణంగా చూపించాడు. పెరుగుతూన్న జనాభాకు అవసరమైన ఆహారవస్త్రాలను సరఫరా చేసేందుకు జనాభా పెరుగుతూన్నప్పుడే వాటిని హెచ్చుగా ఉత్పత్తి చెయ్యాలని, భూమికొరతవల్ల వ్యవసాయోత్పాదనను పెంచడానికి వీలు లేనట్లయితే పారిశ్రామికోత్పాదనను పెంచాలని హిక్స్ చెప్పాడు.

## పనికి తగినట్లు మనిషి :

శ్రామికబలగాన్ని సమర్థవంతంగా ఉపయోగించుకోవడానికి తోడ్పడే విధంగా సమాజానికి చెందిన ఆర్థికవ్యవస్థను సంఘటితపర్చాలి. ప్రత్యేక అభిరుచితోకూడిన ప్రత్యేక కార్యనిర్వాహణ నైపుణ్యాలుగల వ్యక్తుల్ని వారి నైపుణ్యాలకనుకూలమైన పనులలో నియోగించి, వారి సామర్థ్యాన్ని గరిష్ట ఫలితాలు పొందడానికి వీలుగా ఉపయోగించుకోవాలి అని 'సోషల్ ఫ్రేమ్ వర్క్' (పే. 59)లో హిక్స్ వ్రాసాడు. అందువల్ల శ్రామికబలగాన్ని, సమాజప్రయోజనాలకు అనుగుణ్యంగా వివిధవృత్తులమధ్యపంచడం జరగాలిగాని, ఉత్పత్తిదారుల 'మోజును' బట్టి ఆ పని జరగరాదని అర్థమౌతోంది. బలవంతంచేసే పద్ధతికంటె, ప్రోత్సాహంద్వారా జరిగే పద్ధతి మంచిదేఅయినప్పటికి తగినట్లుగాఎంపికచేసే వ్యవస్థ ద్వారా జరిగినట్లయితే బలవంతంచేసే పద్ధతే ప్రోత్సాహం ద్వారా జరిగే పద్ధతికంటె మంచి ఫలితాలనిస్తుందని హిక్స్ ''సోషల్ ఫ్రేమ్ వర్క్''. (పే. 61)లో వ్రాసారు.

## వినియోగదారు డిమాండ్ సూత్రము :

మార్షల్‌క్షీణ వినియోగసిద్ధాంతంనుండి హిక్స్ తన వినియోగదారు డిమాండ్ సూత్రాన్ని ఏర్పాటు చేసాడు. మార్షల్

ఆదాయ ప్రభావాన్ని గణనలోకి తీసుకోలేదని హిక్స్ విమర్శించాడు. ఒక వస్తువు ధరలోవచ్చే మార్పులకనుసారంగా వస్తువు డిమాండ్‌లో వచ్చేమార్పులవిూద వ్యక్తి ఆదాయంలోవచ్చే మార్పులు చూపే ప్రభావాన్ని మార్షల్ అధ్యయనం చేయలేదని హిక్స్ అభిప్రాయ పడ్డారు. మారుతున్న ధరలకనుగుణ్యంగా వస్తువు డిమాండ్ మార్పుచెందడంపై ఆదాయము, ప్రత్యామ్నాయవస్తువులు చూపే ప్రభావాన్ని విశ్లేషించి, వినియోగదారు డిమాండ్ సూత్రాన్ని ఈ విధంగా ఏర్పాటుచేసా- "ఒకవస్తువు డిమాండ్‌రేఖ క్రిందకు వంగుతుంది; ధర పడిపోయినప్పుడు హెచ్చుగా వినియోగించబడుతుంది; ఆ వస్తువు హీనగుణంకలది కానట్లయితే అన్నిసందర్భాల్లోను హెచ్చుగా వినియోగించబడుతుంది" అని హిక్స్ తన 'వాల్యూ అండ్ కేపిటల్' (పే.35)లో వ్రాసాడు. అయితే మార్షల్ చెప్పిన విషయం హెచ్చు సందర్భాలలో నిజమౌతుందని ఆదే'వాల్యూ అండ్ కేపిటల్' (పే. 32) అనే పుస్తకంలో వ్రాసాడు.

## పరిపూరక ఆదాయచలనము :

హిక్స్ పరిపూరక ఆదాయచలన (Compensating Variation in Income) భావనకు ఏర్పర్చాడు. మార్షల్ చెప్పిన వినియోగదారుని మిగులు (Consumer's Surplus) భావనను విమర్శిస్తూ, ఈ భావనలో బలహీనత ఉన్నప్పటికీ, గణనలోఉన్న వస్తువుధర పడిపోవడంవల్ల, ద్రవ్యరూపంలో వినియోగదారుకు సంక్రమించే లాభాన్ని స్పష్టంగా వివరించేందుకు తోడ్పడుతుందని 'వాల్యూ అండ్ కేపిటల్' (పే.40)లో హిక్స్ వ్రాసార. అందువల్ల ఈ భావన తనకుగాను తాను ప్రాముఖ్యత గలదికాదని హిక్స్ చెప్పాడు.

## సాధారణ సమతౌల్య సిద్ధాంతము:

సాధారణ సమతౌల్య సిద్ధాంతాన్ని మొదటిగా చెప్పింది వాల్‌రాస్ అని హిక్స్ అభిప్రాయం. స్పెక్యులేటివ్ మార్కెట్‌ను గణనలోకి తీసుకునేటప్పుడు వాల్‌రాస్ చెప్పిన సాధారణ సమతౌల్య సిద్ధాంతాన్నీ విధంగా వివరించవచ్చు: ఒక నిర్ణీత ధరకు వ్యక్తి తన వద్దలేని వస్తువుల్నిడిమాండ్ చేస్తాడు. అయితే తనవద్దనున్న వస్తువులతో తాను డిమాండ్ చేసే వస్తువుల్ని మార్చుకోవడానికి సిద్ధపడతాడు. అందువల్ల ఒక వస్తువుకున్నడిమాండ్, సప్లయ్‌లను సులభంగా నిర్ణయించవచ్చు. ధరవ్యవస్థ డిమాండ్‌లను సప్లయితో సమానం చేస్తే సాధారణ మారక సమతౌల్యము ఏర్పడుతుంది. ఇక్కడ హిక్స్ ఏకసంస్థ సమతౌల్య భావాన్ని ప్రవేశ పెట్టాడు. ఏక సంస్థసమతౌల్యభావనవినిమయసిద్ధాంతాన్ని(Exchange Theory) విస్తృతం చేయడానికి తోడ్పడుతుందని హిక్స్ అభిప్రాయపడ్డాడు. భవిష్యత్తులో ఆశించేవాటిని గురించి ఖచ్చితంగా చెప్పినప్పటికీ, కొంత అనిశ్చితత ఉండకతప్పదు కాబట్టి, ఆ అనిశ్చితత మేరకు మినహాయింపు ఇవ్వాలి. సంపూర్ణ స్పర్ధపరిస్థితులలో, ఉత్పాదనకు కారకాల (inputs) ధరలకు సంబంధించిన సంగత సమాచారం సహాయంతో 'ఫరం' తన లాభాలను మదింపు చేసుకోగలదు ధరలు ఒకే దిశలో కదులుతున్నంత వరకూ, ఒక వస్తువుల సముదాయాన్ని ఒకే వస్తువుగా పరిగణించవచ్చు ఆ విధంగా చలాంకాల సంఖ్యను తగ్గించి సాధారణ నిర్ణయాలకు వెలువరించవచ్చు. "ఏకస్వామ్యం క్రింద స్థిరత్వ పరిస్థితులు మధ్యమ పరిస్థితులు అవుతాయని,ఆర్థిక సూత్రాల ఏర్పాటుకు ఆధారభూతమైన పీఠము తెగగొట్టివేయ బడుతుందని" భావించడం వల్ల హిక్స్ తన సిద్ధాంతంలో ఏక స్వామ్య పరిస్థితుల అధ్యయనాన్ని చేర్చలేదు. అందువల్ల హిక్స్ విశ్లేషణ సంపూర్ణస్పర్ధ పరిస్థితులలో సాధారణ సమతౌల్య సమస్యకు చెందినట్టిది. ఏక సంస్థ (individual Firm) పరిస్థితుల దృష్ట్యామాత్రమే అతనీ సమస్యను అధ్యయనం చేయడానికి పూనుకున్నాడు.

ఈ సమతౌల్య భావన ఉత్పాదనకు సంబంధించినది కాబట్టి వినిమయ సమతౌల్యాన్ని (Equilibrium of Exchange) మించి, ఇతర రంగాలకు అనువర్తిత మౌతుంది. ఈ విశ్లేషణను పౌరాణిక ఆర్థిక శాస్త్రవేత్తలు లేవదీసిన సమస్యలకేగాక దీర్ఘకాలీన సమస్యలకు ముఖ్యంగా పంపిణీ, అంతర్జాతీయ వ్యాపార రంగాలకు అనువర్తింప జేయవచ్చు. అయితే ఈ ప్రమేయాన్ని సర్వకాలసర్వావస్థలకు అనువర్తింపజేసినట్లయితే, ఇదివరకటి, ఆర్థిక శాస్త్రవేత్తలు చేసిన తప్పులు చేసినట్లే అవుతుంది కాబట్టి, అందుకు పూనుకోకూడదని హిక్స్ అభిప్రాయం. హిక్స్ తాను సూచించిన వ్యవస్థా విధానంలోని బలహీనతలను స్పష్టంగా ఒప్పుకున్నాడు. ఈ విధానంలో మూడు లోపాలున్నాయని 'వాల్యూ అండ్ కేపిటల్' (పే.99–100)లో వ్రాసాడు: [1] ఈ విధానము ఏకస్వామ్య (monopoly) పరిస్థితులను,అసంపూర్ణస్పర్ధను (Imperfect. competition) గణనలోకి తీసుకోదు. [2] రాజ్యాంగ యంత్రం నిర్వహించే ఆర్థికకార్యకలాపం ప్రాముఖ్యతను పరిగణించ లేదు. (3) మూలధనం, వడ్డీ,పొదుపు,పెట్టుబడి, స్పెక్యులేషన్‌ల ప్రాముఖ్యతను గుర్తించ లేదు.

## ఆర్థిక గతి శీలము :

ఆర్థిక సిద్ధాంతంలో కాలంతో పని లేకుండా జరిగే అధ్యయనాలు ఆర్థిక నిశ్చల (Economic Statics) అధ్యయనం క్రిందికి వస్తాయని; అధ్యయనంలో ఉన్న ప్రతిరాశిని కాలరీత్యా అధ్యయనం చేసినపుడది ఆర్థికగతిశీల (Economic Dynamic) అధ్యయనం అవుతుందని హిక్స్ అభిప్రాయపడ్డారు. ఆర్థిక నిశ్చల అధ్యయనంలో కొన్ని ఉత్పాదనకారకాల రాసుల్ని నియుక్తి చేయడం వల్ల కొంత ఉత్పాదన రాశి ఏర్పడిందని ఆర్థిక శాస్త్రవేత్త తెలుసు కుంటాడు. అయితే ఆ ఉత్పాదనకారకాలు నియుక్తి చేయబడిన కాలంతోను, ఉత్పత్తి లభ్యమైన కాలంతోను అతనికి సంబంధం లేదు.

(మిగతా 48 వ పేజీలో)

శ్రీ బులుసు వేంకటరమణయ్య

# "తిక్కయజ్వ హరిహరనాథ తత్త్వము"

అతి ప్రాచీనమైన ఆర్షయుగంలో కర్మకాండకూ, బ్రహ్మగవేషణకూ మాత్రం ప్రాధాన్యం ఉండేది. ప్రధాన దేవతలలో ఎక్కువ తక్కువ భేధాలులేవు. కర్మప్రధానములైన సూత్రాలను జైమిని ముని, బ్రహ్మసూత్రాలను బాదరాయణమహర్షి కూర్చి రెండింటికీ తగిన ప్రచారం కలుగజేశారు. కర్మకాండను అనుసరించి యాగాలను చేస్తున్నప్పుడు వాటిలో పశువిశసనం మూలంగా జీవహింస స్పష్టంగా కానవస్తుంది. ఇది ప్రధానకారణంగా గౌతమ బుద్ధుని ప్రచారంవల్ల బౌద్ధమతం వ్యాప్తిలోనికి వచ్చింది జన సామాన్యపు నిత్య వ్యవహారంలో ఉన్న ప్రాకృతభాషలో బౌద్ధగ్రంధాలు ఉండడంకూడా ఆ మతం ప్రచారం కావడానికి కారణమయింది. సూత్రగ్రంథాలు మిక్కిలి సంగ్రహరూపాలై ఉండుటవల్ల వానిలోని విషయం మహావిద్వాంసులకుకూడా దురవగాహనంగా ఉండేది. ఆ సూత్రగ్రంధాలూ, వాని వ్యాఖ్యానరూపాలైన భాష్యములూకూడా విద్వాంసులు వ్యవహరించే గీర్వాణభాషలోనే ఉండడం వల్ల జన సామాన్యానికి వానిపట్ల ఉపేక్షాభావం ఏర్పడి క్రమ క్రమంగా వైదికమతం క్షీణదశకువచ్చి, కొంతకాలం బౌద్ధమతం యొక్కయు అట్టిదే అయిన జైనమతంయు బావుటా ఎగిరింది కాని, రాజావలంబన లేనందువల్ల ఆ మతాలు క్షీణదశకు వచ్చాయి. వైదిక మతం తిరిగి వ్యాప్తికి వచ్చి దేవతలలో శివకేశవులకు ప్రాధాన్యం వచ్చింది. రాజ్యపాలకులలో కొందరు శివభక్తులుగాను, కొందరు విష్ణుభక్తులుగాను ఉండేవారు మహర్షులు శివకేశవులకు భేదం లేదని చెప్పినా, ప్రజలు మతాభినివేశాలకు లొంగి కొందరు వీరశైవులుగాను, కొందరు వీరవైష్ణవులుగానూ తయారైనారు. అందువల్ల పరస్పరదూషణలు, కలహాలు సంభవించి, అవి తీవ్ర రూపందాల్చి దేశాన్ని అల్లకల్లోలం చేశాయి. ప్రజలలో ఐకమత్యం నశించినది. ఇట్టి విషమపరిస్థితుల్లోనే తెలుగునాట మహామేధావియైన తిక్కన జన్మించడం జరిగింది.

వాగ్దేవి రూపాంతరమైన తిక్కన కర్మిష్ఠి. యాగాచరణ వల్ల యజ్వఅయినాడు ఆయన సాటిలేని బ్రహ్మజ్ఞాని. సకల శాస్త్రములను ఆపోశనపట్టిన ప్రతిభాశాలి స్వప్నంలో హరిహరనాధుని సాక్షాత్కారాన్ని పొందిన ధన్యుడు, గొప్ప రాజకీయవేత్త. ప్రజల మనస్తత్వాలను బాగుగా గ్రహించి, శివకేశవులకు గల అభేదాన్ని తెలిపే హరిహరనాధతత్త్వాన్ని ప్రచారానికి తీసుకొని వచ్చి సామరస్యం కల్పించి ప్రశాంతిని చేకూర్చాడు అతడు నెల్లూరు ప్రభువైన మనుమసిద్ధికి మంత్రిగా ఉండడంకూడా దీనికి కొంత దోహదమై ఉండవచ్చు అతడు ఈవిధంగా దేశంలో ప్రశాంతిని సాధించడమేకాకుండా కాకతీయ రాజ్యప్రభువు గణపతిదేవచక్రవర్తి వద్ద తన ప్రతిభాపాండిత్యాలను ప్రదర్శించి, ఆయన అనుగ్రహం సంపాదించి, తన్మూలంగా పోయిన నెల్లూరురాజ్యాన్నితిరిగి మనుమసిద్ధికి లభింపజేశాడు. ఇంతేకాదు, నాటినుండి నేటివరకూ తెలుగు కవులలో తన్నుమించినవాడులేడనే ప్రఖ్యాతిని, గడించాడు. అన్ని విషయాలలోనూ అతనికి అతడే సాటి.

తిక్కన భారతం 'ఆంధ్రవాఙ్మయం'లో ప్రథమ స్థానాన్ని గడించినది. ఆయన కథాకథన కౌశల్యాన్ని గురించీ, కవితా వైభవాన్ని గురించీ ఎందరో విద్వద్విమర్శకులు ఎన్నో వ్యాసాలనూ, గ్రంథాలను ప్రకటించిఉన్నారు. ఆయన అనువదించిన పదిహేను పర్వాలలోనూ, కథాంశంతో సంబంధం లేకుండా ఆశ్వాసాలమొదట చివర చాలాపద్యాలున్నాయి. వాటిలో తిక్కయజ్వ శివకేశవులకు అభేదాన్ని తెలిపే హరిహరనాథతత్త్వాన్ని సమగ్రంగా వివరించాడు.

తిక్కన భారతంలోని ఆశ్వాసాద్యంత పద్యాలలో హరిహరుల అభేద ప్రతిపాదనతో పాటు అనేక గూఢార్థాలు ఇమిడి ఉన్నాయి. ఆధ్యాత్మ విద్యాప్రతిపాదకాలైన వాటిని తెలుసుకోడానికి వేదాంతంతో పాటు ఇతర శాస్త్రాలలోనూ పాండిత్యం ఉండాలి అందువల్ల బహుముఖ జ్ఞానం ఉంటేనేగాని వీటి అంతరార్థాన్ని తెలుసు కోవడం సాధ్యంకాదని స్పష్టమవుతూ ఉన్నది.

ఈ పద్యాలకు చక్కని వ్యాఖ్యానం వ్రాసి, తిక్కన మహాకవి హృదయాన్ని వెల్లడించడం అవసరమని ఏభయి యేళ్ల క్రిందటనే సుప్రసిద్ధ వాఙ్మయ విమర్శకులు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఒక సభలో ఉపన్యసిస్తూ తెలియజేశారట. కాని యిప్పటి వరకూ ఆ పనికి యెవ్వరూ పూనుకోలేదు. డాక్టర్ సి ఆర్. రెడ్డిగారికి కలిగిన సంకల్పమే విద్యాభిమానులు, వదాన్యశేఖరులు, వివిధ విద్యాలయ పోషకులు అయిన యెర్రం రెడ్డిగారికిన్నీ చాలా ఏండ్లనుంచీ ఉన్నది వ్యాఖ్యాన నిర్మాణ దక్షులైన తగిన విద్వాంసుల కోసం అన్వేషిస్తూ ఉండగా వారి మిత్రులు డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, ఓరుగంటి నీలకంఠ శాస్త్రిగారి పేరును సూచించారు.

నీలకంఠశాస్త్రిగారు భాష్యాంత వైయాకరణులు. స్వయం కృషి వల్ల సాహిత్యంలోనూ, ఆంధ్రంలోనూ మంచి పాండిత్యం సంపాదించారు. శ్రీకల్యాణానంద భారతీ మహాంతాచార్యస్వామి వారి వల్లమంత్రోపదేశంపొంది వేదాంతంలో క్షుణ్ణంగ పరిశ్రమ చేశారు. ఇతర శాస్త్రాల తత్త్వాన్ని ఆకళించుకున్నారు. తిక్కయజ్వహరిహర నాథతత్త్వాన్ని ఆంధ్రావళికి అందించడానికి అన్నివిధాలా సమర్థులు.

బాలకృష్ణారెడ్డిగారి ప్రార్థనను అంగీకరించి వారి సంకల్పాన్ని సఫలంచెయ్యడానికి సమ్మతించారు. నీలకంఠశాస్త్రిగారు యు. జి సి. ప్రొఫెసరుగా ఉన్నప్పుడు హరిహరనాథతత్త్వంపై పరిశోధన చెయ్యడమే తమ అభిమాన విషయంగా స్వీకరించడం దీనికి ఎంతో సహకరించింది. ''తిక్కయజ్వ హరిహరనాథతత్త్వ'' మనే బృహద్గ్రంథం తయారయింది.

తిక్కన సోమయాజి ఆశ్వాసాద్యంత పద్యాలలోని హరిహరనాథస్తుతికి మూలంతో సంబంధం లేదు వ్యాసభారతంలో అది లేదు. ఆయన భక్త్యతిశయంతో వేదోక్తకర్మోపాసనాజ్ఞానాలను సాంఖ్య, యోగాది సిద్ధాంతాలతో మేళవించి పరమేశ్వర సంబోధన వ్యాజమున మనకు హరిహరనాథతత్త్వాన్ని అందించాడని చెప్పూ రచయిత ఆ విషయాన్ని సప్రమాణంగా వివరించారు. వ్యాఖ్యాత ఆశ్వాసాద్యంతములలోని పద్యాలనే కాకుండా ఈ తత్త్వాన్ని తెలిపే ఇతర పద్యాలను కూడా వ్యాఖ్యానించడం గమనించదగినది గ్రంథాన్ని ప్రారంభించినప్పుడే 'శ్రీయన గౌరినాబరగు' అనే పద్యంలోని 'భద్రాయత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి, వైదికధ్యాయిత' అనే వాటి వ్యాఖ్యయే పాఠకులను ఎంతో ఆకర్షిస్తుంది. రెండవ పద్యంలోనూ, మరికొన్ని స్థలాల్లోనూ గల ''ధర్మాద్వైతస్థితి''ని గురించిన వీరి వివరణ అసాధారణమైనది. ఈ వ్యాఖ్య అవసరమైన చోట్ల విపులంగానూ, మిగిలిన చోట్ల సంగ్రహంగానూ ఉన్నది. ఆయా స్థలాలలో ప్రామాణికాలుగా శ్రుతిస్మృతుల నుండి. ఉపనిషత్తుల నుండి గ్రంథభాగాలు చూపబడినవి. పద్యాలకు ముందు అవతారికలు, పద్యానికి ప్రతి పదార్థం, తాత్పర్యం, భావం, విశేషార్థాలు సులభశైలిలో చూపబడినవి. రచన గ్రంథం ఆద్యంతం ఒక్క పద్ధతిలోనే జరిగింది బహుముఖ పాండిత్యం సంపాదించిన విద్వాంసులు ఉండవచ్చును. కాని ఓపిక, శ్రద్ధ ఉండడం అరుదు. ఏతద్రచనలో నీలకంఠశాస్త్రిగారు చూపిన శ్రద్ధాసక్తులు ప్రశంసనీయాలు

ఇంతశ్రమపడి గ్రంథం రచించిన పిమ్మట అది ముద్రణ లేకుండా ఉండిపోతే రచయితకు కలిగే నిరుత్సాహం అనుభవైకవేద్యం. రచయిత శ్రమ వ్యర్థం కాలేదు శ్రీ బాలకృష్ణారెడ్డిగారు ముద్రణభారాన్ని వహించి ఎన్నో శ్రమల కోర్చి దీనిని చరిత్రకారులు, విద్వద్విమర్శకులు అయిన వేదం వేంకటరాయశాస్త్రిగారిచేత ఎంతో అందంగా ముద్రింపజేశారు.

రచయిత ఏతద్రచనకు ఎంతో శ్రమపడినా, ఇది చక్కగా ముద్రించబడడం, ప్రసిద్ధ విద్వాంసుల ప్రశంసలను అందుకోవడం—ఆ శ్రమను విస్మరింపజేస్తుంది. ''క్లేశః ఫలేనహి పునర్నవతాం విధత్తే''! అని కదా మహాకవి కాళిదాసు వాక్యం! శ్రీ శాస్త్రిగారు దీనిని పురస్కరించుకొని నూతనోత్సాహంతో ఇట్టి ఉత్కృష్ట గ్రంథాలను మరికొన్నిటిని రచించి ఆంధ్రుల మన్ననలను పొందగలరని ఆశిస్తున్నాను.

# నోబుల్ బహుమతి గ్రహీత జె. ఆర్. హిక్స్ ఆర్థిక ఆలోచన

(46వ పేజీ తరువాయి)

ఆర్థిక గతిశీల అధ్యయనంతో ఉత్పాదక కారకాలను నియుక్తి చేసిన కాలము,ఉత్పత్తిలభ్యమైన కాలము చాలముఖ్యము. ఆర్థిక శాస్త్రవేత్తలు సమస్యలోని 'ఎప్పుడు' అనే విషయాన్ని తెలిసికొని కాలంలో వచ్చిన మార్పుకు, ఉత్పాదనకారకాలకు ఉత్పత్తి చేయబడిన వస్తువులకు మధ్య నున్న సంబంధాన్ని ఉత్పత్తి కారకాలకు, ఉత్పత్తికి మధ్య సంబంధాన్ని కాలంలోని మార్పు ఎలా ప్రభావితం చేసిందో తెలియజేస్తారని హిక్స్'వాల్యూఅండ్ కేపిటల్'లో వ్రాసాడు. స్తబ్ధస్థితి (Stationary State) గత శీలస్థితిలోని ఒక ప్రత్యేక భాగమని హిక్స్ అంటున్నారు. స్తబ్ధస్థితిలో ఒక నిర్ణీత కాలవ్యవధిలో, అభిరుచులు, ఉత్పత్తి పద్ధతులు, వనరులు దాదాపు స్తబ్ధంగానే (Stationary) ఉంటాయి. ఆ స్తబ్ధస్థితిలో ఉన్నధరకు, ఆశించిన ధరకు; ఆదాయము, వస్తువులకు;ద్రవ్య వడ్డీ రేటుకు, వాస్తవిక వడ్డీ రేటుకు మధ్య వ్యత్యాసాన్ని చూడవలసిన సమస్య ఎదురవ్వదు. స్తబ్ధస్థితిపై విచారణకు పూనుకోవడం వల్లనే సరైన వడ్డీరేటు నిర్ణయానికి సంబంధించిన సిద్ధాంతం అమలులోకి రాకుండా పోయింది. అటువంటి స్తబ్ధస్థితిలో వర్తమాన ధరలలో డిమాండ్, సప్లయిలు సమానమైనప్పుడేగాక, ఒక ప్రత్యేక కాలవ్యవధిలో ధరలు మారకుండా నిలకడ (Constant)గా ఉన్నప్పుడు కూడా సమతౌల్యము ఏర్పడుతుంది. కాబట్టి సమతౌల్యము, కాలాన్ని బట్టి చెప్పాలంటే, చాలా దీర్ఘకాలీనవ్యవధిలోనే సంభవమౌతుందని, అందువల్ల వాస్తవికజీవితములో సమతౌల్యము సాధ్యముకాదని హిక్స్ చెప్పారు. సిద్ధాంతరీత్యా సమతౌల్యము ఆదర్శవంతమేకావచ్చు, కాని ఆచరణ దృష్ట్యా అది అసంభవము. అందువల్ల తాత్కాలిక సమతౌల్యాన్ని అధ్యయనం చేయడమే ఆర్థిక శాస్త్రవేత్తలకు అభిరుచిదాయకం కావాలి.

గుణక, వేగత్వకారకాల 'సూత్రాలు రెండూ కలసి చక్రీయ అస్థిరత్వాను (Cyclical Fluctuations) కలుగజేస్తున్నాయని హిక్స్అభిప్రాయం. పెట్టుబడి స్వతంత్రంగాను, (Autonomous), ప్రేరేపణ (Inducement) ద్వారాను వస్తోంది. స్వతంత్ర పెట్టుబడి క్రమరేటు (Regular Rate) పెరిగినపుడు ప్రేరేపిత పెట్టుబడి కొంత వరకు క్రమంగాని రేటుతో పెరుగుతుంది. బహిర్గత శక్తులు చెదరగొట్టక పోయినట్లయితే స్వతంత్ర పెట్టుబడి వికాసము ఎప్పుడూపురోగమిస్తూనే ఉంటుంది. వేగత్వరణ సూత్రము (Principle of Acceleration) అమలు జరుగుతూన్నప్పుడు ఉత్పత్తి పెరుగుదలతోపాటు ప్రేరిత పెట్టుబడి పెరగడానికి తోవతీస్తుంది. సంపూర్ణఔద్యోగితాస్థాయి, కనిష్ట పెట్టుబడి చక్రీయ అస్థిమితాల హద్దుల్ని నిర్ణయిస్తాయి.

శ్రీ వెన్నెలకంటి ప్రకాశం **

# కావ్యభాష: ప్రాముఖ్యతా సంప్రదాయం *

కావ్యాలలోవాడే భాషను పరిశీలించడమే ఈ వ్యాసం యొక్క ప్రధానలక్ష్యం. ముందుగా కావ్యలక్షణాలను మన పూర్వులు ఏ విధంగా నిర్ణయించారో చూద్దాం.

భామహుడు అన్నమాటలివి:

1. శబ్దార్థౌ సహితౌ కావ్యం.

అంటే కావ్యంలో శబ్దమూ అర్థమూ కలిసి ఉంటాయన్న మాట ఈ మాట మనం ఏ చరిత్రగ్రంథం విషయంలోనో, శాస్త్ర విజ్ఞానగ్రంథం విషయంలోనో అనలేము. అక్కడ అర్థం ముఖ్యం. భాష మారినా అసలు విషయం మారదు. కావ్యం విషయంలో మాత్రం భాషను మారిస్తే వేరేకావ్యం పుట్టుకొస్తుంది గాని పూర్వకావ్యం నిలవదు. ఈ నిర్వచనానికి అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలున్నట్లు కొందరంటారేమో! సామెతలు గూడ శబ్దార్థాల మేలు కలయికకదా! వాటినిగూడ కావ్యాలనవలసివస్తుందివరి. అవి కావ్యాలుకావని అనుకొంటే పై నిర్వచనానికి 'అతివ్యాప్తి దోషం' తప్పదు నిజానికి సామెతలు ఏకవాక్యకావ్యాలుగా స్వీకరించడం న్యాయం. అలాచేస్తే అతివ్యాప్తి దోషం తప్పుతుంది. ఇక పోతే పారాంతరాలను చూపిస్తూ అక్కడ శబ్దంమారినా అర్థం మారడం లేదు అంటే అవ్యాప్తిదోషం ఒప్పుకోవాలి. ఇక్కడ గూడ మనం గమనించవలసిన విషయం ఒకటుంది పారం మారితే అర్థం మారుతుంది. ఆ భాగంవరకు మనకు వేర్వేరు కావ్యాలేర్పడ్డట్టు గ్రహించాలి. అలా అనుకుంటే అవ్యాప్తిదోషం గూడ పోతుంది.

పైనచెప్పిన భామహుని నిర్వచనంనుంచే 'సాహిత్యం' అనే మాట వచ్చిందట. అంటే ఆ శబ్దార్థ సాహిత్యం లేనిదాన్ని 'అకావ్యం'గా భావించాలి. భామహుని నిర్వచనం మౌలికమైనది. కాని కావ్యసంపదను అర్థంచేసుకొని విమర్శనాత్మక అధ్యయనం చెయ్యడానికి ఇదిచాలదు. ఇతరులు చెప్పింది గూడ తీసుకోవాలి. కావ్య 'పరమార్థం' (Value) సూచించే రెండు లక్షణాలు తీసుకొందాం:

2. "వాక్యం రసాత్మకం కావ్యం" (విశ్వనాథుడు)

3. "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం" (జగన్నాథుడు). ఈ లక్షణాలగురించి మన సాహిత్య శాస్త్రంలో జరిగిన మీమాంసజోలికి మనం పోనక్కరేదు అక్కడ మన అవసరాలకు తగినంతవరకే చర్చిద్దాం.

విశ్వనాథుడు చెప్పిన లక్షణం ముఖ్యంగా చదువరుల హృదయంపై కావ్యంవేసేముద్రను సూచిస్తుంది. సహృదయుడూ, రసజ్ఞుడూ అయిన చదువరి (విమర్శకుడు) ఒక కావ్యం చదివి ప్రత్యేకమైన అనుభూతిని పొందడానికి కారణం అందులో పోషించబడ్డ రసం. కవి తన (కావ్య) వస్తువును ఏదో ఒక భావాన్ని ప్రధానం చేసుకొని కవితా వస్తువుగా మలుస్తాడు. ఆ కావ్య వస్తువులో బీజప్రాయంగా ఉన్న 'రసం' అతని కావ్యగతిలో పెంపొంది సహృదయుడైన చదువరి (శ్రోత) మనసులో వెలుస్తుందని చెప్పవచ్చు. ఇలా రసోత్పత్తికి దారితీసే వాక్యసమూహమే కావ్యమన్నది విశ్వనాథుని మతం. దీనినే 'రససిద్ధాంతం' అంటారు.

జగన్నాథుడి లక్షణంగూడ ఒక రకంగా కావ్యపరమార్థాన్ని సూచిస్తుంది. అతని మాటల్లో రమణీయమైన అర్థం ఉండే శబ్దమే కావ్యం. 'రమణీయం' అంటే మనం ఒకకావ్యాన్నిగాని, కావ్యభాగాన్నిగాని పఠించేటప్పుడు లేకపోతేదానిని పునశ్చరణ చేసుకొనేటప్పుడు "లోకోత్తర ఆహ్లాదం" కల్గించే గుణం. దీనినే 'చమత్కారం' అంటారు. ఈ చమత్కారమే రసం చేసేపని. ఈ చమత్కార ఉత్పాదనవిషయంలో కవి తన కావ్యంలో రసపోషణకు ఎలాంటి భంగం కల్గించకూడదు. రసపోషణ విషయంలో మన పూర్వులు ఒక ముఖ్యమైన విషయాన్ని చెప్పారు ఒక కావ్యానికిఒకే రసం ప్రధానంగా ఉంటుంది. మిగతారసాలు దానికి సహాయకారులుగా ఉండవచ్చుగాని సమానప్రాధాన్యతపొందే అవకాశం లేదు. ఇక్కడ చలనచిత్రాలనుంచి ఒకచక్కని ఉదాహరణ యివ్వవచ్చు. 'విప్రనారాయణ' అనే చిత్రంలో ప్రధాన రసం 'భక్తిరసం'. ఆ

---

* ఈ వ్యాసరచనకు తోడ్పడిన పరిశోధనకు యు. జి. సి. నుండి "ఫయినాన్షియల్ ఎసిస్టెన్స్ టు టీచర్స్ స్కీమ్" (ఎఫ్–7–24/74 హెచ్.ఆర్) కింద ఆర్థిక సహాయం లభించింది.

** ప్రస్తుతం "యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్" (న్యూఢిల్లీ)లో పనిచేస్తున్నారు.

చిత్రంలో హాస్యాదిరసాలు పోషింపబడ్డా అవన్నీ దారితీసింది భక్తి రసపోషణకే. చాలా కావ్యాలు, నాటకాలు, చలనచిత్రాలు ఉత్తమ శ్రేణికి చెందకపోవడానికి కారణం ఈ ఏకరస ప్రధాన సూత్రం పాటించకపోవడమే.

ఈ రసనిష్పత్తికి కావ్యగతమైన కారణాలు ముఖ్యమైనా సహృదయుని అభిరుచి, ప్రతిభావ్యుత్పత్తులు గూడ అవశ్యకమని చెప్పాలి. సరియైన సంస్కారం, అభ్యాసంలేని చదువరి ఏదైనా మహత్తరకావ్యాన్ని చదివితే అర్థంకాలేదని గిరవాటువేసే ప్రమాదం లేకపోలేదు అలాంటప్పుడు ఆ కావ్యం కలిగించేరసానుభూతిని పొందే ప్రశ్న ఉదయించదుగదా! దీనినిబట్టి స్పష్టంగా తేలే విషయమేమి టంటే రసనిష్పత్తి జరిగేది సహృదయుని మదిలో. దానికి అవసరమైన అన్ని 'హంగులు' కావ్యాంతంగా ఉంటాయి. కావ్యవస్తువులోను, కావ్యంలో వాడిన శబ్దాలంకారాలలోను, భాషలోను, అర్థాలంకారాలలోను సహృదయునికి ఏదో మధురానుభూతిని కల్గించగల విషయాలు దొరుకుతాయి. వాటిని అర్థంచేసుకొని, మననం చేసుకొని తన ప్రతిభవల్ల చెప్పని భావాలను ఊహించుకొంటూ రసానుభూతిని పొందుతాడు. రసనిష్పత్తికి భంగం కలిగించే వేవైనా కావ్యంలో ఉంటే కవి తన పనిలో తప్పటడుగు వేసినట్లే. అందుకే కవిత్వం రాసేటప్పుడు కవే మొదటి విమర్శకుడిగా ఉంటూ అవసరమైన మార్పులు తెస్తూ ఉంటాడు.

పైన "చెప్పని భావాలను ఊహించుకుంటూ" అన్నాం కావ్యంలో ప్రత్యక్షంగా ఉండే అర్థం అభిధ' ఆ అర్థం ఆధారం చేసుకొని వేరే అర్థాలు గూడ తీసుకొనే అవకాశముంది. దీనినే 'వ్యంజన' అంటారు. ఈ అన్యార్థమే కావ్యానికి నిజమైన సొబగు నిస్తుందని పెద్దల అభిప్రాయం. ఆనందవర్ధనుడి ధ్వని సిద్ధాంతం ఈ విషయానికి ఎక్కువ ప్రాధాన్యతనిస్తుంది. ఆయన దృష్టిలో "కావ్యాత్మ ధ్వని" అన్యార్థం కావ్యంలో ప్రాధాన్యత వహించినప్పుడు దానిలో ధ్వని ఉంది అంటారు. ఈ ధ్వని రస నిష్పత్తికి ముఖ్య కారణ మౌతుంది. ఈ అన్యార్థం శబ్దంవల్లగాని, అర్థంవల్లగాని కల్గవచ్చు. పైవిధంగ ఊహాశక్తికి అవకాశం ఉండబట్టి సహృదయుడు కావ్యపఠనంలో కవితో సమానంగా తను గూడ ఊహా రచనకు పూనుకొని పైన చెప్పిన చమత్కారాన్ని అనుభవిస్తాడు

'రసం' కావ్యం చదివేటప్పుడు మనలో కలిగే అనుభూతి. దానిని కలుగజేయడానికి చాల ముఖ్యంగా తోడ్పడేది అన్యార్థమైన 'ధ్వని'. ఈ రెంటి నిష్పత్తి కావ్యంలో వాడిన భాష ద్వారా జరగ వలసిందేగదా! భాషను దృష్టిలో పెట్టుకొని చేసిన సిద్ధాంతాలు 'రీతి' సిద్ధాంతం, 'వక్రోక్తి' సిద్ధాంతం.

రీతి సిద్ధాంతం విశిష్టమైన పదరచనకు ప్రాధాన్యత నిస్తుంది. వామనుడు స్థాపించిన ఈ సిద్ధాంతం ప్రకారం గుణ సహితమైన పదరచన రీతి. ఇక్కడ పదాల వాడుక, అలంకారాలను వాడే పద్ధతి మొదలైనవి ముఖ్యాంశాలు. ఈ రీతులు కావ్యరసానికి అనుకూలంగాను, కవి ప్రతిభావ్యుత్పత్తులను బట్టి మారు తుంటాయి. ప్రాచీనులు ఈ రీతులను ప్రాంతీయ పద్ధతులుగా చెప్పారు ఉదాహరణకు అందరూ ముఖ్యంగా అంగీకరించే రీతులు మూడు—వైదర్భి, గౌడి, పాంచాలి. వైదర్భీరీతిలో పదబంధాలలో గాని, సమాసాలలోగాని ఎట్టి సంక్లిష్టత, కాఠిన్యత ఉండవు. గౌడి రీతిలో పరుషశబ్దాలు, దీర్ఘ సమాసాలు ఉంటాయి. కొంత మృదు రచన, కొంత పరుష రచన ఉండి గౌడీ, వైదర్భీ రీతులకు మధ్యస్థంగా ఉండేది పాంచాలి ఈ మూడు రీతుల గుణ నిర్ణయాన్ని బట్టి మనం ఒక విషయం చెప్పవచ్చు. ఈ రీతులను నిర్దుష్టంగా చెప్పేకన్నా ఇంద్రధనుస్సులో ఒక రంగులో ఇంకొకటి కలిసిఉన్నట్లు మిశ్రమంగా చెప్పవచ్చు. వివరాలను జాగ్రత్తగా పరిశీలిస్తేపైన చెప్పిన మూడు రీతులకన్నా చాల ఎక్కువగానే తేలవచ్చు. అందుకే శారదా తనయుడు చెప్పింది గుర్తుంచు కోవడం అవసరం. కవిని బట్టి, కావ్యాన్ని బట్టి రీతులు మారుతుంటాయన్నది ఆయన మతం స్థూలంగా మాత్రమే మనం విభిన్నరీతులను కొన్ని నిర్దుష్టరీతుల కింద జమకట్టవచ్చు.

క్షేమేంద్రుడు తన ఔచిత్య సిద్ధాంతంలో రససిద్ధమగు కావ్యానికి ఔచిత్యమే ప్రాణమని నిర్ధారించాడు. కావ్యానికి నిజమైన లోపం అనౌచిత్యమే. ఔచిత్యమంటే శబ్దాలు భావాలు, అలంకారాలు మొదలైనవి రసనిష్పత్తికి అనుకూలంగా, ఉచితంగా వాడబడడం. అనౌచిత్యం రసభంగానికి దారి తీస్తుంది. ఔచిత్యం కావ్యానికి సంయోగత (unity)ను చేకూరుస్తుంది. ఈ అంశానికి ప్రాచీన పాశ్చాత్య పండితులైన అరిస్టాటిల్ (Aristotle), హోరెస్ (Horace) గూడ చాల ప్రాముఖ్యత యిచ్చారు. లాంగినస్ (Longinus) అనే పండితుడు కావ్యగతమైన ఔన్నత్యానికి (sublimity) ఔచిత్యాన్ని మూలకారణాల్లో ఒకటిగా భావించాడు. ఔచిత్యం విషయంలో మన పూర్వులు—ముఖ్యంగా అభినవగుప్తుడు—ఒక హెచ్చరిక చేశారు. కావ్యంలో ఉన్న విభిన్న భాగాలు మనకు పరస్పర విరుద్ధంగా తోచవచ్చు. కాని ఈ ప్రతివాద గుణం కవి రస పోషణకై తెచ్చిన పద్ధతి అయిఉండవచ్చు కాబట్టి ఒక కావ్యాన్ని సాంతం చదివి విమర్శనాత్మకంగా పరిశీలించిన తర్వాతనే అనౌచిత్య విషయం తేల్చగలం

ఇక వక్రోక్తి విషయం పరిశీలిద్దాం. ఈ సంప్రదాయాన్ని స్థాపించిన కుంతకుడు కావ్యానికి వక్రోక్తి జీవితం వంటిదని అన్నాడు. సాధారణంగా మనం మాట్లాడే మాటలకు విభిన్నంగా ఉన్న రచననే వక్రోక్తి అనవచ్చు. ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు గూడ కావ్యభాషను విశేషమైన రచనారీతిగా భావిస్తున్నారు. కాని ఈ 'విశేషత'ను వ్యాకరణ విరుద్ధతగా భావించగూడదు వక్రోక్తి ప్రత్యేక శైలిని సూచిస్తుంది గాని వ్యాకరణ విరుద్ధతను గాదు. కుంతకుని అభిప్రాయం ప్రకారం కావ్యగతమైన వక్రోక్తి మామూలు వాడుకకు విభిన్నమైనది. అంతేగాక కావ్యసౌందర్యమునకు తోడ్పడిన విభిన్నతయే వక్రోక్తి. వక్రత ఆరు విభాలుగా విభజించబడింది:

4. [అ] వర్ణ విన్యాస వక్రత
[ఆ] పదపూర్వార్ధ వక్రత
[ఇ] ప్రత్యయ వక్రత
[ఈ] వాక్య వక్రత
[ఉ] ప్రకరణ వక్రత
[ఊ] ప్రబంధ వక్రత

భాషా ప్రయోగానికి సంబంధించిన అన్ని అంశాలలోనేగాక, ప్రకరణంలోను, మొత్తం ప్రబంధంలోను వక్రత కోసం చూడ వచ్చు. ఈ వక్రతనే ముందు ముందు మనం 'అభిహితం' అన్న విషయం కింద చర్చిద్దాం. కావ్యంలో ఒక్కొక్కచోట 'ఛందో వక్రత' గూడ ఉపయోగించబడవచ్చు.

కావ్యగతమైన భాషా విభిన్నతలో భాగంగానే దానిలోని అలంకార ప్రయోగాలను చెప్పవచ్చు. ఈ అలంకారాలు శబ్దాలంకారాలని, అర్థాలంకారాలని రెండు రకాలుగా విభజింపబడ్డాయి పర్యాయపద ప్రయోగంతో సమసిపోయే అలంకారం శబ్దాలంకార మని మమ్మటుని అభిప్రాయం. అలా సమసిపోనిది అర్థాలంకారం. మనం సాధారణంగా మాట్లాడేటప్పుడు గూడ అలంకారాలను వాడుతుంటాం. కావ్య భాషలో ఇవి ఎక్కువ కన్పిస్తాయి, విభిన్న విధాలుగా కన్పిస్తాయి. శబ్దాలంకారాలను వర్ణ విన్యాస వక్రత కిందను అర్థాలంకారాలను వాక్య వక్రతకిందనూ చేర్చవచ్చు. ఈ అలంకారాల వాడుక ఔచిత్యాన్ని పాటిస్తూ ధ్వన్యర్థ సహాయంతో రసపోషణకు తోడ్పడాలి. అప్పుడే అవి సార్థకమైనట్లు. లేక పోతే నిరర్థకమైనట్లే.

ఈ సందర్భంలో 'స్వభావోక్తి' అన్న విషయాన్ని పరిశీలించాలి. వక్రత చాలతక్కువై సహజంగా ఉన్నదే స్వభావోక్తి. కానీఈ సహజత్వం సామాన్యతకు దారితీయకూడదు. అరిస్టాటిల్ గారిమాట వినండి: ''సామాన్యంగా ఉండకుండా స్పష్టంగా ఉండడమే కావ్య భాష లక్షణం''. కవి తను సాధించదలచుకొన్న కావ్య సౌందర్యాన్ని కృత్రిమంగాకాకుండా సహజంగానే ఉండేట్టుచూస్తే అది నిజంగా చదువరులను ఆకట్టుకొంటుంది. కావ్యగతమైన ప్రౌఢోక్తిగాని, వక్రోక్తిగాని ఈ సహజత్వాన్ని కోల్పోరాదు. లాంగినస్ పండితుని దృష్టిలో అలంకారాలు అలంకారాలుగా కన్పించక సహజంగా సరి పోతేనే అవి అలంకారాలు. కళ ప్రకృతికి దగ్గరైనప్పుడే పరిపూర్ణ తను సాధిస్తుంది.

కావ్యాలనువిమర్శించేవాళ్ళను మనపూర్వులు'సహృదయులు', 'రసికులు' అన్నారు. పైన ఒకసారి చెప్పినట్లుకావ్యాన్నిఅనుభవించే టప్పుడు రసికుడు (సహృదయుడు) కవిరాసిన కావ్యంతో మొదలు పెట్టి తను కావ్యాన్ని పునస్సృష్టిచేయడందాకా వెళ్తాడు. అంటే కావ్యగతమైన రసపోషణను అనుభవించడానికి తన ఊహాశక్తిని ఉపయోగించి 'రససృజన' కావించుకోవాలి. అందుకనే ప్రతి చదువరి (శ్రోత, ప్రేక్షకుడు) విమర్శకుడు కాడు, కాలేడు. కవికిలాగే మంచి విమర్శకునికి ప్రతిభావ్యుత్పత్తులవసరం. పాశ్చాత్యపండితులు కొందరు ఈవిధంగానే భావించారు. ఆస్కార్‌వైల్డ్ అనే పండితుడు ఈ విషయంలో విమర్శకునికి కవికున్న సృజనాత్మక శక్తి ఉన్నట్లే భావిస్తాడు (Wilde 1921, పే 121) ఆయన దృష్టిలో సృజనాత్మకశక్తికి, విమర్శనాత్మకశక్తికి పెద్ద భేదంలేదు సృజన కూడ విమర్శలేకుండా జరగదు (పే 121). సంయోగంలేనిదే శైలికుదరదు, శైలిలేనిదే కళలేదు (పే 123). ఉత్తమ విమర్శ కళాఖండాన్ని ఆధారం చేసుకొని నూతనసృష్టికి దారి తీస్తుంది (పే 143). ఆయన అభిప్రాయంలో విమర్శకుడికి ముఖ్యంగా ఉండవలసింది 'సౌందర్యభావం' (పే 194). ఈ భావం ఉన్న వ్యక్తి ఒక కళాఖండంలో కళాకారుడు అనుకోని సౌందర్యాన్నిగూడ చూడవచ్చు. 'సౌంద్యభావం' ఉన్న విమర్శకుడికి 'శైలి శాస్త్రం' (Stylistics) తెలియజేసే పారిభాషిక (సాంకేతిక) ధృక్పథం గూడ చేకూరితే అతని విమర్శ చాల శక్తిమంతం అవుతుంది.

పైన పూర్వులు చెప్పిన అభిప్రాయాలను పొందుపరుస్తూ కావ్యభాషను పరిశీలించడానికి తగిన శైలి సంప్రదాయాన్నిఏర్పరుచు కోవడానికి ప్రయత్నిద్దాం. కావ్యంలోని పదాలు, వ్యాకరణాంశాలు మన అభిప్రాయాలను, భావాలను ఏ విధంగా కదిలించగలుగుతాయో వివరించగలిగే కావ్య నిర్మాణనియమాలను చర్చించడమే విమర్శావా సంప్రదాయాల లక్ష్యం మనం యిక్కడ ప్రధానంగా మూడు కావ్యనిర్మాణ నియమాలను గుర్తిస్తున్నాం: ప్రాముఖ్యత, సంయోగత, లయ. ప్రాముఖ్యతకు ఎక్కువ ప్రాధాన్యత యిస్తున్నందు వలన మనం దీనిని ప్రాముఖ్యతా సంప్రదాయం అందాం. పై మూడు నియమాలు కావ్యగతమైన అర్థానికీ, శబ్దానికీ కూడా వర్తిస్తాయి.

సాధారణంగా మనం మాట్లాడే విధానానికి భిన్నంగా ఏదో ప్రత్యేక ధోరణిలో నడుస్తుంది కావ్యభాష. ఈ ప్రత్యేకత భాషలోని కొన్ని అంశాలకు ప్రాముఖ్యతనిస్తూతద్వారా భావ ప్రాముఖ్యతను సాధిస్తుంది

మనం యిక్కడ 'వస్తువు','కావ్యవస్తువు', 'కవితావస్తువు' లకు మధ్య ఉన్న వ్యత్యాసాన్ని గమనిద్దాం శ్రీశ్రీ గారు 'ఋక్కులు'లో చెప్పినట్లు కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ, రొట్టెముక్క, అరటితొక్క, బల్లచెక్క, తలుపుగొళ్ళెం, హారతి పళ్ళెం, గుర్రపుకళ్ళెం మొదలైనవన్నీ కవితకు పనికి వచ్చే 'వస్తువు'లు. వీటిని 'కవితావస్తువు'లుగా మలచే వాడు కవి. తనకున్న 'కళ్ళ'తో చూచి వస్తువుల 'అంతు' కనుక్కొని, వాటిలో 'కావ్యవస్తువు'ను చూచు కొంటూ కవితావేశంతో 'రసనిర్దేశం' చేసి, కావ్య వస్తువుకు తన 'శిల్పం'తో 'శోభను'ను చేకూర్చి కావ్యాన్ని సృష్టిస్తాడు. కళ్ళంటే గుర్తొచ్చింది. దాశరథి రంగాచార్యగారు ఒకసారి నవలా సాహిత్యంపై ఉపన్యసిస్తూ— 'సాహిత్యం సమాజానికి దర్పణం వంటిది' అన్న నిర్వచనాన్ని ప్రస్తావించారు.

అది సబబు కాదని వారి అభిప్రాయం. దర్పణంలో మనకు లభించేది కేవలం ప్రతిబింబం. పైన దర్పణం జడవస్తువు. దానికి భిన్నంగా ''కవి సమాజానికి కన్నువంటి వాడు'' అన్నారు రంగాచార్యగారు. కన్ను అనడంలో జీవత్వం, సృజనాశక్తి, ఎన్నుకునే సమర్థత స్ఫురిస్తాయి. కన్ను తను చూడగలిగింది, చూడతగింది, చూడతలిచిందే చూస్తుంది. అన్నిటినీ చూడదు. దీనికీ ప్రాముఖ్యత అన్నదానికి కార్యకారణ సంబంధముంది. ప్రకృతానికొద్దాం. వస్తువు అందరికి అందుబాటులో ఉంటుంది కావ్యవస్తువు కవికి స్ఫురించిందైతే కవితా వస్తువు అతను మలిచింది. కావ్యంలో ఉన్న భావమే కవితా వస్తువు. మనం వస్తువు గురించి గాని, కావ్య వస్తువు గురించి గాని సంక్షిప్తంగా మాట్లాడగలం. కవితా వస్తువు గురించి అలా మాట్లాడలేం. కవితా వస్తువు గురించి సమగ్రమైన వ్యాఖ్య, రసచర్చ సాగించగలంగాని (కావ్య) వస్తువు వీడదగాదు 'కావ్యభాష'కు, 'కవితావస్తువు'కు ఉన్న సంబంధ బాంధవ్యాలను చర్చించడమే శైలి శాస్త్ర లక్ష్యం.

కావ్యంలోఉన్న ప్రాముఖ్యతను గమనించాలంటే కావ్యభాషను ప్రమేయ దృష్టి (Functional view point) తో చూడాలి. అందుకు కింది భాషా ప్రమేయాలను ప్రతిపాదించవచ్చు.

5 I (అ) అనుభవ ప్రమేయం
(ఆ) తార్కిక ప్రమేయం
(ఇ) వ్యవహార ప్రమేయం
(ఈ) వ్యక్తిగత ప్రమేయం.
II (ఉ) విషయ ప్రమేయం.
(ఊ) వార్తా ప్రమేయం.

ఈ ప్రమేయాలన్నీ వాక్య నిర్మాణంలో ద్యోతకమౌతాయి. భాషను ప్రమేయాల దృక్కోణం నుంచి పరిశీలించేటప్పుడు 'అభిహితత్వం' (Markedness) అన్న విషయం చాల ముఖ్యమైనది. ఒక వాక్యం గాని, వాక్యభాగం గాని ప్రత్యేకంగా ఒక విషయానికి అభిహితం అయి యుండవచ్చు. ఆ అభిహితమైన అంశం ప్రాముఖ్యతను పొందుతుంది. ఏ ప్రత్యేక అంశానికి అభిహితంకాని అనభిహిత వాక్యాలు ప్రాముఖ్యతను పొందవు. కింది వాక్యాలు గమనించండి :

6) ఆ పొట్టి పిల్లవాడు ఎవరు ?
అన్న ప్రశ్నకు కింది జవాబు లివ్వవచ్చు :

7 (అ) మా తమ్ముడు (+అండీ/ఏ/రామో॥)
(ఆ) ఆ పొట్టి పిల్లవాడు మా తమ్ముడు (+ ...)
(ఇ) ఆ అబ్బాయి మా తమ్ముడు (+...)
(ఈ) అతను మా తమ్ముడు (+...)
(ఉ) మా తమ్ముడు ( + ...) అతను
(ఊ) మా తమ్ముడు ( + ...) ఆ పొట్టి పిల్లవాడు
(ఎ) మా తమ్ముడు ( + ...) ఆ అబ్బాయి.

(7 అ) – (7 ఎ) వాక్యాలను భాషా ప్రమేయాలదృష్ట్యా పరిశీలిద్దాం. అనుభవ ప్రమేయం సంబంధించి నంతవరకు రెండు నామ బంధాలున్న వాక్యాల్లో (ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ) గుర్తింపబడ్డ నామబంధం (Identified), గుర్తించే నామబంధం (Identifier) ఉంటాయి. ఒకే నామ బంధమున్న దానిలో గుర్తింపబడ్డ నామ బంధం ఉండదు. తార్కికంగా ఈ వాక్యాలు అనభిహితాలుగా పరిగణించవచ్చు. వ్యావహారికంగా పై వాక్యాలన్నీ నిశ్చయార్థకాలు. (affir matives) వ్యక్తిగతంగా అనే పద్ధతినిబట్టి పై వాక్యాల్లో విసుగు, ఆసక్తి మొ॥ వానిలో ఏదో ఒక వైఖరిని సూచించవచ్చు. విషయ, వార్తా ప్రమేయాల దృష్ట్యా (ఆ), (ఊ) వాక్యాలను కింది విధంగా విశ్లేషించవచ్చు :

(ఆ) ఆ పొట్టి పిల్లవాడు / మా తమ్ముడు (+...)

| | | |
|---|---|---|
| విషయ : | విషయం | విషయి |
| వార్త : | ఉద్దేశ్యం | విధేయం |

(ఊ) మా తమ్ముడు (+...) / ఆ పొట్టి పిల్లవాడు

| | |
|---|---|
| విషయం | విషయి |
| విధేయం | ఉద్దేశ్యం |

(ఊ) అనే వాక్యం వార్తా ప్రమేయం విషయంలో 'అభిహితం.' సాధారణంగా రావలసిన 'ఉద్దేశ్యం–విధేయం' క్రమానికి బదులు 'విధేయం – ఉద్దేశ్యం' రావడం ఇక్కడ అభిహితం. వక్త విధేయాన్ని విషయస్థానానికి తీసుకురావడంలో దానికి ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నాడనిచెప్పవచ్చు. వార్తా ప్రమేయం సంబంధించి నంతవరకు విధేయం ముఖ్యమైన అంశంకాగా ఉద్దేశ్యం అముఖ్యమైనది. అందువల్లనే (7 అ)లో విధేయ మొక్కటే చెప్పినా వాక్యం సబబుగా తోస్తుంది. (7ఎ) వాక్యం విషయ ప్రమేయంలో కూడ అభిహితమే. 'విషయం' గుర్తింపబడ్డదైతే (ఉద్దేశ్యం) అది అనభిహితం అలాకాక 'విషయం' గుర్తించేదైతే (విధేయం) అది అభిహితం. అందువల్ల (7 ఎ) విషయాభిహితం.

పై విధంగా మనం మిగతా ప్రమేయాలలో గూడ అభిహిత వాక్యాలను గమనించవచ్చు. కింది వాక్యాన్ని గమనించండి:

(8) అతను నా మొగుడు.

పై వాక్యం ఒక తెలుగు చలన చిత్రంలోది. వక్త మగ వాడు. అతను ఇంకొక వ్యక్తిని 'మొగుడు'గ వర్ణించడం అనుభవ ప్రమేయంలో అభిహితం. అభిహితమైన కారణంచేత 'మొగుడు' అన్నమాట ప్రాముఖ్యత వహిస్తుంది. దానికి సాధారణమైన 'భర్త' సంబంధం గాక వేరొకటి అర్థంగా చెప్పుకోవాలి. పై వాక్యాన్ని తన మామగారు తనను ఆర్థికంగా పీడిస్తున్నాడని చెప్పదలచుకున్న అల్లుడుగారు అన్నారు. కింది వాక్యాలను పరిశీలించండి:

(9) (అ) అతను ఇంటికెళ్ళి భోంచేశాడు.

(ఆ) అతను ఇంటికెళ్ళిన తర్వాత భోంచేశాడు.

ఇక్కడ (9 అ) వాక్యం తార్కికంగా అభిహితం. (9అ)లో స్ఫురించే అర్థాన్ని (9 ఆ)లో 'తర్వాత' అన్నమాట స్పష్టం చేస్తూ 'ఇంటికెళ్ళడం, భోం చేయడం' అన్న క్రియలకుమధ్య ఉన్న కాల సంబంధానికి ప్రాముఖ్యతనిస్తుంది.

కింద సంవాదం గమనించండి :

10) మా వాడు దారి చూపిస్తాడు లెండి.
11) మీవాడు? (సరేలే ఇంక పోయినట్లే)
12) ఏం? మా వాడు చూపించలేడా?

(11)వాక్యం ఇక్కడ అభిహితం. ప్రశ్నార్థక 'ఆ' ప్రత్యయం చేర్చకుండానే స్వరమార్పుతో ఒక రకమైన ప్రశ్నవేశాడు వక్త. నిశ్చయార్థకరూపం, ప్రశ్నార్థక ప్రయోజనం ఇది ఇక్కడి అభిహితం. నిజానికి వక్త ప్రశ్న వెయ్యడంలేదు. తన అపనమ్మకాన్ని తెలియజేస్తున్నాడు.

అనుభవ ప్రమేయ అభిహితానికి ఇప్పుడు కావ్యాల్లోంచి కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కె. శివారెడ్డి అన్న యువకవి రాసిన మాటలు వినండి:

13) ''నాకో మగాడు కావాలి అంది
ఆమె పొట్ట చూపిస్తూ''
(''నాకో మగాడు కావాలి'' చర్య 1975)

పొట్టకు, మగాడికి ఏమిటి సంబంధం? ఇది అనుభవ ప్రమేయంగా చూస్తే సాధారణ పరిస్థితి కాదు. అప్పుడే మనం ఆగి ఆలోచిస్తాం. ధ్వన్యాత్మకంగా చెప్పని దాన్ని వింటాం. ఇలాంటి అభిహిత కారణంగా వచ్చిన ప్రాముఖ్యత కావ్యోత్పత్తికి దారితీస్తుంది. అలాగే సి. నారాయణరెడ్డిగారి మాటలు వినండి :

14) ''ఎటుల సైతును నేను
చటుల విరహాగ్నులను
ఎటుల ఈదుదు నేను
హేమంత రాత్రులను''
(''హేమంత విరహిణి''
నారాయణరెడ్డి గేయాలు, 1955)

''రాత్రులేమిటి? ఈదడమేమిటి? అంతా కవి పిచ్చిగాని'' అనవచ్చు మనం ఒక్కసారి ఆలోచించిచూద్దాం. 'ఈదుదు'కు బదులు 'గడుపుదు' అన్నారనుకోండి కవిగారు. పై మాటల్లోఉన్న కావ్యస్థితి అంతర్ధానమౌతుంది. ఇప్పుడు అనుభవ ప్రమేయాభిహిత కారణంగా మనకేదో ప్రాముఖ్యత గోచరిస్తోంది. ఇవి హేమంత రాత్రులు. ప్రియుడు (ప్రియురాలు) తాపంలో అరిచిన అరుపులో మూల్గిన మూల్గులో ఇవి. 'ఈదు' అనే క్రియలో చాల భావాలు ఇమిడి ఉన్నాయి. అడ్డంకి అన్నది మొదటిది. ఈ సందర్భంలో మనకు ముఖ్యంగా గుర్తొచ్చేవి నీళ్ళు. ఈదేవాడు నీళ్ళను పక్కకు నెట్టాడన్నది మనకు తెలిసిందే. రెండవ విషయం కాలగమన వేగం గురించి. ఎంత తొందరగా ఈదినా వేగం తక్కువేగదా! అలాగే విరహంలో ఉండేవాళ్ళకు కాలం నత్తగుల్లలా (తాబేలులా) నడుస్తుందన్నది మనకు తెలిసిందే. మూడవ విషయం 'తప్పనిసరితనం' నీళ్ళలో దిగినవాడికి ఈదవలసిన అవసరం ఉన్నట్లే ప్రేమలో పడ్డవాళ్ళకు హేమంత రాత్రులను విరహ వేదనతో గడపవలసిన అగత్యం స్ఫురిస్తోంది. నాల్గవ అంశం తప్పనిసరి తనంతోపాటు కవిలో (వక్తలో) ఉన్న సంకల్పం, కోరిక. ఈ కోరికతో ముడిపడ్డ వస్తువు లక్ష్యం. ఆ లక్ష్య సాధనకేగా అన్ని ఆటంకాలు ఓర్పుగా దాటి తన ప్రయాణం సాగించడం 'ఈదడం'లో ఉన్న దృఢనిర్ణయం, సంకల్పం 'గడపడం' లో కన్పించవు. 'గడపడం' లో కేవలం నిస్సహాయస్థితి కన్పిస్తుంది. 'విరహాగ్నుల' వెనువెంటనే 'హేమంతరాత్రులు' ప్రసక్తికి రావడం గూడ గమనించదగ్గ విషయమే. ఇందులో ఏదో 'తియ్యనిబాధ' ఉన్నట్లు తోస్తుంది. అందుకే పింగళి నాగేంద్రరావుగారు ''విరహముకూడా సుఖమే కాదా!'' అన్నారు.

'అభిహితం' అన్నది ధ్వనుల సహస్థితి (Cooccurrence) లోను, పదాల సహస్థితిలోను, వ్యాకరణాంశాల సహస్థితిలోను సాధించవచ్చు. అలాగే భావ నిర్మాణంలోను సాధించవచ్చు. వ్యాకరణాభిహితానికి ఉదాహరణకు కింది విషయం తీసుకోవచ్చు 'రాజమకుటం' అన్న సినిమాలో కథానాయకి ఒక పాట పాడుతూ బండి తోలుతుంటుంది ఆ పాట చివర కథానాయకుణ్ణి కలుసుకొంటుంది. ఆ పాటలో ''గండుకోకిల'' ''తుమ్మెదరేడు'' అన్న పుంలింగ నామాలకు క్రియాంతంలో ''ఉన్నాడా'' అని పుంలింగ ప్రత్యయం విధించబడింది సాధారణ భాషలో మానవేతర నామాలకు క్రియాంతంలో పుంలింగ ప్రత్యయం జతగా చేర్చరు. ఈ అభిహితరూపం కథానాయకుణ్ణి సూచించడంకోసం వాడబడిందని చెప్పవచ్చు ఈ 'అభిహితం' అన్నది మనవాళ్ళు చర్చించిన 'వక్రోక్తి'కి సన్నిహితం అన్నది వేరే చెప్పనక్కర్లేదు.

పైన చర్చించినట్లు అభిహిత కారణంగా ప్రాముఖ్యత సాధ్యమౌతుంది. వాక్యాల మధ్య ఉండే సమన్వయం (Cohesion) గూడ ప్రాముఖ్యతను సాధిస్తుంది. అంతేగాక కావ్యంలో 'సంయోగత' ను (Unity) పెంపొందిస్తుంది. పర్యాయ పదాలు వాడిగాని, సర్వనామాలు వాడిగాని కావ్యంలో ఒకే భావాన్ని పలుమార్లు ప్రతిపాదించాం అనుకోండి దానికి ప్రాముఖ్యత యిచ్చినట్లే. కావ్యాల్లో ముఖ్యంగా చిన్న గేయాల్లో, ప్రధానమైన భావాన్ని మనం పదాల సహాయంతో పసిగట్టగల్గితే మనకు (కావ్య) వస్తువు దొరికినట్లే. దానితో కవిగారి దృష్టి మనకు అవగతమౌతుంది. అలాంటిపదాలను ప్రధాన పదాలని గాని, సంగ్రహ పదాలని గాని అనవచ్చు. కావ్యంలో

సమన్వయం ధ్వనిపరంగాను, పదికోశపరంగాను, వ్యాకరణ పరంగాను సాధించవచ్చు.

ప్రాముఖ్యత సాధించేవిగా పైన 'అభిహితం', 'సమన్వయం' అన్న వాటిని గురించి చూచాం. కొన్నిచోట్ల ఈ రెండు అంశాలు కలిసే ఉంటాయి. సి. నారాయణ రెడ్డిగారి కిందిమాటలు వినండి:

(15) ''బియ్యంతో వియ్యమందే పలుగురాళ్ళు
పాలతో తాదాత్మ్యం చెందే పంపునీళ్ళు''
(''హే భగవాన్'' మధ్యతరగతి మందహాసం, 1968)

''వియ్యమందు'', ''తాదాత్మ్యం చెందు''అన్న రెండు క్రియలను గమనించండి. ఈ రెండు క్రియలకు ''కలియు'' అన్న అర్థంచెప్పవచ్చు. కాని పైపదాల్లోఉన్న ప్రత్యేకార్థాలు 'కలియు'లో లేవు. ఈ విషయంలో 'కలియు' అనభిహితం. 'వియ్యమందు', 'తాదాత్మ్యం చెందు' అన్నవి అభిహితాలు. బియ్యం రాళ్ళు కలిసినప్పుడు మనకొచ్చే కలయిక నిజమైన కలయికకాదు. అవి ఎప్పటికీ వేరుగానే ఉంటాయి. వియ్యంకుల మధ్య ఉన్న సంబంధం గూడ దాదాపు ఇటువంటిదే. పాలకు నీళ్ళకు ఉన్న సంబంధం వేరు. దానిలో పూర్తి ఐక్యత ఉంది. పాలు విరగడమో, మరగడమో జరిగితే తప్ప నీళ్ళు వేరయ్యే అవకాశం లేదు పైన వాడిన రెండు క్రియల మధ్య భావ వ్యత్యాసమున్నా కొంతవరకు పోలిక గూడ ఉంది గదా! అంతవరకు ఆ రెండు పాదాల మధ్య సమన్వయం కుదిరినట్లే. ఈ సమన్వయంతోబాటు కావ్య సంయోగతకు దారితీసే ఇంకొక గుణం గూడ ఈ వాక్యాల్లో కన్పిస్తుంది. దానినే మనవాళ్ళు ''సమత'' అన్నారు. పర్యాయపదంగా 'పొందిక' అనవచ్చు.

'సమత'కు మనవాళ్ళు యిచ్చిన నిర్వచనాలు చూడండి :

(16) ''మొదలిడి నప్పటి నుండియు ముగించు వరకును నొకే రీతి సమత'' (ఆంధ్ర రస గంగాధరం,)

(17) ''ఏ మార్గమున నుపక్రమింపబడెనో యా మార్గమును విడువకుండుట సమత''
(వామనుడు. కావ్యాలంకార సంగ్రహం, పే 532)

మన అవసరాలకు సరిపోవడానికి సమత (పొందిక) కు కింది విధంగా నిర్వచనం చెప్పుకొందాం :

(18) ''పదాల మధ్యగాని, పదబంధాల మధ్యగాని, వాక్యాల మధ్యగాని ఏర్పడే అను రూపత సమత.''

ఇప్పుడు పైన విశ్లేషించిన పాదాలను పరిశీలిద్దాం :

(15) బియ్యం తో వియ్యమందే పలుగు రాళ్ళు
పాల తో తాదాత్మ్యం చెందే పంపు నీళ్ళు

ప్రతి పంక్తిలో మనకు కనిపించే రూపాలొక్కటే :

నామా + విభక్తి + క్రియా బంధం + నామ బంధం
(నామం + క్రియ) (నామవిశేషణం + నామం)

ఈ విధంగా ఒకే నిర్మాణం పునరావృతమై నందువల్ల కావ్యంలో సంయోగత సాధింపబడుతుంది. సమత చాల రకాలుగా ఉండవచ్చు :

(19) (అ) పద సమత; (ఆ) భావ సమత; (ఇ) వ్యాకరణ సమత (ఈ) వర్ణసమత; (ఉ) స్వరసమత; (ఊ) అలంకార సమత; (ఎ) ఛందస్సమత; (ఏ) స్థాన సమత.

పై సమతల్లో రెండు సమతలు కలిస్తే 'పూర్ణ సమత' అని, రెండుకన్న ఎక్కువ సమతలు కలిస్తే 'పరిపూర్ణసమత' అని వ్యవహరిద్దాం. ఈ సమత పైనచెప్పుకొన్న సమన్వయానికి సంబంధించిన విషయమే. మన పూర్వులు సమతా గుణాన్ని అతిగా వాడగూడదన్నారు. అలా చేస్తే మనం సాధారణంగా చూచే శబ్ద చమత్కృత్కావ్యాలు తయారవుతాయి గదా!

'వర్ణ సమత'కు ఉదాహరణంగా కింది పద్య పాదాలను తీసుకోవచ్చు :

(20) పట్టు పట్టరాదు, పట్టి విడువరాదు
పట్టెనేని బిగియ పట్టవలయు
పట్టి విడుట కన్న పడి చచ్చుటే మేలు ॥వే॥

పై వేమన పద్యంలో ఓష్ఠ్య ధ్వనులు--ప, బ, వ, మ. మూర్ధన్య ధ్వనులు—ట, డ—పునరావృతమైనాయి. మూడు పాదాలలోను అఖరిధ్వని 'ఉ'. ఇందువల్ల పద్యం వర్ణ సమతద్వారా సాధించిన సంయోగతతోపాటు కొంతవరకు భావప్రాముఖ్యతను గూడ సాధించిందని చెప్పవచ్చు. మనవాళ్ళు ఛందస్సులో ప్రాస, యత్యాది నియమాలు గణ పాద నియమాలు ఎక్కువగా ఈ సమతాగుణ సాధనకే విధించినట్లు తోస్తుంది. త్యాగరాజుగారి పాట వినండి :

(21) పట్టి విడువరాదు— నా చెయి పట్టి విడువరాదు
పుట్టిననాడేని జభక్తి నిమెడ
గట్టి గుట్టు చెదరక బోచి చెయి ॥పట్టి॥
నిత్యా నిత్యములను బోధించి
కృత్యా కృత్యములను దెలిపించి
ప్రత్యేకుడు నీవని కనిపించి
భృత్యుడైన త్యాగరాజు చెయి ॥పట్టి॥

మొదటి మూడు పాదాలలో ప, వలు, ట, డ, లు, తర్వాతి నాలుగు పాదాలలో త,దలు పునరావృతమై వర్ణసమతను సాధించాయి. వర్ణాల నిర్మాణంలో ఒక నిర్ణీత స్థానంలో పునరావృతమైతే నిజమైన (పూర్ణ) సమత ఉన్నట్లు. లేకపోతే దానిని అర్ధ సమత గూడ అనవచ్చు.

'స్వర సమత' అనేది పాదాలను, పాద భాగాలను ఒకేరకంగా ఉచ్చరిస్తే ఏర్పడుతుంది. 'పదసమత' అనేది ఒకే పదం ఒకే అర్థంలో గాని వేర్వేరు అర్థాలలో గాని పునరావృత్తమైతే ఏర్పడుతుంది. భావం పునరావృత్తమైతే 'భావసమత' ఏర్పడుతుంది. ఈ భావం పదభావం గావచ్చు, వాక్యభావం కావచ్చు. అంటే పదభావ సమత, వాక్య భావసమత అని భావ సమత రెండువిధాలు. మొదటిది పర్యాయ పద ప్రయోగంతో సాధించవచ్చు. రెండవది వాక్య నిర్మాణ సహాయంతో సాధించవచ్చు వాక్య భావసమతలో భాగంగా పదభావ సమత ఉండవచ్చు. కింది గేయాన్ని పరిశీలిద్దాం:

(22) నను గన్న నా తల్లి నా వద్ద నుండ
వేరు తల్లికి నేనేల బిడ్డ నౌదు.
నను జూచు నా చెలియ నా చెంత నుండ
వేరొక్క వనితను నేనేల తలతు
నను బెంచి పోషించు నా పొర్ని వదలి
వేరు దేశము లేగి నేనెట్లు మనుదు
తియ్య దేనియ లొలుకు తెలుగు పలుకుండ
పొరుగూరి పలుకు పై ప్రేమేల నాకు
నా కట్టు నా బొట్టు నా మాట వదలి
వేరొకని ఆటలకు బొమ్మల నౌదు.

["నేను–నావారు" నయనశ్రీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక]

పై గేయంలో ఉన్నవి పది పాదాలు. 1, 3, 5, 7, 9 పాదాలు ఉన్న వానిని సూచించడం, 2, 4, 6, 8, 10 పాదాలు ప్రశ్నార్థకంగా పర నిరాకరణ భావాన్ని సూచించడం జరిగింది. ఈ భావ సమతకు తోడ్పడింది వ్యాకరణ సమత. ప్రతి పాదంలో మనకు వర్ణ సమత కన్పిస్తుంది 2, 4, 6, 8, 10 పాదాలు 'పర' ను సూచించే పదాలతో ఆరంభమై పద సమతను, భావ సమతను సాధిస్తూ పద భావ సమత సాధనకు దారి తీశాయి.

ఇక 'లయ' (నడక) గురించి. లయ సంయోగతకు దోహదకారి. రెండూ కలిసి ప్రాముఖ్యతకు దోహదం చేస్తాయి. ఈ లయ సాధన కోసం ఛందో నియమాలు తయారైనాయి. అంతేగాక శబ్దాలంకారాలు (వర్ణ స్వర సమతలు) లయ సాధనకు చాల వరకు తోడ్పడతాయి. ఛందస్సులోని ముఖ్య లక్షణాలు.

(23) (అ) పాదంలోని వర్ణబంధాలు (అక్షరాలు (Syllables)
(ఆ) గణ సంఖ్య;
(ఇ) పాద సంఖ్య.
(ఈ) లఘు గురు నిర్ణయం—వాటి సంఖ్య. స్థానం
(ఉ) మాత్రలు—వాటి నడక
(ఊ) వర్ణ సమతను సాధించే నియమాలు.

ఇక్కడ ఒక ముఖ్య విషయాన్ని మాత్రమే పరికిద్దాం. గణవిభజనకు పద రూపానికి ఉన్న సంబంధ మేమిటి? తెలుగు పదాదిన కొంత వరకు ఊనిక ఉంటుంది. దీనికీ, గణ విభజనకూ జత కుదరకపోతే నడక దెబ్బ తింటుంది. ఈ విషయంలో గిడుగు సీతాపతిగారు చక్కటి ఉదాహరణ ఇచ్చారు. (1936, పే, 527):

(24) 'నరుని/'నుద్ద/త'గతి/కి'రజ/ముగను
(5 సూర్య గణాలు)

అన్న పాదానికి సీతాపతి గారిచ్చిన మారు పాదం చూడండి.

(25) 'వరుని/'గొప్ప/'దశకు/'త్వరిత/గతిని

ఈ పాదంలో అర్థం మారలేదు, గణస్థితి మారలేదు, నడక మాత్రం మెరుగైంది. అలాగే—

(26) ||కన్ను/ల'కరువు/'దీర'గం/గ'గను/గొంటి||

అన్న పాదానికి వారిచ్చిన మారు పాదం గమనించండి.

(27) ||'గంగ/'గను గొంటి/'కన్నుల/'కరవు దీర||

ఈ సందర్భంలో మనం ఇంకొక విషయం గూడ ఆలోచించాల్సి ఉంది. ఛందోబద్ధ కవిత్వమైనా కాకపోయినా కాస్తో కూస్తో లయ బద్ధం కాకపోతే కవిత్వం మనకు సాధారణంగా రుచించదు. వచన కవిత్వం పేరులో చలామణీ అవుతున్న వానిలో చాలవరకు ఈ సహజమైన ఆవశ్యకతను గమనించకుండా పాదవిభజన చెయ్యడం జరుగుతోంది. కవిగారు చదివేటప్పటి విధానానికి పాదవిభజనకూ సంబంధం చాల తక్కువ ఎక్కువమంది వచన కవుల్లో. నేను ఇద్దరి ముగ్గురి కవులతో ఈ విషయం చర్చించాను. వాళ్ళు తమ పాద విభజన అర్థరహితం అని, లయ ద్యోతకకాలు కాదని ఒప్పుకొన్నారు. పాద విభజన చెయ్యకుండానే గద్య కవిత రాయవచ్చుగా. గద్యకవితకు, గేయ కవితకు మధ్యస్థమైన ఈ వచన కవితాదశ ఎట్టిది? పాదవిలువలేవి పంక్తులేమిటి? పాదరూపం ఇవ్వాలి అంటే లయ అవసరమన్నది వేరే చెప్పనక్కరలేదు.

సంక్షిప్తంగా మన ప్రాముఖ్యతా సంప్రదాయ మౌలికాంశాలు ఇవి :

(28) (అ) కావ్యనిర్మాణ నియమాలు మూడు—ప్రాముఖ్యత, సంయోగత, లయ. నిర్ణీతమైన ఛందస్సు ఉపయోగించకపోయినా లయ కుదరవచ్చు. కుదిరితేనే కవిత్వానికి శోభ చేకూరుతుంది.

(ఆ) ఈ మూడు నియమాలను పరీక్షించడానికి కావ్యాలను కింది అంశాలమేరకు అధ్యయనం చెయ్యాలి :

(1) ప్రమేయ ప్రాముఖ్యత; (2) సమన్వయం, సమత (3) అలంకారం, ఔచిత్యం (4) ఛందస్సు, లయ.

## ఉపయుక్త వ్యాస, గ్రంథావళి :


సూర్యనారాయణశాస్త్రి (1976) కావ్యాలంకార సంగ్రహ ఎం. శేషాచలం అండ్ కంపె

తిరువేంగళాచార్యులు ( ) ఆంధ్రరస గంగాధరం

Wilde, O (1921) Intentions London: Methuen & Co Ltd. XIV Edition, (First Published 1891)

Sitapati, Gidugu (1936) "Accent in Telugu Speech and Verse" Indian Linguistics 6 also IL Reprint Vol II (1965) 201–24


---

# స్థితి గతులు

శ్రీ చందు సుబ్బారావు

కవిత రాస్తున్నప్పుడు మనస్సు
కళాపెళా ఉడుకు తుంటుంది !

కథరాస్తున్నప్పుడు మనస్సు
కత్తి మెత్తగా కోస్తున్నట్లుంటుంది !

నాటకం విరచించేప్పుడు అంతరంగం
ఆటలో బంతిలా గెంతు తుంటుంది !

వైమర్శిక వ్యాస తరుణంలో చేతన
సమరాంగణంలో సాహస ప్రదర్శన —
క్షీరసాగర మథనంలా వుంటుంది చింతన !

రేడియో ప్రసంగం రాసేటప్పుడు మాత్రం
రోడ్డుమీద రోలర్లు దొర్లే శబ్దం !

రాయలేదుగాని సినిమాపాట —
బహుశా రాస్తే —

వేలికి తేలుకుట్టి
కాలికి నిప్పుకట్టి
నోట్లో 'ఫీసా' పెట్టి
తాపం అణిగేందుకు
'ఏసిడ్' నెత్తినోసుకుని
'ప్లాసిడ్'. గా ఉండాలి కామోసు మనిషి !

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

# కవితాకుంభ సంభవుడు

"నిజంగా అంతవాడే"—అని సర్వే సర్వత్ర నా మాటతో మాట కలుపుతారు ఆ ప్రతిభాశాలి కృతిని సాదరంగా పరిశీలించాక. ఆ ప్రతిభాశాలి దేవులపల్లి సోదర కవులలో అన్న సుబ్బరాయశాస్త్రి. అతని కృతి 'మహేంద్ర విజయము'. ఈ గ్రంథమును గూర్చి వ్రాసే ముందు గ్రంథకర్తను కూర్చి రెండు మాటలు వ్రాయవలసి ఉంది కనుక వ్రాస్తున్నాము.

దేవులపల్లివారు పీఠికాపుర సంస్థానాధిపతుల మన్నన లందు కున్న విద్వత్కవి రాజులు. రామశాస్త్రి, కృష్ణశాస్త్రి అనే పేర్లే వారి వంశీయులకు స్థిరాక్షరాలు. ఒక్కమారా 'మహేంద్ర విజయ' కర్తపేరు మాత్రం మారింది. ఈయన తమ్ముడు వేంకటకృష్ణ శాస్త్రి. ఇద్దరూ తాతగారివద్ద కాళిదాసత్రయంవరకు చదివి తదు పరి తండ్రిగారివద్ద నైషధాంతం, నాటకాలంకారగ్రంథాలు, తర్క ప్రకరణం, జ్యోతిశ్శాస్త్రములో కొంత భాగం అధ్యయనంచేసి తాత తండ్రులతో 'సమఉజ్జీ' అనిపించుకున్నారు.

★ ★ ★

1879లో శ్రీ మన్మాడభూషి వేంకటాచార్లవారు పిఠా పురాధీశుల దర్బారులో శతావధానం చేశారు. వారి ధిషణా వైభ వాన్ని చూసి మహారాజులుంగారు తనిసి తగిన పారితోషికమిచ్చి సభ్యుల నుద్దేశించి అన్నారట! మన కొలువులో ఈలాటి ప్రతిభా శాలురు ఉన్నారా? అని. అప్పుడొక సభ్యుడు లేచి 'శ్రీవారి ఆస్థాన విద్వాంసులు, దేవులపల్లి సోదరులు ఈ పనులకు సమర్థులుఉన్నారు అని చెప్పగ రాజావారు చంద్రంపాలెం కబురుపంపి వీరిని రప్పిం చారు. మర్నాడు సుబ్బరాయశాస్త్రిగారు అవధాన విధానం ఆచార్ల వారివల్ల తెలుసుకుని నిర్ణీత కాలములో నిర్దుష్టముగా శతావధానం చేశారు. అదిచూసి ఆచార్లవారే అబ్బురంపడినారట! ఆ అవధాన ములో ఒక పృచ్ఛకుడు అచ్చ తెలుగులో పద్యం చెప్పవలసిందని

'ద్రౌపద్యాః పాండుతనయాః
పతిదేవర భావుకాః
న దేవరో ధర్మరాజః
సహదేవో న భావుకః'.

ఈ శ్లోకం యివ్వగా సుబ్బరాయశాస్త్రిగారు చెప్పిన పద్యం నాటికీ నేటికీ సర్వత్ర ప్రశంసనీయం. ఆ పద్దెం ఈ క్రిందిది :

'జము కొడుకు కీడు పట్టియును
జన్నపు టొరెపు తేనికందు తూ
ర్పుమనియగని వెజ్జులకు
పుట్టినవారును బావగార్లు తేం
డ్లు, మఱదు లౌదు రైదుగురిలో
కడు చిన్నతడెన్న బావగా
డు, మఱదిగాడు పెద్దయతడుం
డగ ద్రోవది కెంచి చూడగన్'-



"పెద్దనాన్నగారు"!

ఉభయ భాషలలో నిర్దుష్టమైన పాండిత్యముండి అసాధా రణ మేధాశక్తి, కవితాశక్తి ఉండి నిదానంగా కూర్చుని వ్రాసేకవి పద్యం కూడా యింత హృద్యంగా ఉండదని అవధాన కవితా భీష్మాచార్యులు మాడభూషివారు మరి మరి మెచ్చుకున్నారీ కవితా సవ్యసాచిని. అప్పటి కీయన యువకుడు.

సుబ్బరాయశాస్త్రిగారి కృతులు అయిదారున్నాయి. వాటిలో మల్హణకృతి, శివస్తుతి, తెలుగుసేత, తెలుగుసేతగా కనిపించదు. అదే స్వతంత్ర రచనగా కనిపిస్తుంది. అలాగే మందపల్లి దేవుణ్ణి నుతించే మందేశ్వర శతకం పాపహరం.........

ఈ వ్యాసరచనకు ఆధారమైన 'మహేంద్ర విజయము' ఆరాశ్వాసాల మహాకావ్యం. దీనిలో మూడు, నాలుగు, అయిదాశ్వాసాలు తప్పక చదవవలసేవి. ఇంద్రుని సంపద్గర్వం, దానికి దుర్వాస శ్శాపం, శ్రీహరి కృపాతాప్తి, తిరిగి ఇంద్రుడు మహేంద్రుడై స్వర్గ రాజ్యాధిపతి అవడం - నీతిబోధకమైన కథాభాగమిది.

వ్యాసం కేవలం ఆ మహాకావ్యానికి పరిచయరేఖమాత్రం. వివరించి మరొకమారు : ఈ మహాకావ్యం చదివాక నాకు కలిగిన శబ్దార్థానుభూతినిమాత్రం ముందుగా చెప్తున్నాను.

గంభీరార్థ గర్భితమైన పదబంధముతో పాండిత్యానికీ, జాతీయతకూ పట్టంకట్టిన ప్రౌఢకావ్యమిది. అటు సంస్కృత సమాస గ్రథనములోగాని, ఇటు జాను తెనుగు కూర్పులోగానీ ఏలాటి వెలితీలేని లలిత గంభీర రచనా విన్యాసముతో గ్రంథమంతా ముద్దులు మూటకట్టింది.

మా అన్నగారు ప్రభాకరశాస్త్రిగారు ఏనాడో అన్నారు. 'పాండురంగ మాహాత్మ్యం' తరువాత మళ్లీ మహేంద్ర విజయం వంటి కావ్యం తెలుగులో రాలేదని.

అలాగే తూచినట్టన్నారు మా పెద్దన్నగారు శివరామశాస్త్రి గారున్నూ.

ఇక గ్రంథంలోకి వస్తా.

ఉపమాకాక్షేత్రం పిఠాపురానికి దగ్గరగా ఉంది. దానిని సుబ్బరాయశాస్త్రులవారు నిర్వచించిన తీరు ఎంత సొరుగా ఉందో చూడండి.

'ఉపమాకాస్య క్షేత్ర
స్య పృధివ్యా మనుచు విబుధులను కొంటజామీ
ఉపమాకాభిధనీది
వ్యపదంబు ప్రసిద్ధిగాంచె నంభోజభవా!

(ద్వి. ఆం. 119 ప.)

పృధివిలో ఈ క్షేత్రమును ఉపమా=సాటి,కా=ఏది (ఏదీ లేదు) అని విబుధులను కొనుటవల్లనే ఆ క్షేత్రం 'ఉపమాక' అనే పేరున ప్రసిద్ధి పొందింది.

ఏ విబుధులన్నారో మనకు తెలియదుగాని సుబ్బరాయశాస్త్రి గారు చక్కగా నిర్వచించారని ముగ్ధులమౌతాము. ఋతువుల వర్ణనలో ప్రబంధకవులు శివమెత్తినట్టు పలుకుతారు. శాస్త్రిగారు సహజగుణానికీ సరసకూ చోటిచ్చిన తీరు చూడండి.

'ఇచ్చు ఘనులుండిరని అప్పులిచ్చి వడసి
పొంగి పొరలిన సరసుల పొలపు తఱిగె -
మున్నుగల కీర్తిసారముల్ పోవనప్పు
డప్పలను రొప్పడిన మొప్పు ముప్పగాదె.

రెండవ ఆశ్వాసములో వేసవిని వర్ణించే పద్యాలులో ఇదొక రత్నం. దీనిలో 'అప్పుల' శ్లేషించి ఒక నీతి సారమును మానవ సమాజానికి చెప్పడం గ్రాహ్యం. ఈ చిన్నిగీతిలో 'ఘనులు, అప్పులు, సరసులు' అనే పదత్రయం శ్లేషించి అప్పు ఇచ్చే వారున్నారని ఇచ్చ వచ్చినట్టు తెచ్చి తలకు తగని వేషాలు వేసి అది కంఠదఘ్నం కాగా తీర్చుకోలేని దురవస్థకు చిక్కి ముమపున్న పేరు పెంపులు కూడా మాసిపోయి డప్పు కొట్టించుకోవలసి వస్తుంది - అనే గుణపాఠం సహజ రమణీయంగా చెప్పడం ... ఏమనాలి ?

ఇంకొక వర్ణన :— అదితి గర్భాన అంబుజనాభుడు వామనుడై అవతరించిన కథలో పురుటింటికి చేసిన రక్షా క్రియ

ఉల్లి పొట్లావాలు ఉముక రాజెడు పొగల్
గడపల పొదిగిళ్ల గ్రమ్ముకొనగ,
గుమ్మంపు పై వంక గ్రుచ్చిన పచ్చి భూ
తులసి మా బీరతో కలసి వ్రేల
పార్శ్వ ద్వయమునందు వ్రాసిన గోమయ
ప్రతిమల స్పష్టాంగ భంగి దోప
ఇంగువ పొంగింపు లెసగింప పొసగిన

కటు గంధ మెల్లెడ గడలు కొనగ
చమురు ముంచి వెలింగించి సంజనిడిన
దృష్టి దోషాల వేమిడి తెట్టెలలర
కాపు గూర్చిన తత్సూతికా గృహంబు
నాగ్రహంబున నే గ్రహం బావహించు

(చతుర్థ. – 124 ప.)

శిశువుకి, నవ ప్రసూతకూ దుష్టగ్రహ పీడ సోకని విధంగా పల్లెల్లో ఈలాటి రక్ష ఏర్పాటు చేస్తూ ఉండడం కద్దు. ప్రస్తుతం ఆస్పత్రులూ, నర్సింగ్ హోములూ పురుటిళ్లు అయిపోతూ ఉండగా సూతికా గృహ రక్ష కల్పించవలసే ఆవశ్యకత లేకపోయింది.

ఇక 'బాలసారె' అయిన తరువాత ఆ పచ్చి బాలెంతరాల్పైని అదితిని వర్ణించిన పద్ధతి ఎంత ముచ్చటగా ఉందో చూడండి.

'నడికట్టు బిగియించిన చెఱంగు సరిక్రొత్త
చీరలో సంధిట శిశువుం బొదివి,
ఆపాద మస్తకంబైన క్రొంబసుపు ని
గ్గుల పచ్చిమేను సంకోచపఱిచి,
అలసాంఘ్రి విన్యాసముల పెద్దలున్న చ
క్కటి కెల్ల నెల్లన గడచి నడచి,

మనుమని మీ చిన్ని మనుమని దీవింపు
డని వారలకు నాత్మ తనయుఁ జూపి

భర్తయను పద మా సాధ్వి బాలసారె
పందిట జరింప మునులు దేవతల తతులు
వెతలడగి నింక ననుచు సమ్మతుల నతుల
గతుల వన్నించి రామె సన్నతుల నుతుల'.

(చతుర్థ – 127 ప.)

బాలసారె పీటల మీంచి లేచి భర్తవెంట అదితి పాలపాపణ్ణి ఎత్తుకుని పెద్దల కడకు వెళ్ళి కొడుకుని దీవించండని కోరుతూంది. ఆ బాలింతరాలి నడికట్టు ఆపాదమస్తకం క్రొంబచ్చి పసుపు పూత, మందగమనం, సరికొత్త చీరలో పందిట శిశువునుపొదివి ఎత్తుకొనడం కనులకు బొమ్మకట్టుతూన్నట్టుంది. 'మనుమని'—మనుము + అని వర్ధిల్లుమని మీ చిన్ని మనుమని దీవింపుడని అవృత్తమైన శబ్దాలంకారము శాస్త్రిగారి రచనాశక్తికి సహజాలంకారంగా భాసించింది. నేటి బాలెంతరాళ్ళు ఎంతమంది పసుపు పూసుకుంటున్నారో — పసుపు పూసుకోడం అసహ్యమైన పని వాళ్ళ దృష్టిలో. కాల మహిమ !... సనాతన సుమంగళాచారాలకు వాతలు పడుతున్నాయి.

మొదటి నెలలోనే శిశువును తొట్టెలో పెట్టడం, కప్పకు మొక్కించడం, ముత్తైదువలకు వాయనా లివ్వడం గృహస్థ సంప్రదాయం. ప్రస్తుత పరిపక్వ నాగరక దశలో ఇవి 'మూఢనమ్మకాలు.'

అదితి ముసలి ముత్తైదువ కనుక ఆ 'మూఢాచారాలు'. పాటించింది.

'నెలలో నొక్క సువాసరంబున
పురంధ్రీశ్రేణి సంప్రీతి పా
టల బిల్పించి కడంకమై నదితి పట్టం
దొట్లలోఁ బెట్టి జో
లల బాడించి యుదంచన గ్రహణ
లీలా కౌతుకా చారముల్
వెలయం గప్పకు మ్రొక్కి వాయనము
లిప్పించెన్ సమంచద్గతిన్'. (129)

శిశువు పుట్టిన ఇరవై ఒకటవ రోజునసాయంకాలం ముత్తైదువలను రప్పించి శిశువును తొట్టెలో పెట్టి జోలపాటలు పాడుతారు. తరువాత ఆ బాలెంతరాలిని పెరటిలో ఉన్న నూతి దగ్గరకు తీసుకుని వెళ్ళి మంటితో మూడు కప్పలు చేసి ఆమెచేత మూటికీ పూజ చేయించి మూడు తాంబూలా లిప్పిస్తారు. కాయపు ఉండ ఒకటి నైవేద్యం పెట్టుతారు. ఒక కప్పను బాలెంతరాలు దోసిటలోకి తీసుకుని 'నా కొడుకు నీలాగే దాట్లు వెయ్యాలి పాములాగా ప్రాకాలి' అని నొసటకి హత్తుకుని నూతిలో వేస్తుంది. అలాగే మిగిలిన రెంటినీ వేయిస్తారు. నైవేద్యం పెట్టిన కాయపు ఉండను పిల్లలు కలగడం ఆలస్యం అయిన ఇల్లాలిచే మింగిస్తారు. అలాచేస్తే సంతతి కలుగుతుందని విశ్వాసం. నూతి దగ్గర ఆచారం అయ్యాక పెరటి గుమ్మం దగ్గర బాలెంతరాలిని నిలిపి ఒక తలుపు మూసి లోపల ఆడపడుచుగాని, అత్తగారుగాని, కడకుతల్లిగాని ఉండి భర్త పేరు మూడుమార్లు చెప్పించి లోనికిరానిస్తారు. తరువాత అందరూ తాంబూలాలూ, నానవేసిన క్రొమ్ముసెనగల వాయనమూ అందుకుని బాలెంతరాలినీ, శిశువునూ దీవించి తమ తమ ఇళ్ళకు వెళ్ళతారు. కప్పకు మొక్కడం అంటే ఇది. నాకు తెలిసినంతవరకు విశాఖ, శ్రీకాకుళ మండలాలలో నడిచే ప్రాచీనాచారం ఇది. ప్రస్తుతం ఈ ఆచారం ఆ మండలాలలో మారుతున్న మహిళా లోకములో మారిపోయిందో, జారిపోయిందో తెలియదు.

షష్ఠాశ్వాసం చక్కని కథల కాటపట్టు. దానిలో కుకుటేశ్వరుని అవతారగాథ బహువారం పఠనీయం. వేంకటరమణుడు, రాముడు అద్వైత భావనతో ఉపాసించదగినవారని శాస్త్రులుగారు ఉపదేశించారు.

'తన్మహో మంత్రమున కధి దైవతంబు
రాము డీతడు వేంకట రమణు డనుచు
భేద మెంచకు మాతడు విభవమూర్తి
తలహగ నీత డర్చావతారమూర్తి'.

'కలౌ వేంకటనాయకః' ప్రత్యక్ష దైవంవేంకటరమణుడు. రామునకు వేంకటరమణునకూ భేదంలేదు. రాముడు విభవమూర్తి. వేంకట రమణుడు అర్చావతారమూర్తి. విగ్రహ రూపములో అర్చ లందుకుని అర్చకుల అభీష్టములను ప్రసాదించి, ఆదుకునే దైవం అర్చావతారమూర్తి. వేంకటేశ్వరుని పని అదే. ఈ దైవ రహస్యమును నారదుని నోట చెప్పించారు శాస్త్రులవారు.

ఈ ఆశ్వాసములోనిదే బ్రహ్మరాక్షస్సు కథ బహువిచిత్రంగా ఉంటుంది. ధూర్జటి శర్మ అనే బ్రాహ్మణుడు బ్రహ్మరాక్షసుడై అడవిలో ఒక రావిచెట్టు నాశ్రయించి ఉంటాడు. వాడికి నారదుడు చేసిన తారక మంత్రోపదేశం వల్ల పాపవిముక్తి అవుతుంది. ఏరుదాటి తెప్ప నేర్చిన చందాన ప్రవర్తించిన మూర్ఖుడు 'ధూర్జటి శర్మ' ...

ఈ గ్రంథం ఐహికాముష్మిక మార్గదర్శి అని అనడానికి ఎవరూ సందేహింపరు. సలక్షణంగా వ్యాఖ్యానించ దగిన బృహత్కావ్యం. చక్కని సంస్కృతం, చిక్కని జాను తెనుగూ పోటీపడి రూపొందిన దివ్యకథా సంహిత ఇది.

శాస్త్రులవారు శ్రీరామభక్తులు కనుక సర్వ శుభలక్షణ ధన్య అయిన ఈ కావ్య కన్యను శ్రీరామున కర్పించి సీతమ్మకు ఒక చక్కని సవతిని సంఘటించారు. అయితే, ముద్దరాలైన ఈ కృతి కన్య ముద్దుగా మాటాడుతూ ఆమెను అనుసరిస్తుందేగాని జాణ కాదు. కనుక ఆ తల్లికి 'సవతి పోరు' లేదని గట్టిగా చెప్పవచ్చు

# వెలుగు

## శ్రీ వాకాటి పాండురంగరావ్

**And the God said :**
**Let there be light**
**And there was light.**

అతడు బాగా వెనక్కు జరిగి, నిల్చుని చూచాడు.
ఇంకో మూలకు వెళ్ళి చూచాడు.
ఆ చూడడం మామూలు చూడడం కాదు.
ఒళ్ళంతా కళ్ళయి చూడడం.

చిన్న సవరణ అవసరమనిపించింది.
కుంచెను చేతిలోకి తీసుకున్నాడు.
ఊదారంగులోకి ముంచి తీశాడు.
ముందుకు నడిచాడు.
చిత్రం దగ్గరగా వెళ్ళాడు.
ఆ మూలగా—ఆ పసుపు ఎరుపులు కలిసిననోట
కొద్దిగా అద్దాడు.

మళ్ళీ దూరం నుంచి పరిశీలించాడు.
పరిశీలిస్తూ నిలబడ్డాడు.
పంచేంద్రియాలతో చూస్తూ నిలబడ్డాడు.
అక్కడే నిలబడే వున్నాడు

అతడక్కడ వుండగానే, హఠాత్తుగా అతన్లోంచి అతడే లేచి
తేలుతూవెళ్లిఆవిశాలమైన వర్ణచిత్రాన్ని కౌగలించుకున్నాడు.
ఆ రంగుల మీద మోహాన్ని ఆనించి కళ్ళు మూసుకున్నాడు.

అది తన గర్భం
అది తన హృదయం.
అది తన మనోకోశం.
అందులో సాక్షాత్కరించిన శిశువు ఆ చిత్రం.

ఆ నాడు, ఆ మొదటి నాడు —
తనకీ తెలియని ఏదో సంయోగం తన లోపల [illegible]—
ఏ స్పెర్మో ఈదుకుంటూ ఏ దిగంతాలకీ వెళ్ళి
ఓవంతోనో లీనమయిందని —

తెలియని ఆనాడు —
ఆ మొదటి నాడు -
లో లోపల
తన లోపల
ఏదో ఏదో కదులుతుండడమే తెలుసు.
కొంత కాలానికి అది తానే అయినా తానుకాదనీ
అయినా తనదేనని
తాను దానిదేనని తెలుసు

తల్లిగా ఆ బరువు ఇంకెవరికెలా తెలుస్తుంది
తన కొక్కరికే తెలుసు —
ఆ చైతన్యం ఇంత దింతయ్యి
అల్లంతయ్యి

రూపులు సంతరించు కుంటున్న క్షణాలలో
రేఖలు దిద్దుకుంటున్న యుగాలలో
అబ్బా ! అదేమిటది ఆ బరువు ?
ఆనందం బరువా ?
బరువైనది ఆనంద మెలా అవుతుంది ?
బరువుకాదది, తన అశక్తత, బలహీనత
ఆనంద మయాన్ని మోయలేని అనామియా...

అప్పటికప్పుడే, ఆ వెను వెంటనే
ఆ ఆనందాన్ని దించాలని, అందించాలని, అందుకోవాలనీ
దాన్ని--ఇది అని చెప్పాలని, కుదించాలని, చిత్రించాలని
వెదుకాడగపోతే
గాలమే మిగిలింది; ఎదురుతిరిగి గుండెలోకి చొచ్చుకుంది

అయ్యో ! ఏమయిం దేమయింది ...
నా ప్రాణం—నా పాప—నా జీవం--నా నావ—నా సర్వస్వం
ఏమయింది, ఎటుపోయింది !
అమ్మయ్య ... లేదు ... పోలేదు.
అదిగో కదలు తున్నది.
ఉంది. ఎక్కడికీ పోలేదు. తనలోనేవుంది

దాని లోపలే తనూ —
అది లేని తాను,
వేణువుకాదు—వెదురు ముక్క !

— మరయితే నా పాపా !
నా చిట్టి తల్లీ ! బంగారు తండ్రీ !
ఎన్నాళ్ళమ్మా ఈ దాగుడు మూతలు ?
ఎన్నాళ్ళయ్యా ఈ మన వియోగం —
నా కంట పడవా ?
నా ఎదుట నిలవవా ?

నా చేతులార నిన్నెత్తుకుని, ఎగరేసి, ముద్దుపెట్టుకుని
నీకు తలంటిపోసి, బంగారు మొలతాడూ పట్టుదట్టీకట్టి,
కాటుక రేఖలు దిద్ది నిన్ను నా ఎదలోకి పొదువుకునేదెన్నడు?

ఎన్నడమ్మా ఎన్నడు ?
నేను యశోదనై నువ్వు కిష్టుడై
నువ్వు ఏసువై నేను మేరీనై
తనివితీరా ముద్దాడే దెన్నడు ?
ఆర్తితో ఆబతో తపనతో తాపంతో
కొట్టుకులాడగా ఆడగా

ఆ భావానికి ఆ రూపానికి
నవరసాలూ నిండాక,
అ౦ దశ దిశలూ వ్యాపించాక
'తదన్త రస్య సర్వస్య
తదు సర్వసాస్య బాహ్యతః' — గా అయ్యా!

ఒక పట్టపగలు, మిట్టమధ్యాహ్నం
కటిక చీకటయింది.
కడుపులో ఫ్యూజియామా ఎగసింది.
హృదయంలో 'బాస్టిలా' బద్దలయింది.
సహస్రారం ఒక్క పాదం పైకెత్తింది.

శివతాండవమట !
శివా లాస్యంబట !
ఓహో హో ...

వేదన
ఆవేదన
మనసు పేగులు తెగిపోతున్న కోత —

దారి తెలియని గుడ్డివాడి ఆందోళన —
మాటలురాని మూగతనపు ఆక్రోశం —
అంతరాంతరాలలో బడబానలం —

ఆ చీకటిని చించుకుని హఠాత్తుగా ఒక మెరుపు
ఆ హాలహలపు భుగ భుగల మధ్య అమృతకలశం —
నేను మరణించాను.
ఆ చిత్రం పుట్టింది.
ఆ చెమట అలసట
ఆ కష్టం సుఖం
ఆ మరణం ప్రసవం
— నా మనసు పొత్తిళ్ళల్లో అరుణోదయం

'ఇదమ్ ఉత్యత్ పురుతమం పురస్తాజ్
జ్యోతిస్తమో వయునా వదస్తాత్
న్యూనం దివో దుహితరో విభాతిర్
గాతుం క్రణవణ్ ఉషసో జనాయ'.

— అనుకుంటున్న అతడి కనుల వెంబడి అశ్రువులుజారి
జాలువారి నేలతల్లితో ఊసులాడుతున్నాయి,
నిండుగా నెమ్మదిగా బరువుగా
కదిలాయి అతడి పాదాలు.
హాయైన సన్నటి పట్టుదారం లాంటి స్వరాన్ని తెచ్చి
గాలి అతడి మనసుకు ముడివేస్తోంది.

ఆ స్వరం చూపిన వెలుగు సాయంతో
ఆ హాలుదాటి, వసారాదాటి
వరండాదాటి మెట్లుదాటి
జాజి పందిరి దాటి జామచెట్లుదాటి
చామంతులూ మందారాలూ దాటి
వెళ్ళితే —

అక్కడ
పారిజాతం చెట్టు క్రింద
అరుగు మీద
కూచుని
కళ్ళు మూసుకుని
పాడుతూంది
ఆమె !
వీనులవిందై
అమృతపు సోనల పొందై

పరమానందాను సంధానమై
పరుగెడుతూంది
ఆమె పాట
ఆ పాట ...

పారిజాతాల్లాంటి
పాపాయి నవ్వుల్ని
మెరుపు దారంతో కట్టి
ఒక దివ్య మంగళ భావ మూర్తికి
మాల వేసినట్లు ...

అలనాడు
కల్యాణవేళ
తలంబ్రాలు పోస్తుండగా
ఇలి మేలి ముత్తెములా —
నా జానకి నునుసిగ్గు దొంతరల చాటు దరహాసాలా
అని ఆలోచించిన
రామయ్య అంతరంగంలోని
ఆనంద తరంగాలట్లు ...

**When the morning stars**
**Song together and**
**all the children of God**
**shouted for joy** — అన్నట్లు

ఆ పాట సాగి సాగి
ఆకారాన్ని కోల్పోయి
శబ్దమై, సాగరమై
అనంతమై
కెరటమై
కేరింతయై
గరుత్మంతుని రెక్కల సవ్వడై
ఆకాశమే అయిపోగా

— పాడుతూంది ఆమె ...
ఆమె పాదాల దగ్గర
అరుగుకు జేరగిలబడి కూచున్నాడు
అతడు

అరెరె !
— ఇదేవిటి

తానిన్నాళ్ళు, ఇన్నేళ్ళు
కష్టించి, మోసి, చచ్చి, ప్రసవించి, బ్రతికిన
చిత్రాన్ని
ఈవిడ పాడుతూందేవిటి !

— కాదు కాదు
తానే ఇన్నాళ్ళు అదిపాటని తెలియక —
దాని స్వరూపం తెలుసుకోలేక —
చిత్రించబోయి
రూపం అందక
రంగులు తెలియక
కేన్వాస్ నిలవక
బాధపడ్డాడేమో ...

మనసు లోలకమైంది.
లోలకం బిందువైంది.
బిందువు నాదమైంది.

— ఆమె పాడుతూంది.
అతడు కూచునే వున్నాడు
ఆ పాటల తాళానికి
నాట్యం చేసి చేసి
అలసిన పారిజాతాలు
అప్పుడోటీ
అప్పుడోటీగా
వారిమీద వర్షిస్తున్నాయి

**So God created man in his own image**
**Male and female created he them !**

ఎన్నో జన్మల తర్వాత,
ఆ పాట ముగిశాక
రంగుల హరివిల్లు చేత పట్టుకుని ఆమె —
అనంత కోటిశబ్దాలను మింగిన నిశ్శబ్దాన్ని చేతగాలించి అతడు

వారిద్దరూ
వారిధి తెల్ల జరీ అంచుమీదుగా
నడుస్తున్నారు

గలగలమని మాట్లాడుకుంటున్నారు
వాళ్ల పెదవులు నిశ్చలంగా వున్నాయి
సముద్రపు తరంగాలు తరంగమభినయిస్తున్నాయి

పక పకమని నవ్వుతున్నారు
ఆ నవ్వులు ఎగిరి ఆకాశం చేరుతున్నాయి
నక్షత్రాలై కూచుంటున్నాయి

అతడి కళ్ళల్లో ఆనందంచూచి
ఆమె
అటుచూస్తే—చందమామ!
సాగరకన్య పరిచిన వెండి తివాసీల మీదుగా
నడిచి రావడానికి సమాయత్తమౌతున్న
ఆనాటి నా వోడు సెందురూడు—
ఆ చంద్రుడే ఇక్కడా, ఇతడిలోనూ!!

విరబూసిన మల్లె పొదలో ఆమె
ఆమె వదనం వాకిట
ముంగురులతో గాలి పెడుతున్న
ముగ్గుల్ని చూచాడు అడుత
చూచి
అటు చూస్తే
చంద మామ కడ్డంగా
మబ్బుల పీలికలు!

అందలంమీది ఆ చందమామను తా నందుకోలేనని,
ఆ సువిశాల దిఙ్మండలాన్ని తాను పొదివి పట్టుకోలేనని,
ఆ ఆకాశాన్ని చేరుకోలేనని
ఆ గాలిని ఆక్రమించుకోలేనని
అదంతా ఆమెగా
తన దగ్గరగా
తన పక్కగా ఆమె

చెట్టాపట్టాలేసుకుని వాళ్ళిద్దరూ
నడకలతో పరుగెడుతూ,
సరుగులతో నడుస్తూ
తూలుతూ, వాలుతూ
తడబడుతూ, పడబోతూ

—"తత్రైకస్థం జగత్కృత్స్నం
ప్రవిభక్త మనే కధా
అపశ్య ద్దేవ దేవస్య శరీరే ..."—

—నీరూ నేలా కలిపిన అంచు మించి వెళ్తుంటే,
—ఆకాశం నేలను తాకేచోట వెండి మెరుపులు మెరుస్తుంటే
—గాలి నీటిని కితకితలు పెట్టగా ఆ సరసానికి కడలి
శత సహస్రకోటి తరంగాలై పొంగుతుండగా,
నీరు చల్లగాసాగి తన సుదీర్ఘ బాహుశ్రేణితో
భూకన్యను వెచ్చగా కౌగలించి
ఆమె మోవిని చుంబించగా

ఆకాశం
నేల
గాలి
నీరు
— అన్నీ కలిసి
ఒక
మహాద్భుత వర్ణచిత్రంగా
నిశ్శబ్ద శబ్ద కావ్యంగా
అతిలోక మాధుర్యగానంగా

అయిన
అక్కడ
అతడు
ఆమె!

ఇద్దరు కారువారు, ఒక్కరే...
ఆ ఒక్కరూ ఏరీ?
అణువంతయినా లేదు నీడ
అంతటా వున్నది వెన్నెలే!
ఉన్నదంతా వెలుగే...
పూర్ణమదం... పూర్ణమిదం
నికిల సృష్టికి అది
నిండు పూర్ణిమ!!



శ్రీ కె. వి. రమణారెడ్డి

# "జగద్ధితంబుగన్"*

"నిత్యసత్యవచనుడు" అని చెప్పుకున్నాడు గనుక నన్నయభట్టుకి ఆత్మస్తుతి దోషం అంటగట్టకూడదేమో ననుకుంటే, "నిత్యసత్యవచనుడు" అనడంలోనే ఆత్మస్తుతి ఉందాయె! యిందరికాళ్లకు బందం వెయ్యడమంటే ఇలాంటిదే కాబోలు! లేక, ఉన్నమాట అన్నాడని అనుకోవాలా?

నన్నయ్య మాటలను ప్రత్యక్షర సత్యాలని ఒప్పుకోవలసివస్తే ఆయన "అవిరళజపహోమ తత్పరుడు", "సత్యమర్యాదిపాచార్యుడు", "నానారుచిరార్థ సూక్తినిధి".

ఇవన్నీ అసత్యాలని యెందుకనుకోవాలిగాని తన గురించి తానే నిజమే చెప్పుకున్నా వినడానికి కాస్త యెబ్బెట్టుగా వుంటుంది. అన్నదాత గనక రాజరాజుని "రాజకులైక భూషణుడు" అనీ మరొకటనీ ప్రశంసించడం ఓమోస్తరు. "అన్యరాజ తేజో జయ శాలి" అనే మాట మాత్రం రాజరాజుపట్ల చారిత్రక సత్యమని అనిపించదు. అయినా కవులకూ — ముఖ్యంగా తెలుగు కవులకు — చారిత్రక యధార్థతకూ యెప్పుడు సరిపడింది గనుక? చోళ, [పశ్చిమ] చాళుక్యుల కాలి తాపులకు బంతిలా సింహాసనంనుంచి ప్రవాసానికీ, ప్రవాసంనుంచి మళ్లీసింహాసనానికీ బుడబుడ దొర్లుతూ దినదిన గండంగా పాలన సాగించిన [తూర్పు] చాళుక్య — చోళ రాజు, పేరుకు మాత్రమే రాజరాజు. అదీ తాతగారి దొడ్డపేరు కాబట్టి సరిపోయింది. లేకుంటే సార్థకతాభావానికి గొప్ప లక్ష్యంగా నిలిచేది. దిగ్విజయం చేశారనే పాండవుల దాకా ఎందుకు, నిజంగానే దిగ్విజయం సాగించిన రాజరాజచోళుడు తన కూతురి బిడ్డనీ, రాజేంద్రచోళుడు తన అప్పచెల్లెలి పట్టినీ చూసి 'సిగ్గొట్లు! సిగ్గొట్లు!' అని వుండక తప్పేదికాదు. శాంతికాల విజయాల మాట మరొక తీరేమోగాని యుద్ధ విషయంలో మాత్రం ఇతగాడు శుద్ధ పూజ్యుడే.

మరి 'అకటావికటపు రాజుకు వుపాదానం మంత్రి' అన్నట్టుగా గాక, రాజరాజుకు నన్నయ్య "అనురక్తు"డు, "కుల బ్రాహ్మణుడు" అనురక్తుడు గనకనే, "భారతార్థమేర్పడ నిరూపింపుము" అన్న రాజాజ్ఞకు, "నా నేర్చుకొలంది యిక్కావ్యంబు రచించెద" నని విధేయుడయ్యాడు రాజుతోబాటు ప్రజలుకూడా తరించేందుకు "పంచమ వేదమునా నొప్పు" మహాభారతాన్ని తెలుగు చెయ్యడానికి గంటం పట్టాడు. "జగద్ధితంబు" లో ఉన్నది యీ రెండో లక్ష్యమే.

"ఆయన లక్ష్యము ఒకటే: ఆంధ్రజాతికి ఇది యొక ఆత్మీయ గ్రంథము కావలెను. ఈ భారతకథ వారి నీతి ధర్మనిష్ఠను కర్తవ్యపరాయణతను తీర్చిదిద్దవలెను...." (సారమతి నన్నయ, పు. 8)

'భారతం బొంకు' అనుకునే తెలుగు 'జాతి' యొక్క "నీతిధర్మనిష్ఠ" ను తీర్చిదిద్దేందుకు, "ధర్మాద్వైతస్థితి" (తిక్కన మాట) ప్రబోధించే భారతాన్ని కృష్ణద్వైపాయనుడే "లోకహిత నిష్ఠంబుగాని కావించె". దాన్నే నన్నయ తెలుగు చెయ్యడమూ "జగద్ధితంబు" కోసమే.

"ఆవేశపూరితములగు క్రొత్త మతములకంటె సనాతనమును, వర్ణాశ్రమ ధర్మ సమ్యగ్విభక్త సోపానక్రమ విలసితమును సమతాభాషితమును అగు వైదిక మతమే ప్రజావళికి ఎప్పటికైనను సుఖశాంతుల నిచ్చి పరిరక్షింపగలదను నమ్మకము" తిక్కన కున్నట్లే నన్నయకూ ఉండేదని శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి నిర్ణయం. ఈ వైదిక మతానికి 'పెట్టుగొమ్మ అద్వైతభావన'. (అదే, పు. 31)

సనాతన మనడం సరైన మాటేనా? "ఆవేశపూరితము" అయిన వీరశైవానికి మూలాలను వేదయుగం కంటె పూర్వమే కనుగొనవచ్చునేమో! దాని నటుంచినా, ఆది వైదిక మతానికీ, ఉపనిషత్ యుగ మతానికీ భేదమే లేదా? దీన్నీ అవగణించినా, "వర్ణాశ్రమధర్మ సమగ్విభక్త సోపానక్రమ విలసితము" అనడంలోనే ఏ మతమైన సరే "సమతా భాషితము" కాజాలదని అర్థం కాదా? కింది మెట్టూ పైదిమెట్టూ రెండూ మెట్లే నన్నంత మాత్రాన, కిందు మీదులకు 'సమత' ప్రాప్తించదు గదా! పైగా, ఇవి మనుష్య సమూహాల వర్గీకరణకు సంబంధించిన సోపానాలు కావడాను అట్టడుగున వున్న వర్ణం (నిజానికి వర్ణమే కాదు) మూపున ఒకటి, దాని మూపున మరొకటి, ఇలా నిశ్రేణిలా ప్రాచీన వర్గాలైన వర్ణాలను రూపొందించడం, నిమ్న వర్ణానికి, వర్ణానికి పై వాటిలో 'సమత' ను పొసగించదు. 'అస్పృశ్యుల' నటుంచినా, చతుర్థ వర్ణానికి ఇవి "సమతా భాషితము" ఒక నాటికీ కాదు. కాబట్టి "ప్రజావళి"కి "సుఖ శాంతులు" ఇందులో లేని విషయాలు. "ఆవేశ పూరితము"లయిన వీరశైవం ఈ విషయంలో "సనాతన" "వైదిక" మతానికంటే మేలు, చతుర్థ వర్ణానికే సేవాధర్మం పరమోద్ధర్మం కాగ, అవర్ణుల, అస్పృశ్యుల మాట వేరే చెప్పడమెందుకు? ఉన్న స్థితిలో సంతుష్టి చెంది, ఉన్న

---

* శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి 'సారమతి నన్నయ' చదివాక, 14-1-1977 న హైదరాబాదు జైలులో రాసింది.

చోటే పడివుంటేతప్ప, మనసు సుఖించదు, శాంతించదు. అందు చేత యథాస్థితిని మతముద్ర వేసేందుకే వర్ణ ధర్మం[1] రూపొం దింది మూలంలో యిది అధర్మమే[2]. సమత లేనిచోట ధర్మం వుండదు.

ఇక 'అద్వైతం' మాట హరిహరులైనా యెరగరు, "ప్రజా వళి" కెలా అరుగుతుంది యీ మేధావుల యినుప గుగ్గిళ్ల తిండి? మనశ్శాలలో తయారైన దినుసే కావచ్చు గాని, మనశ్శాల సైతం వట్టినే దేన్నీ తయారించదు. "ప్రజావళి"కి పట్టిక పోయినంత మాత్రాన, సమాజంలోని అగ్ర వర్ణాలకు, వర్గాలకు శైవ, వైష్ణ వాలు పట్టలేదనీ, సిగవట్టు పట్టించలేదనీ అనలేము. అగ్రవర్ణాలను అనుకరించి "ప్రజావళి" కూడా పట్టించుకోక తప్పలేదు. పరమ ప్రాచీనమైన శైవం సాపేక్షంగా నవీనమైన వైష్ణవాన్ని సహించలేక ఉగ్రరూపం ధరించి "ఆవేశపూరితం" అయిందేమో! లేదా, బౌద్ధ, జైనాలకు గల ప్రాబల్యాన్ని అతకరించేందుకో! అసలు 'భక్తి' మార్గమే సాపేక్షంగా అర్వాచీనం, అంటే సాపే క్షంగా "ఆవేశపూరితం". ఇది "ప్రజావళికి"కి వుద్దిష్టమైన మార్గం కూడా కావడాని, వారు తను ఆదిమ మత విశ్వాసాలతో, ఆరాధనా విశేషాలతో కలగలిపే దీన్ని అవలంబించి వుంటారు అంతే గాని, ఉద్దిష్టమైన అచ్చరూపంలో కాదు చరిత్రక్రమంలో ప్రజలను బట్టి రాజులకూ రాజులను బట్టి ప్రజలకూ బాగా వంట బట్టి తలకెక్కిన మతరూపం శైవమే. దాన్ని పట్టి పల్లార్చేం దుకు ప్రయత్నించింది, వైష్ణవాని కంటె ముందు బౌద్ధ, జైనాలు. కన్నడ దేశాన కలచురి బిజ్జలుడు, తెలుగు దేశాన వెలనాటిచోడుడు దీన్నే నిరూపిస్తారు. తొలి కాకతీయ రాజులు జైనాన్ని దిగదొక్కి శైవాన్ని పైకెత్తారు. జైన బౌద్ధాలకు రాజపోషణ వుండిన కాలాన కూడా "ప్రజావళి"లో శైవానికి సమాదరణ వుండేదని ఆంధ్ర శాతవాహనుల నాటి సమాజ చిత్రాన్ని బట్టి గ్రహించవచ్చు. మేధస్వాయిలో బౌద్ధాన్ని 'వాతాపి జీర్ణం' చేసు కునే శంకరద్వైతం తన కాలు నివరించుకుంది. దీని 'ప్రచ్ఛన్న బౌద్ధం' అన్నారు కూడా. మత సమన్వయం జరిగిన ప్రతి దఫా, సమాజ స్థిరతను — ప్రజల "సుఖ శాంతు" — దెబ్బదీయగల కొత్త వర్గాల సవాలు అణగారి పోతూ వచ్చిందనే అనిపిస్తుంది.

సమన్వయాన్నీ, స్థిరతనూ వుద్బోధించే సాహిత్యం సైతం ఆ మత 'విప్లవాల' పర్యవసానంగా వెలువడడం విశేషం. భార తాంధ్రీకరణకు సామాజిక పూర్వరంగంలో మతపరమైన అంశం, బౌద్ధ, జైనులమీద "సనాతన" మతం సాధించిన విజయం. "గాసటబీసటే చదివి గాథలు తప్పు" తెలుగువాళ్ళ "మహాభారత సంహిత"ను వెనువెంటనే తలదాల్చలేదు. వెనువెంటనే "ఆంధ్రా వళి మోదముం బొరయ"నూ లేదు. మొట్టమొదట ఆ పని చేసింది అలనాటి మేధావి వర్ణమైన బ్రాహ్మణులే. ఆ నాటికే బ్రాహ్మణులు వైదిక, లౌకిక శాఖలుగా రూపొందినట్లు కొమ ర్రాజు లక్ష్మణరావు నిరూపించియున్నారు. తమకోసమేగాక, తమకు ప్రాపుగా నిలిచిన రాజుల కోసం, వారి రాజ్యస్థిరత, పాలిత "ప్రజా వళి", "సుఖ శాంతులు" అపేక్షించి, తామీపనికి బుద్ధిపూర్వకం గానే పూనుకున్నారు. "వర్ణాశ్రమ ధర్మ సమ్యగ్విభక్త సోపానక్రమ విలసిత"మైన సమాజం యథాపూర్వంగా వుండాలిగదా మరి!

తెలుగులో "పద్యవిద్య" కు ఆద్యుడుగా నన్నయ్యను ఎన్నిన రోజులు గతించి, నన్నయ్యకు పూర్వమే తెలుగులో పద్యరచన జరుగుతూ వచ్చిందని యుద్ధమల్లుని బెజవాడ శాసనం, పండ రంగని అద్దంకి శాసనంవంటి వాటి ఆధారంతో ఒప్పుడంటున్నారు. కావచ్చుగాని, దానికి సాహిత్యగౌరవం నన్నయ్యతోనే మొదలైంది. రాజరాజు ఆస్థానంలోని యితర కవి పండితుల గురించి నన్నయే ప్రస్తావించాడు. అలాగే నందమపూడి శాసనంలో "సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్రభాషా" "కవిరాజశేఖర" ప్రథితు డైన నారాయణభట్టును తానే సగౌరవంగా పేర్కొన్నాడు. అయితే వీరి రచన లేవీ వెలుగులోకి రాక నన్నయ్యదే రావడానికి కారణం, నన్నయ్య రచించింది ఇంద్రగంటి వారన్నట్టు (పు. 63) ఏదో శతకమో, స్తోత్రమో గాక "ధర్మశాస్త్రము" వంటిదైన మహాభారతం. మతస్పర్శవల్ల మహితమైన ఇతివృత్తం వుండ బట్టికూడా దీనికి మన్నిక లిగింది.

అయితే నాడైనా నేడైనా మహాభారతగత "ధర్మము" ప్రజావళికి అందిందా? నన్నయ్య కృతిద్వారానే అందిందనిమాత్రం చెప్పలేము. "ప్రసన్న కవిత" అయింది పామరేతరులకే. వారి పలుకుబడికి సంఖ్య గీటుకాదు. "పద్యవిద్య" ప్రజలకు శిరో భారమే. హనుమచ్ఛాస్త్రిగారు పేర్కొన్న కాటమరాజు కథ, కుస లాయకము, సంస్కృత వృత్తదూరాలైనందుచేతనే, ప్రజల్లో వ్యాపించగలిగాయి. పాటలదాకా యెందుకు, ద్విపదకుగల ఆదర మైనా ప్రజల్లో మత్తేభ, శార్దూలాదులకు లేదు. కాబట్టి "దీనిని ప్రజలందరును పాడుకొని ఆనందించుటకు" "తేలిక రచన"గా నన్నయ్య వుద్దేశించలేదన్నమాట (పు. 35) పూర్తి నిజం. సంస్కృతంనుంచో కన్నడంనుంచో తెచ్చుకున్న వృత్తాలతో బాటు, సంస్కృత శబ్ద రూపాలు నన్నయ్య రచనను 'ప్రజావళి'కి పరాయిదాన్ని చేశాయి. 'జాతీయత లేదంటే యెలాగుంటుంది? శివకవుల రచనల్లో అది వుందంటే, వుండకేంచేస్తుంది? కన్నడ దేశమైనా, తెలుగు దేశమైనా, శివకవుల రచనల్లోనే రూపుకట్టు కుని నిలుస్తుంది. ఆనాటి సమాజ చిత్రం సాక్షాత్కరిస్తుంది. అప్పటి జనం వేష విశేషాలతో కళ్ల గట్టుతారు. పచ్చిగానైనా జీవితం ప్రత్యక్షమౌతుంది. పచ్చిదనంవల్లనే ఆ రచనలకు మన్నిక కలుగలేదేమో? వాద వివాదాలతో, ఖండనమండనలతో తత్కాల విషయాలను అతి వేలంగా వర్ణించి అవి తమ స్థిమితాన్నీ పర్వతనీ బలిపెట్టుకున్నాయి. పైగా తమది సమన్వయ వైఖరిగాక పాక్షిక వైఖరి అయింది. సంకుచితమైన సందేశం 'వీర'త్వాన్ని జోడించు కుని కక్షలకు తావిచ్చింది. అయితే శివకవీ భవకవీ 'ఒక తానులోని తుంటలే'. మత ధర్మమే వారికి పట్టింది.[3]

అయినా, వీరశైవం సమాజంలోని కింది వర్ణాలను సైతం కదిలించి, వాటి పూర్ధ్వచలనం (upword mobility) మూలాన

'అశాంతి' కలిగించింది. స్మార్తం సమాజస్థితిలో పెను మార్పును దేన్నీ ఆహ్వానించలేదు, అనుమతించనూ లేదు. ప్రజలలో యీ రెంటి వ్యాప్తికీ గల అంతరాన్ని బట్టి, వీటిని బలపరిచే సాహిత్యం భాషలో, ఛందస్సులో, వస్తువులో సైతం, బేధాలను చూపెడుతుంది. 'జాను' తెలుగు, ద్విపద, కింది వర్ణాల భక్తుల చరిత్రలు, ఇవి ఒకచోట. పండిత (గ్రాంథిక?) భాష, వృత్తాలు, అగ్రవర్ణాల పురుషుల, రాజుల చరిత్రలు, ఇవి రెండో చోట. అపవాదాలు ఒకటీ అరా వుండవచ్చు గాని మొత్తం మీద ఇది వాటికి అన్వయించక పోదు. పోటీపెట్టవలసిందీ, తేడాపాడాలు చూపవలసిందీ నన్నయ్యకూ తిక్కనకూ కాదు, నన్నయ్య తిక్కనలకూ పాల్కురికి సోమనకూ. సోమన రచనలు కూడా పండిత సంప్రదాయ బలం నుంచి తప్పుకో లేదు. పామర రచన లెన్నో విస్మృతి పాలై సోమనవి ప్రసిద్ధికెక్కి ఉంటాయి అసలైన పోటీ వీటిదే గాని సోమనది కూడా పూర్తిగా కాదు.

నన్నయ భట్టు రాజరాజు "కుల బ్రాహ్మణుడు" - పురోహితుడు. అయినంత మాత్రాన "వైదిక కార్యములు జరిపించు శ్రోత్రియచ్ఛాదసుడు కాడు" అని ఇంద్రగంటి వారంటున్నారు (పు. 113). లౌకిక కార్య నిర్వహణ దక్షుడైతే కావచ్చు గాని, శ్రీ నాథునిలా "విద్యాధికారి" పదవి వంటి దాన్ని దేన్నైనా నిర్వహించాడా ? ఆ అవసరమూ లేదు. కౌటలీయార్థశాస్త్రంలో పురోహితుడు కూడా రాజ సచివుడే. మంత్రి పరిషత్తులో అగ్ర తాంబూలం అతనిదే. ఇక్కడ, రాజరాజు కొలువున, కుల బ్రాహ్మణునికి రొక్కరూపేణా వరుంబడితో నిమిత్తం లేకుండానే, భూవసతి వుండి వుంటుంది. నారాయణ భట్టు కొకటి వుండేది గదా! అంటే, భూమిని దానం చేసే అధికారం రాజుకి సంక్రమించివున్నదన్నమాట — భూస్వాములను సృష్టించే అధికారం! ఆనాటికే యిది సమాజ జీవిత లక్షణంగా గట్టిపడి వుండాలి. భోగకాంతలకూ, ఉపపత్నులకూ రాజులూ వారి సామంతులే గాక వివిధ రాజ్యోద్యోగులూ అప్పటికే భూదానం చేస్తూ వస్తున్నారు. 'నల్లిండ్లు' పేరుతో బ్రాహ్మణాగ్రహారాలు యేర్పడుతూ వచ్చాయి. ఈ సామాజిక నిశ్రేణికి కొసమెట్టు రాజు. దానికి ఆధారం మతపరంగా కుల బ్రాహ్మణుడు కాగా, లౌకిక కార్యపరంగా నియోగి బ్రాహ్మణుడు. మంత్రి దండనాథుల మొదలు గ్రామకరణాల వరకు ఈ వర్ణపే రాజ్యోద్యోగులను అందిస్తూ వచ్చింది. ఈ వుభయ వర్గాల, వర్ణాల సుస్థితిని పదిలం చేసేవే "వైదిక" మతమైన, "అద్వైత" భావనైనా, సంస్కృత భాషా పాండిత్యమైనా, వృత్త రచనా ప్రాచుర్యమైనా, మహేతిహాస యితివృత్తమైనా, "సనాతన" "ధర్మ" ప్రబోధమైనా. అందుకే మహాభారతాంధ్రీకరణ యేదో యాదృచ్ఛిక ఘటన అయివుండదు.

చివరికి ఒకటి వుంది. ఇంద్రగంటివారు "తెలుగు దనము" అని వర్ణించిన 'జాతీయత' (పు. 39). జాతీయత తెలుగు దనం కంటె పెద్దది. కావ్యభాషనో, జనం పలుకుబడులనో, కాకువునో పట్టి ఒక కవి 'జాతీయత'ను చూపెట్టాడనడంవేరు, 'జాతీయతా' స్పృహ ఉండటం వేరు. ఈ స్పృహ ఆధునిక జాతీయతావాదమే కావలసిన పనిలేదు. అలా కాలేదు కూడా. "స్వస్థాన వేష భాషాభిమతాః" అని 'ఆంధ్ర శబ్ద చింతామణి'లో నన్నయ్య పేర్కొన్నాడు. నిజమే: అర్జునుని చేత తెలుగు గడ్డను తొక్కించి, గోదావరి నదినీ, భీమేశ్వర క్షేత్రాన్నీ, వేంగిదేశాన్నీ, శ్రీశైలాన్నీ చూపించడమూ గొప్పే. వేంగిదేశం "శిష్టాగ్రహారభూయిష్ఠమై" ఉన్నంత మాత్రాన, ఈ అగ్రహారాలకు వెన్నెముకలైన వూళ్ళూ నాళ్ళూ, అందలి నానా కులాల వాళ్ళూ ఎలా వున్నట్టు ? నిజానికి, తెలుగు దేశానికి అప్పటికింకా జాతీయతా స్పృహ సమగ్రంగా యేర్పడలేదేమో ? చోళ చాళుక్యులకూ, చోళ రాష్ట్రకూటులకూ స్కంధావారంగా, యుద్ధ రంగంగా, రుద్రభూమిగా, మాత్రమే వుంటూ వచ్చిన తెలుగు దేశం, ఈ యుద్ధాల మూలంగానే జాతీయతా స్పృహను పొందిందేమో ? ఇన్ని దండయాత్రల మధ్య "ప్రజావళి" కి "సుఖము శాంతి" ఎలా సాధ్యం ?

నిజానికి, పరప్రాంతాలనుంచి దండెత్తి వచ్చి వేంగిదేశాన్ని ఆక్రమించుకున్న ఒకానొక రాజవంశానికి చెందినవాడే రాజరాజు. ఆ రాజవంశంవెంటవచ్చిఇక్కడ గోదావరితీరాన నెలకొన్న బ్రాహ్మణ వంశంలోనివాడే నన్నయ్య, కాకుంటే. అప్పటికే కొన్ని తరాలు గడిచి వీళ్ళు తెలుగువాళ్ళు కాగలిగారు. తెలుగువాళ్ల మనుకునీ వుంటారు. నేరుగా సంస్కృతంనుంచి, కన్నడంనుంచి కూడా సంక్రమించిన భాషా సంస్కారాలు, మత ధర్మాలు, నన్నయ రచన ద్వారా తెలుగు రూపెత్తాయి. తదనంతర కాలాన ఆ సంప్రదాయాన్ని అనుసరించిన వారికందరికీ నన య్య "ఆదికవి".

## అ థో జ్ఞా పి క లు

1 వర్ణ వ్యవస్థ అనేది వాస్తవమైనదని అనుకోవడం కంటె భావపరమైనదని అనుకోవడమే (ideal rather thom actual) సరైనదిగా సమాజ శాస్త్రజ్ఞుల భావం. వర్ణాలు ఈ దృష్ట్యా అబద్ధం, కులాలే నిజం. caste కంటె sub-caste మన సమాజాన్ని కులాల పుట్టగా మార్చిన అంశం.

2 "...వర్ణధర్మ మధర్మ ధర్మంచే" — గురజాడ.

3 సమాజ చరిత్రలో మత వివాదాలు మతవిషయాలకే పరిమితం కావు ఆర్థిక, రాజకీయ విషయాలనుగూడా మత వివాదాలు పరోక్షంగానైనా ప్రకటిస్తాయి. ఒక్కొక్కప్పుడు, ఆర్థిక, రాజకీయ వివాదాలకు మతం ఒకనెపం మాత్రమే అవుతుందికూడా.



# క ల గూ ర గం ప

## రమణారెడ్డిగారి సాత్త్విక వచనాలు

ఒక సాహిత్యపత్రికలో ఏ కమ్యూనిస్టుపార్టీ పంథాసరయినదో చర్చించుకోవటం ఆ పత్రిక సౌజన్యాన్ని దుర్వినియోగపరచుకోవటమే అయినా రాజకీయాలకూ, సాహిత్యానికీ, తారతమ్యం లేకుండా (విరసంవారి పుణ్యంమేరకు) చేసినందున జనవరి 'భారతి'లో రమణారెడ్డిగారి సుదీర్ఘలేఖమీద అభిప్రాయం రాయాలనిపిస్తుంది.

ఒకటి రెండు సంవత్సరాల క్రితం 'విరసం' సభ్యుల ప్రవచనాలకూ, నేటి రమణారెడ్డిగారి లేఖకూ పోల్చిచూస్తే వారిలో చాలా సౌమ్యత ఏర్పడిందని గ్రహించగలం. సాహిత్య దేవిడీలని, కింకరులనీ, భ్రష్టులనీ, జాత్యంధులనీ ఎంతెంతమందికి ఎన్నెన్నో నామకరణాలుచేసిన శ్రీ రెడ్డిగారు జ్వాలాముఖిది 'మార్మిక కవిత్వం' అన్నంతమాత్రాన మనసు కించపరచుకున్నారు. 'మీది మార్మిక కవిత్వంకాదా' అని సోమసుందర్‌ను ప్రశ్నించారు. సోమసుందర్ మార్మిక కవిత్వం రాసిన రోజున ఆ కావ్యానికి తాటికాయంత అక్షరాలతో (మిణుగురులు) 'ఇది మార్మిక కవిత్వం' అని పేరు పెట్టుకున్నారు. ఏదీ దాచిపెట్టుకోలేదు. ఏడాదికో మంత్రం జపించలేదు. రమణారెడ్డిగారి మాటల్లోనే అయినా 'ఒకనాడు విప్లవ కార్యక్రమం'లో భాగస్వామ్యం వహించిన సోమసుందర్ 'తూనా బొడ్డుంబా'లని పార్టీలు మార్చలేదు. సి.పి.ఐ. ఔత్సాహిక భాగస్వామ్యంనుండి దూరమయినా సి. పి ఐ.ని ఏనాడూ తూలనాడి ప్లేటు మార్చేయలేదు. తన స్వేచ్ఛాజీవనాన్ని సిద్ధాంతీకరించి ఎవరి నెత్తినా రుద్దలేదు. ఒక రాజకీయ పార్టీకి గాని, ఒక కవితా తత్వానికిగాని (అభ్యుదయ కవిత్వానికే) చేదోడు వాదోడుగానే ఉన్నాడు.

మరి జ్వాలాముఖిని తీసుకోండి. అమ్మో! అమ్మో! జ్వాలాముఖి అత్యుగ్ర భావోపన్యాస విన్యాసాలు ఆంధ్ర సాహితీ జనానికి మరుపురానివి. శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంలో, కె. జి. హెచ్. ఆసుపత్రి భవనంలో ''We want blood shed—హింస విప్లవానికి మంత్రసాని'' అన్న జ్వాలాముఖి (ఆ నాటికి సార్థకనాముడు) ఈనాడు కోమలముఖంతో ''సాహిత్యమూ—వాస్తవికత'' అంటున్నాడు. నిబద్ధ, నిమగ్న రాజకీయాల్లో భేదాభిప్రాయాలొచ్చి 'విరసం'నుండి విడిపడ్డాడు. ఎన్ని మాటలంటానికయినా, మావోనే సాహిత్యకారు డంటానికయినా, వీరసాయుధ విప్లవంనుండి, 'తుచ్ఛ' పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో 'అవినీతి' ఎన్నికల్లో పాల్గొనటానికయినా, ఏమేమి చెయ్యటానికయినా మీకేనా స్వేచ్ఛ రమణారెడ్డిగారూ? అయినా జ్వాలాముఖి ఇప్పుడు విరసంలో లేడుకదా! ఏలనో ఈ గత జలసేతుబంధన ప్రసాదిత ప్రేమానురాగం. అంటే 'విప్లవం' పదం ఉచ్ఛరిస్తున్న వారంతా మీ సోదర శ్రీవైష్ణవులేనా?

'కరపత్రాల భాగోతం'పై సో. సు. సమీక్షను ఆక్షేపించే హక్కు మీకు వుంది. కాని సో. సు. గారివి అనవసర వ్యాఖ్యలన్నారే అవి కూడా మీరు ప్రసాదించిన సాంప్రదాయమే. మీ లేఖలోనే (ఆంధ్రదేశంలోని సాహిత్య చర్చాలేఖలో) ప్రపంచ సోషలిస్టు డెమొక్రాట్లను, కృశ్చేవ్‌ను, బెజ్నేవ్‌ను, పి. సి. జోషీని కూడా నిష్కారణంగా లాగి నిందించారు చూడండి తత్తుల్యమైన సాంప్రదాయికత అన్యులు కొంతయినా అనుకరించనద్దా. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని పోల్చిచూస్తే భారతీయ కమ్యూనిస్టు ఉద్యమం 'అపభ్రంశం' అయిందని అన్నమాటకు మీరంత ఆగహించవలసిందేమీ లేదు. ఇంత విశాలమైన భారతదేశంలో ఒక్క రాష్ట్రంలో కూడా సంపూర్ణాధికారం లేని కమ్యూనిస్టులు 16 పార్టీలయినపుడు ఉద్యమం ఛిన్నా భిన్నమైందని వారే అంగీకరిస్తున్నపుడు మీరు నొచ్చుకోవలసిందేమీ లేదు. మీ చిత్తశుద్ధినీ, నిస్వార్థ బుద్ధినీ ఎవరూ శంకించరు. వీర వితండవాదాన్నీ, విప్లవ కార్యక్రమాన్నీ సమర్థిస్తూ సమర్పించే మీ నాదనాపాఠం ఇంకా చలామణీకాదు. దానికి కారణం, (రాజకీయాల నొదిలేయండి) మీరు ఒకనాడు సిసలైన విప్లవ సాహిత్య కారులన్నవారు ఒకరు అతీత మానవ శక్తుల గురించీ, ఒకరు సాహిత్యంలో వాస్తవికత గురించీ, ఒకరు విషవృక్ష ఖండన—మండన వివాద విశేషాల గురించీ, ఒకరు జనతా పార్టీతో పొత్తుగురించీ మాట్లాడుతున్నారు. ఇంకా పెనుగులాడుతున్న మీ కృషి కీర్తించ దగ్గదే అయినా, పెనుగులాడే విషయం సమర్థనీయంకాదు. సాహిత్యపరమైంది అసలుకాదు.

*శ్రీ చందు సుబ్బారావు*

## కాకతీయ యుగము

1977 ఆగస్టు 'భారతి'లోని డాక్టర్. వై. గోపాలరెడ్డిగారి 'కాకతీయ యుగము - వర్ణ వ్యవస్థ'—అను వ్యాసము విస్తృతమైన విషయ సేకరణతో ఆ యుగము నందలి సాహిత్య, శాసనాత్మక ఆధారాలను ఒక నూతన దృక్పథముతో పరిశీలించినట్లు స్పష్టము.

ఈ సందర్భమున మరికొన్ని అంశములను అవగాహన చేసికొనుట ఆవశ్యకమనిపించుచున్నది.

(1) కాకతీయ యుగమున వర్ణధర్మమును కాపాడుట—

వర్ణ ధర్మమును కాపాడుట యనగా శాస్త్రోక్తముగ వర్ణమునకు విధింపబడిన ధర్మము ఆ వర్ణమునకు చెందిన జనులు నిర్వర్తించునట్లు చేయుట, ఒక వర్ణపు విధితో మరియొక వర్ణము జోక్యము కల్గించు కొనకుండ రక్షించుట. ఇది పాలకుని విధులలో నొకటిగ పరిగణింపబడినది.

ఇట్టిచో శూద్రులకు సేవక ధర్మమే కాని పాలక ధర్మమెక్కడిది ? కాకతీయులు శూద్రులగుటచే వారే వర్ణ ధర్మము నతిక్రమించి రాజ్యపాలన నిర్వర్తించిరి. ఇక వారు వర్ణ ధర్మమును

సముచితముగ కాపాడిరనుటలో భావమేమి ? గణపతి దేవుడు వర్ణ భేదము పాటింపక అన్ని వర్ణముల వారికి నాయకత్వము నిచ్చుట వలన సైన్యమున నైతిక పతనము వాటిల్లినదని గుర్తించి ప్రతాప రుద్రుడు వెలమలనే నాయకులను చేయుటద్వారా పాలనా యంత్రాంగమును పునర్వ్యవస్థీకరించినాడన్న అంశము చారిత్రకుల కెల్ల విదితమే. కాకతీయులలోనే ఒక రాజు వర్ణభేదమును రాజ్యావసరము దృష్ట్యా పాటింపలేదనియు, అదే కారణము మరియొక రాజునకు ఒక ప్రత్యేక కులమునందు (నాయక వ్యవస్థకు చెందినంత వరకు) విశ్వాసముంచునట్లు చేసినదనియు స్పష్టమగును. గణపతిదేవుడు 'సమస్త భక్తజనానంద కారణ' గా ప్రస్తుతింపబడినాడు కానీ చాతుర్వర్ణ్య సముద్ధరణుడుగా పేర్కొనబడలేదు.

ఇంతియేకాక కాకతీయ యుగమున 'గోసంగి' బలములు ఆయా యుద్ధములలో ప్రసిద్ధి వహించినట్లు సాహిత్యాధారములు కలవు. అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములకే కాక రాజ్య వ్యవహారములలో పంచమ వర్ణము వారికిని ప్రవేశము, ప్రాధాన్యత కలదు. పల్నాటి వీర చరిత్ర, కాటమరాజు కథలలో గోసంగి బలముల శౌర్యము ప్రస్తుతింపబడినది.

కనుక చాతుర్వర్ణ్య సముద్ధరణ...మొదలగు ఆయా రాజుల ప్రశస్తిలో కనిపించు విశేషణములు కేవలము సాంప్రదాయకముగ పేర్కొనబడు విశేషణములే కాని వాస్తవముగ పరిమితార్థమును కలిగియున్నవని తెలియక మానదు.

బ్రాహ్మణులకు భూరిగ భూమి, అగ్రహార దానములిచ్చుట, వారిని పురోహితులుగ, మంత్రులుగ రాజ్యపాలనా యంత్రాంగమున స్వీకరించుట — అనునవి 'సప్త సంతానముల' పై విశ్వాసము, ఆయా రాజులకున్న పారమార్థిక చింతన, శ్రేయోరాజ్య ఉద్దేశ్యము, అగ్రవర్ణము నెడ భక్తిప్రపత్తులు, రాజ్యపాలనావశ్యకతల వలననే కాని వేరుకాదు. కనుక కాకతీయ యుగమున రాజులు, సామంతులు వర్ణ ధర్మమును కాపాడి రనుట కంటె అగ్రవర్ణముల వారికి సముచిత గౌరవ మిచ్చి తృప్తులనుజేసి, తదితర వర్ణములకును రాజ్యావసరములను బట్టి సముచిత స్థానమిచ్చి రాజ్యావసరముల కుపయోగించుకొని రనుట యుక్తమనిపించును. దేవ, గురు, ద్విజభక్తులమని కొందరు పాలకులు ప్రకటించుకొన్నారు.

[ద.హిం.శా. VI, 100; V, 136; X, 3; X, 22; X, 473]

కాకతీయ యుగమున క్షత్రియులకే పాలనాయోగ్యత అన్న శాస్త్రోక్త నియమము తారుమారై పాలకులే వర్ణమునకు చెందిన వారైనను క్షత్రియులగుదురను విశ్వాసము ప్రబలినది. అప్పటికిని బద్దెన పాలనకు శుద్ధ క్షత్రియులుండగ మిగిలిన వారయోగ్యులని తెల్పినాడు. కనుక ఆ కాలమున శుద్ధ క్షత్రియ, కృత్రిమ క్షత్రియ భేదమున్నట్లు తెలియును. దీనినిబట్టి క్షత్రియ శబ్దము వర్ణవాచిగనే గాక ధర్మవాచిగ (రాజపాలనా క్రియ) కూడ ప్రసిద్ధమైనది.

(2) మహామండలేశ్వర—అధికార శోభాయుతమైన బిరుదు.

ఇది కేవలము బిరుదేగాక ఒక పదవి కూడా. [సమధిగత పంచ మహా శబ్ద మహా మండలేశ్వర పద విరాజమానులైన శ్రీమన్మహా మండలేశ్వర పోతరాజులు — ద. హిం. శా. X, 543 అనుచోట స్పష్టము.] చక్రవర్తి, మండలేశ్వర, రాజు, నాయక, మన్య నాయక — అనునవి రాజ్య పాలనా యంత్రాంగమున క్రమానుగత శ్రేణిలో (hierarchy) నున్న అనేక అధికార పదవులు. [ద.హిం.శా. X 503, డాక్టర్ వై. పద్మావతి సిద్ధాంత వ్యాసము, Public Administration in early Mediaeval Andhra].

అపరాజిత పృచ్ఛలో హరి వారి పాలనలోనున్న గ్రామ సంఖ్య దృష్ట్యా సామంతుల క్రమ మిట్లున్నదని శ్రీ శిబేషి చంద్ర భట్టాచార్య గారు తెల్పిరి.

| | | |
|---|---|---|
| 1. | మహా మండలేశ్వర | 100, 500 |
| 2. | మండలిక | 50, 000 |
| 3. | మహా సామంత | 20, 0: 0 |
| 4. | సామంత | 10, 000 |
| 5. | లఘు సామంత | 5, 000 |
| 6. | చతురాంశిక | 1, 000 |

ఈ విభాగము కఠినముగ ఆంధ్ర రాజ్యములకు వర్తింప జేయను వీలులేకున్నను స్థూలముగ ఆయా పదవుల తర తమ భేదములు తెలియుచున్నవి. మధ్యాంధ్ర రాజ్యవ్యవస్థలో పై పదవులలో మొదటినాలుగును అవికాక, రాజు, నాయక, మన్యనాయక పదవులును కన్పించుచున్నవి.

(3) కాకతీయ యుగమందు కూడ రాయబారులను హింసించక గౌరవముతో చూచుట.

'పల్నాటి వీర చరిత్ర' లోనే రాయబారి చంపబడినట్లు ఆధారము కలదు. పల్నాడులోని చర్లగుడిపాటిలో ఇప్పటికీవున్న 'అలుగురాజు ఒఱుగురాయి' — అది చారిత్రకమని నిరూపించుచున్నది. రాయబారులను హింసింపకూడదను నియమమున్నను ఒక్కొక్కచో ఉల్లంఘించిన సందర్భములును కలవని గ్రహింపవలెను.

(4) కాకతీయ యుగమందు బ్రాహ్మణులు దౌత్యరంగమునందు గుత్తాధిపత్యము వహించుట —

ఇది సత్యదూరము. 'పల్నాటి వీర చరిత్ర'లో మలి దేవాదుల పక్షమునుండి అలరాజు, నలగము పక్షము నుండి కోటకేతుడు మొదలైన రాజులు రాయబారము నడిపిన విషయము ఆంధ్రలోక ప్రసిద్ధము. ప్రసిద్ధములైన రాజులే రాయబారులుగా వెళ్లిన ఈ

రెండు సందర్భములను విడచి 'పల్నాటి వీర చరిత్ర'లోని నారాయణ భట్టు రాయబారము మాత్రము స్వీకరించుట అసమగ్రముగ తోచు చున్నది.

*(కుమారి) చలివేం సీత*

## డిసెంబరు భారతిలో..

1. కేయస్వీగారి కవితలో అస్పష్టత ఉన్నది. ఇక్కడ ఒక చిన్న విషయం మనవి చేస్తున్నాను. స్పష్టత కొరిగి లోతున్న కవితలను అధికంగా ప్రచురించండి. 'లోతు' నెపంతో అస్పష్టతలో చిక్కుకొనే కవితలు ప్రచురించడం తగ్గించమని మనవి.

2. ప్రజలకోసం కవిత్వమనిచెప్పి వారికి అర్థంకాని కవిత్వం ఎలా వ్రాస్తున్నారో మన ఆధునిక ప్రజాకవులు—నా కర్థం కావడం లేదు అలాగే అక్టోబరు సంచికలో ''సాం శ్రీ'' వ్రాసిన ''మకుటధారి'' కవిత కూడా సామాన్య పాఠకులకు అర్థమయ్యేదికాదు. ''సావిక'' అన్నపదం ''వేదిక'' కోసం వాడినారు కాబోలు. 'సావిక' అంటే ఎంతమంది పెద్దవాళ్ళకు అర్థమౌతుంది? (సామాన్యుల సంగతలా వుంచుదాం). ''కాల లత్రాగ క్షేత్రమధూలికా సుమాన్ని ధరించిన'' అని అన్నారు.

3. ఇట్టి కవితలకన్న ఒకరకంగా పూర్వకవుల కవిత్వమే మిన్న. అది సదాః కర్థం వెతుక్కొంటే చక్కగా అర్థమవుతుంది. ఆధునికకవులు మామూలు పదాలువాడుతూనేఅర్థంకాకుండా వ్రాస్తున్నారు. ఇది పెద్ద 'ఫాషను'గా భ్రమిస్తున్నారేమోనని నా అనుమానం. మీరిట్టి కవితలను ప్రచురించేటప్పుడు జాగ్రత్తగా వ్యవహరించమని మనవి. కొత్త సీసాలో పాత సారాలాగా మన వచన కవిత వుండకూడదని నా ఆశ.

4. డిసెంబరు 'భారతి'లో శ్రీ వేముగంటి వ్రాసిన ''అమృతసేతువు'' కవిత ఫరవాలేదు. మొదటి పద్యంలోని ''తెలుగు తల్లి కొంగున పైడి'' అన్న రెండవ పాదంలో ఛందస్సు తప్పిపోయింది. ఈ పొరపాటు ఎలా జరిగిందో! కవితలను నిర్మాణాత్మక దృష్టితో పరిశీలించి, పొరపాట్లులేకుండా చూసి ప్రచురిస్తారని మిమ్మల్ని కోరుతున్నాను.

*శ్రీ రావి రంగారావు*

## ''హాహాకారము''

'నవంబరు' నెల 'భారతి'లో శ్రీ పాతకోటవారును, అంతకు పూర్వము శ్రీ వంతరాం రామకృష్ణారావుగారును 'హ'కార సహిత దేశ్య శబ్ద స్థాపనలో చూపిన శ్రద్ధ ప్రశంసితవ్యము.

నన్నయ భారత భాగములో 'హ'కారఘటిత దేశ్యశబ్దములు కన్పింపవని చెప్పువారి భావన పేదైనను ఈ ప్రతిపాదనము చింతామణియొక్క ప్రాచీనతను శంకించుటతోపాటు నన్నయ కర్తృత్వమును ప్రశ్నించుచున్నది. వీని నెదుర్కొనుటకే నన్నయ భారత భాగములో 'హ'కార ఘటిత దేశ్యశబ్దములకై దేవులాడి దొరకిన శబ్దములను గూర్చి వాదోప వాదములు సాగింపవలసివచ్చుచున్నది. చింతామణి ప్రాచీనమనుటకు, తత్కర్త నన్నయ్యయే అనుటకు, అనకపోవుటకు 'హ'కారఘటిత దేశ్య శబ్దములను విషయములుగా తీసుకొన నవసరములేదు. ఎందుచేతననగా—

1) నన్నయ భారతమును చింతామణికి లక్ష్య గ్రంథముగా పేర్కొని యుండలేదు
2) 'హ'కార ఘటిత దేశ్య శబ్దములను నన్నయ భారతములో తప్పక ప్రయోగింపవలెననుట సమంజసముకాదు.
3) 10–11 శతాబ్దుల దేశ్యపదజాలము సంపూర్ణముగా మనకు లభించియుండదు.
4) ఆనాడు 'హ'కారఘటిత శబ్దములు విరళములై వానిని ప్రయోగింపవలసిన అవసరము నన్నయకు కలిగియుండక పోవచ్చును. కాని భాషలో దాని అస్తిత్వమును ఆతడు గుర్తించి యుండవచ్చును.
పరిశీలింతము.

నన్నయ చింతామణిని వ్రాసినను, వ్రాయకపోయినను, వ్రాయలేదనిచెప్పుటకు హకార సహకారము ప్రబలముగా లభింపదు. కారణము తన వ్యాకరణములో పేర్కొన్న ప్రతి లక్షణమునకు భారతములో లక్ష్యములను చూపుట కాతడు కంకణము కట్టుకొనలేదు. చింతామణి విరుద్ధ ప్రయోగములు కొన్ని భారతములో పెద్దలు చూపియున్నారు. వ్యాకర్తలందఱి కావ్యములలోను తదుక్త లక్షణాతిరిక్త ప్రయోగములు కన్పించుచునే యున్నవి. చిన్నయసూరి గారి ప్రయోగములు సైతము కొన్ని తావుల బాలవ్యాకరణమును మీరిన వగుట విద్వద్విదితము.

సారాంశముగా లక్షణ ప్రవచనము చేసినవారి గ్రంథముల యందు ఆ లక్షణములన్నియు పర్యవసింపవలెననుట నిత్యముకాదు. అట్లే ప్రస్తుత విషయమును. కవిత్వము భావానుగుణ శబ్ద సంయోజనముకదా! నన్నయగారికి భారత రచనలో 'హ'కారఘటిత శబ్దము ఆవశ్యకమై యుండకపోవచ్చును. నన్నయ కాలమువాటి శబ్దజాలమంతయు ఆయన భారతమందున్నదనియో, ఉండవలెననియో అనుట యుక్తముకాదు. పైని చెప్పినట్లు ఆ శతాబ్దులలో తాదృశ శబ్దములు విరళములై యుండవచ్చును. ఆయన 'సహళంతు హల్వర్గః' అని సూత్రించుటకు ఎన్ని శబ్దములున్నను చాలును.

మనకు ఇప్పుడు లభించుచున్న తత్కాల శబ్దజాలమునుబట్టి ఈ విషయమును నిర్ణయించుటకు ఇవియే సంపూర్ణములని చెప్పుటకు ప్రమాణమేది?

పైగా అనాటి 'హ'కార ఘటిత శబ్దములు భాషాశాస్త్రము ననుసరించి, ఉచ్చారణ సౌలభ్యమునకై వికృతములై అకార యకార ప్రభృతి ఘటితములుగా ఏల వికృతిని చెంది యుండరాదు. హడపము—అడపము మొ॥ వానిలో ఇట్టి వికారము చూచుచున్నాముకదా!

పైగా ఈ ఒక్క ప్రతిపాదనముతో చింతామణి అర్వాచీన మనుట ఎట్లు? విభక్తులు, సమాసములు మొ॥ నిరూపించు ఘట్టములో చింతామణి ఆంధ్ర వ్యాకరణ ప్రాథమిక దశను సూచించుచున్నదని వ్యాకరణజ్ఞులు, భాషాశాస్త్రజ్ఞులు పేర్కొనుచున్నారు. అది అట్లుండనిండు.

సారాంశ మేమనగా—

శ్రీ పరాశరం కృష్ణమాచార్యులవారు, శ్రీ దీక్షితులవారు పేర్కొన్నట్లు నన్నయ భారత భాగములో 'హ'కారము లేకపోవునుగాక. కాని అది చింతామణి విషయమున తత్కర్తృత్వమును తిరస్కరింపదు. వారి యుద్దేశ్యము ప్రకారము చింతామణి భారతములు ఏక కర్తృకములయినచో హకార ఘటిత శబ్దములు భారతములో నుండవలెననుట చారిత్రిక దృష్ట్యయంతయు సమంజసము. కాని అట్టి శబ్దములు లేకపోవుట భిన్నకర్తృకతా నిరూపకము కాదని నా మనవి. ప్రయోగింపబడకపోవుటలో అనేక కారణము లుండవచ్చును. ప్రయోగింపబడియును రూపాంతరత్వము నంది యుండవచ్చును.

కనుక 'హ'కారఘటిత శబ్దములు లేవని కొందఱు, ఉన్నవని కొందఱు, ఉన్నవి దేశ్యములు కావని మొదటివారుగా 'భారతిని' చర్చా చర్చితను చేయుట చింతామణి విషయమున నన్నయ కర్తృత్వ స్థాపన ఖండన క్రియాసిద్ధిం బ్రకృష్టోప కారకము కాదని నా నివేదనము—

—శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

## లేఖ

ఇటీవల 'భారతి'లో వెలువడుతున్న కొన్ని విమర్శక (?) రచనలలో విషయ ప్రాధాన్యతకంటే వ్యక్తిదూషణకు తావు దొరుకుతూ వుండటం శోచనీయమైన విషయం.

'కలగూరగంప'లో చెలరేగుతున్న చర్చలలో మరీ వాగాడంబరమూ, 'మర్యాదస్థుల' స్థాయికి చాలా దిగజారినవి అనిపించే మాటల ప్రయోగమూ కనబడుతున్నవి.

చర్చలలో పాల్గొనే వారికీ, వ్యాస రచయితలకూ ఈ విషయమై మీరొక గమనికను ప్రచురించి చూడటం యుక్తమని తోస్తుంది.

చాలామంది చదువరులకు అభ్యంతరకరమని తోచగల మాటలను మార్చవలసినదిగా మీరు ఆయా రచయితలను కోరినా కొంచెం ఆవేశ కావేషాలను అదుపులో పెట్టినవారవుతారేమో!

కేఎస్వీ నరసింహమ్

# గ్రంథ విమర్శలు

## కావ్యపంచమి

[రచయిత : శ్రీ గాదంశెట్టి శ్రీరాములు. క్రౌన్ సైజు 16+124 పుటలు. వెల 5 రూ. ప్రతులకు : ప్రకాశకురాలు శ్రీమతి జి. గోవిందలక్ష్మి. తూర్పు బ్రాహ్మణవీధి, W/4/205. గూడూరు. నెల్లూరు జిల్లా.]

ఈ పుస్తకం **మౌ**లిక రచన కాదనీ, అనువాదం కాని సంక్షిప్త సారాంశం కాని కాదనీ, విమర్శన వ్యాసమూ కాదనీ, అన్నిటినీ అవగాహన చేసుకున్న అయిదు మహాకావ్యాల పరిచయం మాత్రమే అనీ రచయిత మనవి చేస్తున్నారు. దీనినిబట్టి యిది ఒక విశిష్ట రచన అని తెలుస్తున్నది. రచయిత ఆయా కావ్యాలు చదివి తమకు తోచిన భావాలు ఈ పుస్తకంలో వెల్లడించినట్లున్నది.

ఈ 'కావ్యపంచమి'లో హిందీ భాషయందు మహాకావ్యాలుగా ప్రసిద్ధికెక్కిన 'సాకేత్, యశోధర, ఊర్వశి, కురుక్షేత్రం, కామాయని' అనే అయిదు రచనలను గురించి ఉన్నది. ఆ అయిదు వ్యాసాలే కాకుండా 'సాకేత్'ను రచించిన శ్రీ మైథిలీశరణ్‌గుప్త, 'కామాయని'ని వ్రాసిన శ్రీ జయశంకర్ ప్రసాద్‌లను గూర్చిన ప్రత్యేక వ్యాసాలు సంగ్రహ రూపమైనవి రెండున్నవి.

'సాకేత సౌరభం'లో 'సాకేత్'**లో** ఉన్న పన్నెండు సర్గల విషయం వేర్వేరుగా వివరించబడింది.

రామాయణంలో ఉపేక్షించబడిన ఊర్మిళపాత్ర యిందు పోషించబడింది. మైథిలీశరణ్‌గుప్త కైక పాత్రను అన్నిటికంటెను మిన్నగా ఇందులో చిత్రించినట్లు రచయిత చెప్తున్నారు. ఆమె పశ్చాత్తాపం అందరినీ ఆకర్షిస్తుంది. ఇందలి వ్యాసాలలో ఇదే చాలా పెద్దది. తర్వాతి వ్యాసంలో మైథిలీ శరణ్‌గుప్త జీవితాన్నీ, రచనలనూ, బిరుదాలను గురించి సంగ్రహంగా ఉన్నది.

రెండవకావ్యం 'యశోధర'. సిద్ధార్థుని మహాభినిష్క్రమణం మొదలుకొని, అతడు తిరిగి కపిలవస్తు నగరానికి రావడంవరకూ ఇందలి కథాంశం ఉన్నది. ఆ నడిమికాలంలో దయనీయురాలైన యశోధర ఎట్లున్నదీ వర్ణించడమే కవియొక్క ఉద్దేశం. ఈ కావ్యంలో ఆమె విరహిణిగను, రాహులుని జననిగాను, అభిమానవతిగాను చక్కగా చిత్రించబడింది. ఈ కావ్యంకూడా శ్రీ మైథిలీశరణ్‌గుప్త రచించినదే! ఇరవై అయిదు పుటలలో ఈ కావ్య పరిశీలన చక్కగా జరిగింది.

మూడవకావ్యం '**ఊర్వశి.**' రచయిత శ్రీరామ్‌ధారీ సింహ దిన్‌కర్. ఇది భారతీయ జ్ఞానపీఠ బహుమతిని అందుకొన్న గ్రంథం. జాతీయ గౌరవాన్ని పెంపొందించడమే శ్రీ దిన్‌కర్ రచనల ప్రధానోద్దేశం. అందువల్లనే ఈయన 'భారత, జాతీయ కవి'గా పేరు పొందారు. ''ఊర్వశి'' అయిదంకాల అభినయకావ్యం. నాటకీయకావ్యంగా దీనినందరూ చెప్తున్నారట! దీని మూడవ అంకంలోని ఊర్వశీ పురూరవుల సంభాషణే కావ్యానికి ఆయువుపట్టు. కవియొక్క ఉదీయమాన భావుకత యిందులోనే చరమస్థాయిని అందుకొన్నదట! దీని పరిచయం అయిదు పుటల్లో సంగ్రహించబడింది. ఈ వ్యాసం ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రకటిత **పూర్వమేనట!**

తర్వాతిది 'కురుక్షేత్రం.' దీని రచయితకూడా దిన్‌కర్ **జీయే!** ఇది ఏడు సర్గల కావ్యం. సాహిత్య జగత్తులో ఇది సంచలనాన్ని కలిగించినదట! ఇందు**లో** భావం, రసం, ఛందస్సు, అలంకారం, శబ్దశక్తి ఎంతో వికాసం చెందాయట! భారతయుద్ధం సమాప్తమయిన తర్వాతనుంచీ కథ ప్రారంభమైనది; క**థాం**శం చాలా స్వల్పం. ఆదినుంచి అంతంవరకూ ఆ యా పాత్రల అభిప్రాయాలే సూత్రీకరించబడినవట! ఆధునిక జగత్తులో తలయెత్తే కొన్ని ప్రధాన సమస్యలను, వాటి నివారణోపాయాలను ధర్మరాజుమధ్య, భీష్ముడిమధ్య చర్చలద్వారా పాఠకుల దృష్టికి తీసుకొని రావడమే యీ కావ్యంలో కవియొక్క ఉద్దేశంగా కనిపిస్తున్నదనీ, రచయిత తెలుపుతున్నారు. దుష్టులైన ప్రాణులమధ్య మనోబలంకంటె శరీర బలమే మేలైనదని భీష్ముని అభిప్రాయంగా కవి యిందు**లో** స్పష్టపరిచాడట!

తర్వాత 'కామాయని' కావ్యకర్త శ్రీ జయశంకర్ ప్రసాద్‌ను పరిచయంచేస్తూ చిన్న వ్యాసం ఉన్నది. ఆయన మానవతావాది అనీ, ఎన్నో నాటకాలు, కథలు, నవలలు వ్రాసాడనీ, రచన సంస్కృత భూయిష్ఠమనీ చెప్పబడింది.

'కామాయని' కావ్యంలో దేశకాలాలకు, జాతిధర్మాలకు అతీతమై విశుద్ధమైన మానవుని మనోవ్యాకులత ఇందులో చూపబడిందట! ఇందలి పదిహేను సర్గలలో **మొదటిసర్గ** ''ఆవేదన'' నుండి చివరిసర్గ 'ఆనందం'వరకూ మానవుని విభిన్న మనోదశలు వర్ణించబడినవి. ఆవేదన**తో** అణగిపోతున్న **మానవుడు** అలజడులన్నిటినీ తట్టుకొని ఆనందాన్ని ఎలా పొందగలిగినదీ యిందులో వర్ణించబడింది. ఈ విషయాలన్నీ ఈ కావ్యపంచమివల్ల మనకు తెలుస్తుంది.

హిందీ భాష**తో** పరిచయం లేనివారు, ఆ భాషలోని ఉత్తమ కావ్యాలను — అయిదింటిని గురించి తెలుసుకొనగోరే వారికి ఈ పరిచయ గ్రంథం బాగా ఉపయోగిస్తుంది. రచనా సౌష్ఠవాన్ని పాఠకునికికూడా అర్థము అయేరీతినే ఉన్నది.

***"అంగీరస"***

## రావి శాఖీయం

[సంకలనకర్త, సంపాదకుడు—శ్రీ అత్తలూరి — నరసింహారావు, డెమ్మి 92 పేజీలు. వెల 5 రూ. ప్రతులకు : నవయుగ

బుక్ సెంటర్, ఏలూరురోడ్డు, విజయవాడ–2. లేక బుక్‌సెంటర్, మెయిన్‌రోడ్, విశాఖపట్నం.]

ఆధునికులైన అభ్యుదయ రచయితల్లో రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు అగ్రశ్రేణికి చెందినవారు. ఆయన రచనలు అన్ని వర్గాలవారి మెప్పుదలను పొందాయి. ఆయన విశాఖపట్నంవారు. అందువల్ల వారి రచనలలో ఆ ప్రాంతానికి చెందిన మాండలికాలు విరివిగా కనవస్తాయి. మొత్తంమీద రచన అర్థమయినా, ఆ సందర్భంలో ఆ మాండలికానికి ఏ అర్థమో యితర ప్రాంతీయులకు స్పష్టంగా తెలియడం కష్టం. ఆధునిక రచయితలకు ప్రామాణికులైన విశ్వనాథశాస్త్రిగారు వాడిన మాండలికాలకు సరియైన అర్థాన్ని నిర్ణయిస్తూ, అవి ఏయే రచనలలో వాడినవీ, సంఖ్యతోనూ పొడి అక్షరాలతోనూ సూచించారు. దీన్ని సంకలనంచేసిన నరసింహారావుగారు! ఆ మాండలికాలు అకారాది క్రమంలో ఉన్నాయి.

'రావి శాఖీయ'మంటే రా. వి శాస్త్రిగారి విశాఖ మాండలికీయం అని అర్థం చేసుకోవాలేమో! అట్ట వెనుక భాగంలో రావి శాఖీయ మని ఉన్నందున రావిశాస్త్రిగారి శాఖకు–రచనా విభాగానికి చెందినదని అనుకోవచ్చునేమో! సంకలనకర్త ఏ అభిప్రాయంతో ఈ పేరుపెట్టినా–విషయానికి గ్రంథనామం అతుక్కునే ఉన్నది. ఏ పుస్తకానికి ఏ సంకేతం ఇయ్యబడినదో పట్టికలో చూపబడింది. ఆయా మాండలికాల కియ్యబడిన సంఖ్య పుట సంఖ్య లయి వుండాలి.

ఈ 'రావిశాఖీయా'నికి 'శబ్దవైశాఖి'ని కూర్చిన సుప్రసిద్ధ విమర్శకులు–పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు ఇలా అంటున్నారు: "రావి శాస్త్రిగారి రచనలలో వాడిన ప్రాంతీయాలు, యింకా ఇతరమైన భాషా ప్రయోగాలకు సంబంధించిన పదసూచికను, అకారాది క్రమంలో శ్రీ అత్తలూరి నరసింహారావుగారు సిద్ధంచేశారు. ఒక వర్తమాన రచయితకు ఒక వర్తమాన రచయిత చేసిన పదపూజ రావిశాఖీయ ఏ వర్తమాన రచయితకు జరగని గౌరవం యిది. అన్యప్రాంతాల సాహిత్యాభిమానులు రావి శాస్త్రిగారి రచనల్లోని మాండలికాల్నీ, తదితర ప్రయోగాల్ని అర్థంచేసుకునేందుకు యీ ప్రాంతీయ పదకోశం విశేషంగా వుపయోగపడుతుంది."

సంకలనకర్తకృషి మెచ్చుకోదగినదే! కాని కొన్నిపదాలు విశాఖ మాండలికాలని చెప్పలేము. అతిమూత్రం (వ్యాధి), ఈనడింపు, ఉష్ట్రపక్షి, కర్ణాకర్ణిగా, కొక్కోకం (కామశాస్త్రం), గమ్మున, చిచ్చు, తత్తరపాటు, తుంటర్లు, తొయ్యలి (స్త్రీ–ఇది గ్రంథాల్లో వాడేపదం) దప్పిక, నెత్తురు, పల్లెత్తుమాట, బ్లాటింగ్ పేపరు, మచ్చు, మెల్లచూపు, వాగ్రూపమైన, సంజకెంజాయ, సాకి, స్వజనాత్మకపు భాష, హాహాకారాలు మొదలైన కొన్ని సర్వసాధారణమైనవే కాని కేవలం విశాఖ ప్రాంతీయాలుకావు. వీటిని 'రావి శాఖీయం'లో ఎందుకు చేర్చారో!

ఇతరత్రా వాడుకలో లేకుండా ఆ ప్రాంతంలోమాత్రం వ్యవహారంలో ఉన్న మాండలికాలను సంకలనంచేసి ప్రకటిస్తే ఆయా ప్రాంతాల ప్రత్యేకత వ్యక్తమవుతుంది. నరసింహారావుగారి ప్రయత్నం మెచ్చదగినది. ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారు మాండలిక పద కోశాన్ని ప్రకటించారు కాని అది సమగ్రంకాదు. ఆయా మండలాలలోఉన్న సాహిత్యాభిమానులు ఆయా మాండలికాలను సేకరించి ప్రకటించడం మేలు. లేదా–ఆ మండలంలో ప్రసిద్ధుల రచనలను తీసుకుని వాటినుండి మాండలికాలను ఏర్చి కూర్చి ప్రకటిస్తే యావదాంధ్రులకూ ఎంతో ఉపయోగంగా ఉంటుంది.

*శ్రీ బులుసు వేంకటరమణయ్య*

## "మ గ ది క్కు"

[రచయిత : పైడిపాటి సుబ్బరామ శాస్త్రి, ప్రచురణ : పైడిపాటి పబ్లికేషన్సు, మారుతీనగర్, విజయవాడ–520004, వెల : రూ. 10–00.]

323 పేజీల మగదిక్కు అనే ఈ నవలలో ఆడదానికి మగదిక్కు తప్పనిసరిఅనీ, మగదిక్కులేని ఆడది సంఘంలోఅవమానాలు, కష్టాలు,బాధలునష్టాలు, అనుభవించాల్సివుంటుందని,స్త్రీకి పురుషుని నీడ తప్పనిసరి అని రచయిత పైడిపాటి సుబ్బరాను శాస్త్రిగారు ప్రతిపాత్రచేతా చెప్పించారు. ఈ సూత్రంమీదే నవలంతా అల్లబడింది.

ఇదెంత నిజమయినా, అంతకు తీసిపోని నిజం మరొకటుంది. సంఘంలో గౌరవ స్థానానికి మగవానికి ఆ డ ది క్కు అవసరం. వివాహం చేసుకోని వయస్సు ముదిరిన మగవాణ్ణి గురించి కూడా సంఘం చెవులు కొరుక్కుంటుంది. సంసారులు తమింటికి అటువంటి వానిని స్వేచ్ఛగా దానికంతగా యిష్టపడరు. గృహిణులు అతన్ని చూసి బెదురుతారు. ఆ గృహిణుల భర్తలూ హెచ్చరికగా వుంటారు. అంతేగాక ఆడదిక్కులేని మగవాడు వొంటరయిపోయి, తనని చేరదీసేవారు, ఆదరించేవారు, నా అన్న హృదయమూ లేక అవిసిపోతాడు. ప్రకృతిలో స్త్రీకి పురుషుడెంత అవసరమో, పురుషునికి స్త్రీ కూడా అంతే అవసరం. శారీరకంగా, సామాజికంగా, మానసికంగా వారిరువురూ ఒకరికొకరు అత్యంతవసరం.

అవివాహితైన స్త్రీని ఈనాడు ఒకనాడంతగా పనికట్టుకుని సంఘం వెక్కిరించడంలేదు. బాధలూ పెట్టడంలేదు. అవివాహినులు సంఘంలో హాయిగా వున్నవారూ వున్నారు, శారీరక మానసిక ప్రవృత్తులు మినహాయిస్తే.

రచయిత మగదిక్కు సమర్థన సమంజసంగా వున్నా, కొన్ని చోట్ల విషయాన్ని భూతద్దంలో చూపినట్టనిపిస్తుంది. పుస్తకం పేరు మేరకు న్యాయం చేకూర్చాల్సినవసరమున్నా, తర్కం ఎలానూ ప్రవేశపెట్టారు గనుక ఈ విషయం కూడా చర్చించి వుండాల్సింది.

ఇహపోతే పాత్ర పోషణ, చిత్రీకరణ బహు చక్కగా వున్నది ప్రతి పాత్ర స్వభావాన్ని చక్కగా పోషించారు రచయిత. శైలి, కథనం కథ బాగున్నవి. పాత్రలన్నీ చాలా యదార్థంగా వున్నాయి.

సరోజిని, సురేఖ పాత్రల పోషణ చాలా బాగున్నది. సూర్యం, రామ బ్రహ్మం పాత్రలు గంభీరంగా వున్నాయి. పుస్తకం సైజుకు మించి నదే అయినా శైలి, కథ, కథనం బాగుండటంవల్ల చదునరికి విసు గనిపించదు.

ఈ నవలా రచయిత పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారూ, ప్రచురణ కర్తలు పైడిపాటి పబ్లికేషన్సు విజయవాడ వారూ అభినందనీయులు.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఈ నవల పద్దెనిమిది వారాల పాటు వచ్చింది, అనక్ర్యాయి పుస్తకరూపంలో వచ్చింది.

— పాఠకుడు

[తోరూదత్ పద్మినీ సేన్‌గుప్త. ఆంధ్రానువాదం: శ్రీమతి నాయని కృష్ణకుమారి. వెల : 2–50. ప్రతులకు : సాహిత్య ఎకాడమీ, మద్రాసు–6.]

తోరూదత్ ప్రఖ్యాతాంగ్ల కవయిత్రుల కోవలో చేరిన రచయిత్రి ఆమె 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో వంగ దేశంలో జన్మించింది. తోరూదత్ మాతృభాష వంగ భాష. అయినా ఆమె ఆ భాషలో తన రచన లేవి వెలువరించలేదు. ఆంగ్లలోను, ఫ్రెంచి భాషలోను మాత్రమే కవిత రచించి విశ్వ విఖ్యాతి గడించుకున్నది.

తోరూ జీవించింది యించు మించుగా 21 సంవత్సరాలు మాత్రమే. ఆమె చాలా చిన్నతనంలోనే ఆంగ్లంలోను, ఫ్రెంచిలోను రచనలు వెలువరించగల పాండిత్యం గడించుకున్నది. భారతదేశంలో జన్మించినా ఈమె సంస్కృతి ఎక్కువగా విశ్వతోముఖమయి విస్తరించింది. తోరూ ఎక్కువగా ఫ్రెంచి కవితాను నాదాలే వెలువరించింది. ఇంకా నవలలు కూడా కొన్ని రచించింది. అయినా ఆ రోజుల్లోనే ఆమె మంచి ఆంగ్ల కవయిత్రిగా పేరు గడించుకున్నది.

తోరూదత్ భారతీయ పురాణ గాథలు కూడా కొన్ని కవితా రూపంలో రచించింది. ఆమె మరణించి ఇంచు మించుగా నూరు సంవత్సరాలయింది. ఇటీవలి కాలంలో ఆమె భారతీయ సాహిత్య నిర్మాతల కోవలో నిలిచింది. అయితే ఆమెఇంకా చాలాకాలం జీవించి ఉంటే ఇంకా గొప్ప కవయిత్రిగా పేరు గడించుకుని ఉండేదని ప్రఖ్యాత విమర్శకు లనేకులు ప్రశంసించారు.

డెమ్మీలో 120 పుటలున్న ఈ చిన్న పుస్తకంలో ఆంగ్ల గ్రంథ రచయిత్రి శ్రీమతి పద్మినీ సేన్‌గుప్త, తోరూదత్తు కుటుంబాన్ని గురించి, బాల్యాన్ని గురించి, రచన లన్నింటిని గురించి విపులంగా విమర్శించారు. తోరూ కవిత ఆంగ్ల కవితా వాఙ్మయంలో కొంత సముచిత ప్రవేశం గడించుకున్నది. ఈ గ్రంథంతో విఖ్యాతి కెక్కిన తోరూ ఖండ కవితలు కొన్ని ఉదాహరించారు.

ఈ ఖండ కావ్యాలు కూడా శ్రీమతి నాయని కృష్ణకుమారి గారు కవితారూపంలో తెలుగులోకి అనువదించారు. 'మా సరుగుడు చెట్టు' అన్న పేరుతో వెలువడిన ఖండ కవిత ఆంగ్లంలో బాగా ప్రసిద్ధి పొందింది. ఆ ఖండ కవిత, ఆంధ్రాను వాదంలో కొంత ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

''ఈ అద్భుత వృక్షం
తీవిగా చేలం కప్పకొని,
కొమ్మ కొమ్మకూ
సిందూర వర్ణ కుసుమ గుచ్ఛాలు
విప్పకుని,
పగలంతా తేనెటీగల్ని, పక్షుల్ని
జత కూర్చుకుని ఉంటుంది.
అంధకారంలో మా చెట్టు పాడే
అపూర్వ మధుర గానంలో మునిగి,
అఖిల జగతి విశ్రమించిన
అపరాత్రి వేళ,
తోట తోటంతా
పరవశ్లు తొక్కుతుంది.''

శ్రీ పి. గణపతి శాస్త్రి

# రచనాష్టకం :

## 1 నాంది

[ఒకబాలుని కవిత్వానికి నాంది. (కవితాసంపుటి) జి. అశోక్ క్రౌన్ 1/16. 32 పుటలు, ధర : రు 1/– ప్రతులకు: గ్రంథ కర్త, C/o. జి. రాజేశం, భీముని మల్లారెడ్డి, సిరిసిల్లా తా॥ కరీంనగరం జిల్లా.]

ఒక ఇంటర్ విద్యార్థి తన రచనా మహానాటకానికి నాందిగా వ్రాసినదే ఈ నాంది. ఆయన గురువు ఇతర పెద్దల ఆశః ప్రభావంతో, చక్కటి భరత వాక్యందాక రచనలు సాగునుగాక! ఈ బాలునికి చక్కటి వివేచనా జ్ఞానమున్నది. భావుకత గలదు. వీటికి దగిన భాషా విన్యాసం మొగ్గతొడిగి ఉన్నది, త్వరలో విప్పారగలదు.

ఇందలి ఖండికలు నేటి కాలగతి తలపోతలు. ధరలు తగ్గటాన్ని గురించి—''వస్తువు + కల్తీ=ధరలుతగ్గట'' అన్న ఈశ్లేషన మంచి చమత్కారం. ''అనాథకు వయసు శత్రువై నటనడం'', ''ఎదలోని మండే భావాల పంట'' – అన్న నుడికారం ద్వేషలేని బాల్య హృదయానికి దర్పణం. ''కాలమంటే ఊరక తిరగడంకాదు, దాని తత్త్వం తెలుసుకోవాల'' అన్నది పెద్ద మాట. ''యాత్రలు పుణ్యాలు ఇవ్వవు, తనలోని దేవుని గుర్తించు'' అని వేమనయోగి శిష్యుడౌతున్నాడు. ''మనిషి బొమ్మకాడు—మనసున్నవాడే'' అన్నది నిత్య సత్య నిర్వచనం. చందమామను గూర్చి మంచి ధోరణిలో ఉన్నది. ఈ యువ కవికి భాష ఉన్నది, భావాలున్నవి.

బాలకా, స్వతంత్ర అని ప్రయోగిస్తావు, దీని భావం స్వాతంత్ర్యం. స్తన్య క్షీరమేమిటి—పేపరు కాగితం మాదిరి. పెద్దల దగ్గర ఇంకా బాగా తెలుసుకో బాగుపడతావు.

## 2. తే నె సో న లు

[జానపద గేయ సంకలనము. సాహిత్యరత్న సజ్జా పశుపతి రావు, ఎం. ఎ.; క్రౌన్ 1/16; పేజీలు 64; వెల రు.2/–ప్రతులకు: గాయత్రీ ప్రచురణాలయం. నేటపాలెం 523 187.]

కృత్రిమంలేని ఈసహజ జాతీయ సంపద—భాషలో, భావంలో, సంస్కారంలో, పల్లెలలో పుట్టి పెరిగి ఇంకా అక్కడ శోభావంతంగా ఉన్నది. ఆ పసిడి మాటల కర్త – అనుభవంలో మాగిన పల్లెటూరి వాడే! కవితా గుణం ఉన్న నుడులు శాశ్వతాలై, సామెతలై తేలియాడుతుంటవి. జానపదులు అల్లిన గేయాలు చైతన్య పూర్ణాలు భాషలో చేవ, భావంలో పుష్టి గలిగి, హాస్యం, వ్యంగ్యం, నీతులు బ్యాతులు కలిసి రసవత్తరంగా ఉంటవి. పల్లెలవారి నర్మోక్తులు కూడ బాకులు. బైరాగుల బిచ్చగాండ్ర పాటలు తత్త్వబోధకాలు

ఇట్టి జాతీయ సంపదను ఏరికూర్చిన పశుపతిరావుగారు ప్రశంసనీయులు. వాటిని వినిపించిన వారిపేర్లుగూడ చేర్చిఉన్నారు. సంఘంలో వివిధ గ్రామీణ వర్గాల వారివి 50కి పైన పాటలున్నవి. ''చేతికి గాజులు తెస్తానన్నాడే – చేయి సాగదీసి పెడతానన్నాడే'', ''నేను మొగుడి మొగ మెరగనమ్మా, నేను ముగ్గురు బిడ్డల తల్లి నమ్మా'' – ఇదే జానపదుల వ్యంగ్యం. ''ముత్యాల నోటితో ముద్దెట్టు రాజా'' ఇట్టిదీ పల్లెటూరి వారి శృంగార భాష. ''నీ నాలుకపై ముల్లు నాటి ఉన్నదా'' ''వాడు బండిమీద వస్తాడు బడాయి నా కొడుకు'' ఇదే దేశి నుడికారంలో ఉన్న మజా!

## 3. ప రా జి త

[మాత్రాఛందంలోకరుణ రసాత్మకమైనపవిత్ర ప్రణయగాథ. కనపర్తి; డెమ్మీ 1/8 – 100 పేజీలు, వెల రు 6. ప్రతులకు: రచయిత–4–2–25, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా–505301]

కవితా శిల్పోపాసకుడు – డాక్టర్ సి. నారాయణరెడ్డి (పద్మశ్రీ అని అనకూడదట) శిష్యత్వానికి తగిన మధుర రచన ఇది. ''టేకాఫ్ స్టేజికి'' వచ్చిన కారగ్గవ వచన కవిత్వం గాక మాత్రాఛందంలో పుట్టిన తియ్యమామిడిపండు ఇది. రసౌభ్యుచిత బంధము దీనికి తొడవు. ధార–శిల్పం ఉన్నవి. కామరాగ రసంతో మత్తెక్కిన వాసవదత్త అనే నర్తకి, ఉపగుప్తుడనే ఒక బౌద్ధ భిక్షువు భవ్యరూప లావణ్యాలను ప్రేమించి, బలవంతంగా పైబడిన ఇంకొక కాముపశువును శీలరక్షణకుగా చంపి, పవిత్ర పాపి అయి, రాజభటులచే నరుకుడుబడి, తిరిగివచ్చిన ఆ భిక్షువు అలౌకికతేజాన్ని కనులార గ్రోలి, బుద్ధుని సంఘాన్ని, ధర్మాన్ని శరణ జొచ్చిన నర్తకి–నౌకవాసిని అయిన కరుణరసపూర్ణ రమణీయకథ ఇది. తుచ్ఛ ప్రేమను ధిక్కరించి అలౌకిక ప్రేమచే పరాజిత అయిన నర్తకి గదా ఈమె. కాబట్టి పరాజిత అన్న పుస్తకంపేరు బాగా అతికిపోయినది.

శృంగార వీరశోక కరుణరసాలు—చేవ చిక్కదనం కలసిన నుడికారంతో, ప్రాణవంతమైన కథక పద్ధతితో మూర్తిమంతాలై ఉన్నవి, పాఠకునికి మంచి రసానుభూతిని కలిగిస్తున్నది—రచన. ఇదే గదా చేయి దిరిగిన వ్రాతగానికి గుర్తు!

సహృదయులు – అభినవ పోతన – వానమామలై వరదాచార్యులు సాహిత్య శాస్త్రవిషయపూర్ణమైన పీఠికను వ్రాసి, రచనకు రాణింపు గూర్చి ఉన్నారు. సరే! కొత్త పెండ్లికూతురు మగనిపేరు చెప్పను సిగ్గుపడినట్లు, కవి ఇంటిపేరును చెప్పకోని తలిదండ్రులు పెట్టిన పేరును ఎందుకు దాచుకోవడం? బి. ఎ.కి–ఫోటోకు ఈ దోషం పట్టలేదు, కొంత సంతోషం. ఇంతటి చక్కటి కవి పేరు మా కందరికి తెలియపనిలేదా?

## 4. ఉదయసంధ్య

[కవితా సంపుటి. చిమనగుంట జగదీశ్వర్. క్రౌన్ 1/16 48 పొరటలు; వెల రు–2/–ప్రతులకు : దేశీ బుక్‌హౌస్, నారాయణగుడ, హైదరాబాదు.]

స్నాతకుడైన విద్యార్థిలో రేగిన కవితా చాపల్యరూపం ఇది. ఇద్దరు ఒజ్జలు వీపుదట్టి ప్రచురింపమన్నారు. అందు ఒక గురువు—డాక్టర్ సి. నారాయణరెడ్డి దాచకుండా చెప్పినట్లు—ఏదో ధార ఉన్నదిగాని శిల్పం లేదు. అర్థంగాని ఆరాటం; నెత్తురే ఈయనకు కనబడేది. అందువల్లనే కామాల టైటిల్‌పేజి రెడ్ ఇంక్‌లో పడినది. ''రాగంపాడితే తాళంవేయి'' అంటాడు. రా ని కేంది తాళం—పల్లవికిగదా! రచనంతా ఇట్టి సోడాబుడ్డి పొంగే! అచ్చు గుల తీరింది కాబట్టి. సాధనచేసి మంచి కవి కమ్మని ఈ యువకుని కోరుతున్నా.

## 5. సీమోల్లంఘనం

[కవితా సంకలనం, పణతుల రామచంద్రయ్య. డెమ్మీ 1/8 48 పేజీలు. వెల రు–3/–ప్రతులకు : నవభారతి సాహితీ సంస్థ, 15–164 కమలానగర్, అనంతపురం].

అట్ట ముఖపత్రంలో—కవి పేరుపైన, కృతిపేరుక్రింద, ఏదో ఒక కొత్త ఉండాలగదా ఆకర్షణకు! ఎక్కువగా చదువుకొన్నా ఒక బెడదే: రామచంద్రయ్య పి. హెచ్‌డి. పొందినవారు. భావాలు దాడి చేస్తున్నవి; భాష ఆ దాడి గుర్రాల గిట్టలక్రిందపడి నలిగి పోతున్నవి; చదివే వాడికి సులభంగా అర్థమయ్యేటట్లు చెప్పలేకున్నది భాషా ఫక్కి. ఈ రచనలు—ముందుమాటలో ఆర్. ఎస్. సుదర్శనం గారు వివరించినా అర్థం అంతుబట్టటంలేదు. నుడికారం చాలా చోట్ల కుదటబడలేదు. ''నిప్పు రవ్వలు ఊరుతాయి'' ''స్రవించే

ఇంధనం''—(Liquid Fuel అని కాబోలు)''నిరెండమరుకు బాగా'' అంటాడు. నీరెండ 'మాపటివేళ—కాచే మెత్తటి ఎండ కదం టయ్యా?

భావాలు కొండవీటి బావులలో నీరు మాదిరి చాలా లోతులో ఉన్నాయి. పెద్ద చేంతాడు లేదా అంతే ఓపిక కావాలగదా.

## 6. అర్థరాత్రి సూర్యుడు

[కవితా సంపుటి. జక్కని వెంకటరాజం. డెమ్మీ 1/8—72 పేజీలు. వెల రు 4/—; ప్రాప్తిస్థానం:—గ్రంథకర్త,5–2–103 సుభాష్ నగర్; సిరిసిల్ల; కరీంనగర్ జిల్లా; 505301.]

ఉత్తరనార్వే దేశపు Mid Might sun అనుకొన్నా,కాదు—తమసో మా జ్యోతిర్గమయ అన్న గంభీర భావానికి నవ్యశీర్షిక; బాగున్నది! ఈ కవి కొత్త పాతల గిలగలపు భావాలతో రెంటిమధ్య వంతెన కట్టాలనుకొనే ఆశావాది—ఉదారాశయుడు. సంస్కృతం తెనుగు తీవిగా, కమ్మగా మంచి నుడికారంతో నడపగలడు. అక్కడక్కడ ఆధ్యాత్మిక వాసనలు హాయిని గూరుస్తున్నవి. ఈయన వాడిన చిన్న చిన్న చక్కటి సమాసాలకే కుందుర్తి కోపపడుతున్నాడు. (నీలాకాశపథం) ఎందుకబ్బా ఆయనకీ అలెర్జి? వచన కవితకు ఇందొక సంకెల కాబోలు.. ఈ కవి రమ్యమైన శైలికి ఆనందిస్తాం.

''మనిషి-నీడ''లో మానవుడు తప్పించుకోలేనివి కొన్ని ఉన్నవని ఎచ్చరిస్తున్నాడు. ''మమతల వంతెన''లో అణుశక్తితో ఆటలాడుకోవద్దని. అది సర్వనాశనం చేస్తుందని మంచి అదనులో గమనం చేస్తున్నాడు. తన్ను ధిక్కరించబొయ్యే ప్రచండశక్తిని సృష్టిస్తే తన్నే మింగుతుందని గదా మన భస్మాసురకథ నేర్పే గుణపాఠం. కాలాన్ని గురించి పండిన భావాలు వెలిబుచ్చినా ''కాళ ధాత్రి''లో భావంతోబాటు నుడికారం బాగున్నది. (సంప్రదాయాన్ని సాంప్రదాయం అనడం ఎందుకు?) ''ఉషస్సు'' ఎత్తిపొడుపు రమ్యంగా ఉన్నది. అవదూతను పిచ్చివాడుగా వర్ణించడం సత్యాన్ని వెదకే మనసు చేసేపని.

భాష భావాల అరాచకంలేని రచనా సంకలనం ఇది. డాక్టర్ సి. నారాయణరెడ్డి మంచికృతికే భర్త అయినాడు.

## 7. కవితా ఝరి

(హిత సాహితివారి ద్వితీయ వార్షిక సంచిక 1976. క్రౌన్ 1/16 — పేజీలు 48; వెల రు. 2/- ప్రతులకు : కార్యదర్శి—హిత సాహితి; కామారెడ్డి; నిజామాబాదు జిల్లా -503111.)

ఇది ఈ సమితి సభ్యుల కవితా సంకలనం. ఇతర సాహిత్య సంఘాలు అనుసరింపదగిన పంథాగానే ఉన్నవి. 14గురి ఖండికలు ఇందున్నవి. సాంప్రదాయిక ఛందోబద్ధ కవిత్వం, గేయాలు, అరాజక రీతులు లేని నవ్య రచనలు ఉన్నవి. ఎవరికి ఇష్టమైనది వారిని ప్రాయనీయండి, ఏ అభిరుచి ఉన్నవారు అది చదువుకొంటారు. మొన్నటి ఎమర్జన్సీ నిర్బంధం ఎందుకు ?

అందరిలో సంస్కృతంపై మక్కువజాపే పద బంధాలు మధురంగా ఉన్నవి; ఒక్కటి గూడా పేలవంగా లేదు. అవధానం రంగనాథ వాచస్పతి ''రామలింగేశ్వరా'' అనిన అరపడి మోముల వేల్పు కైవారం, పాండిత్యం — ప్రౌఢశయ్య — సరళధార - గంభీర భావాలతో రుచులూరిస్తున్నది. ''చంద్రికాస్మేరము'' ఎంతచక్కటి కూర్పు ! ఈ కవి యతులు ప్రాసలను గురించి ఏమంటున్నాడో చూడండి :—

''యతులుం బ్రాసలు భావ వీణకును మెట్లై తీవలై కాయలై
నత నాభి ప్రమదాతిరేక కల గానీ లాప క్రమ ధ్వనిన్
ప్రతి పద్యంబు రస స్రవంతిగ కవీంద్ర ప్రీతి పాత్రంబుగా
కృత యత్నుండుగ నన్ను దీర్ప గదవే, శ్రీరామలింగేశ్వరా!''

కొందరికి, ఇవే సంకెళ్ళు గదా.

కసిరెడ్డి వెంకటరెడ్డి—కవికి చావెక్కడిది అంటాడు, ఇది సుకవి సంగతి, ఈయన హెచ్చరిక భావ గంభీరం. ''వంశి'' నా స్వామి అనే తునకలో మధుర ప్రేమను గురించి చక్కగాచెప్పినాడు, ''అపశ్రుతి''లో నడక బాగున్నది. విశ్వసూక్తంలో భావుకత ఉన్నది. ''కులములన్నీ వేరెయ్యైనను కాంక్ష లొక్కటే తీరుగాదా ?'' అని వేదన ధోరణిలో సూటిగ ప్రశ్నిస్తున్నాడు. మోహనరావు ఆకలికి ఒక కొత్త నిర్వచనంఇచ్చి నమ్మిస్తున్నాడు. ''ఆకాంక్ష''మొదలైన కొన్ని ఖండికలు మామూలు సరుకు. మొత్తం మిద సంకలనం బాగున్నది.

## 8. మాలకాకి

[శతక రూపక నిర్వేదం. డాక్టర్ అరిశె వెంకటేశ్వర్లు కవి—డెమ్మి 1/8; 16 పేజీలు; మూల్యం రు. 1–50 ప్రతులకు—గ్రంథకర్త; రాజమ్మ నర్సింగ్‌హోం; అయ్యవారిపేట; సత్తుపల్లి; ఖమ్మంజిల్లా - 507303.]

ఇది ''మాలకాకి చెప్పు మాకు నొప్పి'' అనే మకుటంతో, ఒక చదువుకొన్న హరిజనుని సుకుమార హృదయం — అణచిపెట్టిన సంఘంమీద ఆక్రోశము, తమ దుఃస్థితిపై ఆవేదన వెలిబుచ్చే శతక రూపక పద్య రచన సూటిగా చెప్పగలిగిన భాష శైలి పొంగారుతున్నవి. ''సొంపులేని కవిత కంపుగొట్టు'' అని కవులుగాని కవులను మంచి దెబ్బే కొట్టినాడు. పద్యాలలో సొగసైన వ్యంగ్యం, ఎత్తిపొడుపు ఉన్నవి. సరళమైన నడక. ఇంకా సాధనజేస్తే వేమనయోగి శిష్యుడౌతాడు.

చదువుకొన్న ఈ కోవవారు అంబేత్కరుని గాంధి కంటె గొప్ప జేయడం మహాపచారం. గాంధీజీకి ముందు కేరళ నారాయణ గురుదేవుడు (హరిజన)దీనికంటే ఎంతోముందు తిరుప్పాణి ఆళ్వారు

—నాయనమార్ నందనారు మొదలైన హరిజనులు గుణ గౌరవాన్ని బట్టి పూజింపబడినారు. ఇప్పుడు హరిజన మమ్మిడివరం బాల యోగి సవర్ణులచే పూజింపబడుతున్నాడు. గాంధీజీ ఈ యుగంలో జాగృతి కలిగించి అంటరానితనానికి అంటుకొని ఉండిన అంటును కడిగివేసి ఆత్మగౌరవాన్ని కలిగించినాడు. ఇదీ ఉన్న సంగతి.

ఆంధ్రలో వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, గూడూరు రామచంద్రుడు, ఉన్నవ లక్ష్మీనారాయణ (మాలపల్లి నవల) మొదలగు బ్రాహ్మణులు, గాంధి ఆశ్రమాలు అస్పృశ్యతా నిర్మూలనానికి పాటుబడినారు. తిరువాన్కూరు మహారాజు హరిజన దేవాలయ ప్రవేశ శాసనంలో సంఘ గౌరవాన్ని నిలబెట్టినాడు. దేశ మందంతటా అంటరానితనాన్ని పాటించే అక్షరాస్యుడులేడు—ఇదంతా గాంధీజీ పుణ్యం. పల్లెలలో జగడాలు రాజకీయాలు,

వీరందరి కంటే ఎక్కువగా ఒక్క అంబేద్కరే హరిజనులను ఉద్ధరించిన అవతారం అంటే హాస్యాస్పదం. ఆయన గొప్ప మేధావి, కాదనేవారు లేరు. హరిజనులను రెచ్చగొట్టి, ద్వేషాలు ఎక్కించి, ఆయన జారుకొని బౌద్ధంలో చేరడం మాత్రం హరిజనసేవ అని పించుకోదు. ఈ పక్షంవారు అంబేద్కర్‌తోబాటు మిగతా హరిజ నోద్ధారకులను పేర్కొనడం కృతజ్ఞతా సూచకంగా ఉంటుంది.

ఈ డాక్టర్ శతక కవిగా మంచి సుద్దులే చెప్పినాడు.

## బ్రతుకుబాట

[సాహిణి వెంకట లక్ష్మీపతిరావు. (సూపరింటెండింగ్ ఇంజనీరు.) క్రౌన్ 1/16–70 పేజీలు—వెల రు 3–50, ప్రతులకు: గ్రంథకర్త—సూపరింటెండింగ్ ఇంజనీరు, ఇరిగేషన్ సర్కిల్; ఏలూరు (ప. గో.)]

ఈ గ్రంథకర్త సూపరింటెండింగ్ ఇంజనీరుగా పనిచేస్తూ కవితాలక్ష్మిని ద్వితీయ ఆరాధ్య దైవంగా ఆరాధించి, కందపద్యాలను కవి చౌడప్పవలె నడిపించడం ప్రశంసనీయమైన వ్యాసంగం. జీవితంలో ఉచ్చనీచాలను, బ్రతుకుదెరువులో చీకటి వెలుగులను మానసిక తత్త్వశాస్త్రరీత్యా బాగా వర్ణించినారు. నాయిక—రజని వెలయాలుగా అన్ని స్థాయి ప్రజల చేత పొగడ్తలు, ముదుపులు చెల్లింపజేసుకొన్నది. ఆపేరోగాలతో కుళ్లి చెడగా—ఆపెపైట చెరగు గాలికి ఉవ్విళ్లూరిన ఆరసికులే, అదేనోళ్లతో ఆమెను నిందించినారు; లోకులు కాకులు గదా! ఈలోకపు పోకడను కవి రసవత్తరంగా, హాస్య నిందోక్తులతో చెప్పినారు.

ఇప్పుడు విమానాలలో ఎగిరేస్వాములవంటి కపట సన్యాసులను బాగా జాడించి, కృత్రిమ ఆధ్యాత్మిక గురుబ్రువులను, వారి వంచన లను లోకానికి చాటినారు. రజని చెడి, ఆధ్యాత్మిక వాసనా బలంతో కాంతిమతి అయినదనడం ఒక శాస్త్రాంశం. పాతచింతామణి వలె శ్రీకృష్ణుని ప్రత్యక్షం చేసుకోకుండా, జీవితయాత్రను బుజువుగా గడపినది. ఇది ఒక ప్రాయికమైన ఔచిత్యం. ఆత్మశాంతికి ఒక స్వామిని ఆశ్రయిస్తే ఆయన రాధామాధవ ప్రేమపైకి ఉబకగా ఆమెను వేధించి చిత్తానికి ధీరత్వాన్ని కలిగించినాడు. ఈ ఘట్టాలలో—చివరన—కథకచాతురికి కొంత కాంతి తగ్గినదనవచ్చు. నీతి శాస్త్రోపన్యాస ధోరణిని రవ్వంత తగ్గించి ఉంటే కవితా రీతికి మెరుగు బెట్టినట్లుండేది.

రాగవిరాగ విషయాలు సొంపైన నుడికారంలో వర్ణింపబడి ఉన్నవి. సినిమా తారపై మోజుతో ధనిక స్త్రీ పురుషులు "ఆమె ప్రేమభిక్షలందుకొని" క్రుమ్మరించే మోహాన్ని ఎత్తి పొడుపులతో కొడిగం పట్టించి, సతనాసక్తిని పెంచుతున్నారు—బాగాచేయిదిరిగిన ఈ ఇంజనీరు కవి:

అర్థవంతమైన పదప్రయోగంతో ఒయ్యారి నడక గలిగిన కవిత హృద్యంగా ఉన్నది. "బ్రతుకు బాటలోని పలుసమస్యలపైన తరచి తరచి బ్రతుకుధారవోసి, బ్రతుకు తుండి గూడ బ్రతుకంటే తెలియక కాలగర్భమున కలసినారు" అని అంతర్ముఖమైన మానసిక స్థితిని వెలిబుచ్చుతూ— "జగము నాటక రంగము, జనులు దాన, సూత్రదారుడు నియమించుపాత్రలెల్ల విపరీతులనటియించి వేస రిల్లి మట్టిలో తనను గతురు తుట్టతుదకు" అని ఒమ్మర్ ఖయ్యాం బాణీలో, జీవిత సమస్యలను పరమార్థాన్ని అర్థంచేసుకొని ఆత్మశాంతి కలిగేమాటలలో చెబుతున్నారు. ఒక సందేశ లక్ష్యంగా వ్రాసిన రచన ఇది.

'బ్రతుకుబాట' అనేదానికన్న 'బ్రతుకు దెరువు' అంటె తెనుగుదనం ఇంకా బాగుండేది.

## సారస్వత వివేచనము

[సమీక్షా వ్యాసాలు. రాచమల్లు రామచంద్రారెడ్డి, డెమ్మి 1/8–180 పుటలు; వెల రు. 6/– ప్రతులకు :విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్; విజయవాడ—4.]

ఇది వివిధ గ్రంథసమీక్షల, వాదోప వాదాల సంకలనం. గ్రంథకర్త మంచి చదువరి. విమర్శన అభిమాన శాస్త్రంగా అభ్య సించినట్లున్నది. ఇంగ్లీషు గ్రంథాలలో చాలా లోతుకు దిగినవాడు. తులనాత్మక పరిశీలన పాఠకులకే బాగాపనికి వస్తుంది; దృష్టి భేదాలతో ఇక్కడ పనిలేదు.

రచయిత ఇంటిపేరు రాచమల్లుకు, తగినట్లే జెట్టీగా అందరిమీదికి కుస్తీకి సవాల్ చేస్తాడు. విశ్వనాథం—సుదర్శనం—సాంబశివారెడ్డి—అద్దేపల్లి రామమోహన్—శ్రీశ్రీ—చలం—మొదలైన వారిని పొగడుటో తెగడుటో ఈ పుస్తకానికి పల్లవి—అనుపల్లవి ఈయన శ్రీశ్రీ కోవవాడంటే గురజాడను మాన్యపరచుటేగదా! గురజాడ పూర్వాచార పరాయణతను, అంధమత విశ్వాసాలను వీరు బయట బెట్టరు; కలగలుపుగా ఉంటే బాగుంటుంది గదా!

పూర్వం—వేదం గిడుగు కొక్కొండ వివాదాల మాదిరి, ఇప్పుడు రేగిన సాహిత్య—భావస్పర్ధకు పుస్తకరూపం ఈ సంకలనం. ఈయన అన్యవాదాన్ని సహానుభూతితో చూచేటట్లులేదు.

భాష నిష్ఠూరమైనా స్పష్టంగా ఉన్నది. పాఠకునికి నచ్చినా నచ్చకపోయినా వ్యాసాలు విషయపూర్ణాలు.

## వర్తమానం :

[వ్యంగ్యరచనలు. డి. వి. సుబ్బారావు, డెమ్మి 1/8–64 పేజీలు; మూల్యం రు 3–ప్రతులకు : ఇందూరుభారతి; అశోకవీధి, నిజామాబాదు.]

తెనుగులో 'Satire' అనే సూక్ష్మ విభజనలేక, ఈ ప్రక్రియ ఇట్లుగానే రూపొందినది. కాని. జగ్గకవి చంద్రరేఖా విలాపంవంటి వేణుగోపాలశతకం వేమనపద్యాలబోలు అవహేళనము—ఎత్తిపొడుపు పుస్తకాలు మంచివి కొన్నిఉన్నవి. ప్రతిదానిని సత్యదృష్టితోనే వక్రంగా చూచి ఎగతాళిచేసి, మంచిత్రోవచూపడం ఒక విశిష్ట రచనా ప్రకారము చాటుపద్యాలు నోటికి వచ్చినంత సులభంగా నీతిపద్యాలు రావుగదా !

పాత ఇందగారీ కొత్త నిజామాబాదు. ఈ సాహిత్యసంఘం తెనుగుపేరుపై అభిమానపడటం సమంజసమే. తెలంగాణాలో ఇతర ఆబాదులుకుగూడ ఈ పనిచేస్తే బాగుంటుందేమో !

ఈ రచయిత—సుబ్బరావు పొట్ట దెప్పొడుపులపుట్ట. వీటితో పోలీసు దెబ్బలుకొడుతాడేగాని గాయాలుపడవు. ఈవ్రాతలో అన్నిటా చమత్కారము ఛలోక్తి ఉన్నందున దెబ్బతేలిపోతున్నది. ఈవక్రోక్తి పండితునికి మాటలవిరుపు పదాలజోడింపు బాగా తెలుసు

ఈ పుస్తకం ప్రతిఖండికలో ఏదో ఒకవిధమైన నవ్యత ఉన్నది. రచన మొదటమొదటిపేజీలలో పలుచనై. పోనుపోను మంచి పాకానపడినది. రాజకీయాలు, సాహిత్యాలు, సంఘాచారాల—అన్నీ ఈయన దెబ్బతిన్నవే. సాహిత్యంలో మితిమీరిన ప్రతిపంథాను ఎత్తిపొడిచినాడు. హిందూగృహస్థులు దేవుడన్న అతిథిని బాగా జాడించినాడు. (తిథి అంటే—ఒక నిర్ణయంలేకుండా వచ్చినవాడు అతిథి, తెలిసినవ్యక్తి చెప్పివస్తే అభ్యాగతి అని పండితుల నిర్వచనం] ''గింత అన్నాలమా?''లో తెలంగాణా గ్రామ్యం బాగున్నది. గోదావరి ఇంకదు—తెనుగుదనం చావదని గర్వంతో చెప్పుకొంటున్నాడు.

''ఊసరి వెల్లిపూపార్టీ చిహ్నం'' అనడం, నేటి ఆయారాం గయారాం వంటి కరగోడ దాటుడుగాండ్రను కుచ్చులపాదరక్షతో బాగా కొట్టినాడు. ''నేను కవిని''లో సరుకులేని కవి వేషధారుల బాగా పారబట్టినాడు. ''ప్రక్కవాళ్ల ప్రమిదలో చమురుకాజేసే'' ధర్మకర్తలమీద దండయాత్ర. ''సహజీవనం'' అనే ఘాటైన శకైరులో ''పడుగుపేకల్లా అల్లుకపోయాయి. కరెంసీలో దొంగ నోట్లు'' అన్న భాషబాగున్నది. ''విరోధాభాసల''లో ఎన్నో కొత్త సామెతలు సంతనపరచినాడు :— సరస్వతీబాయికి చదువులేదు. సుందరికి సౌందర్యం పేరులోనే— మొదలైనవి.'' ''పింఛనుదారు వాంఛ'' చెడ్రిబతికి ఉద్యోగాలలో ఉండే నిర్దయాత్ముల అవచేష్టలు చెప్పబడినవి. ''కల్యాణం చేయకండి'' మొదట లోకకల్యాణం చేయమంటున్నది.

''రెండవతరగతి రైలుపెట్టె''కి ఆపాదమస్తకం ప్రాణవంతమైన కోడిగం. దీనికి పుష్పకానికి కలియుగరూపం అని మంచి పేరే బెట్టినాడు. పుస్తకానికి తప్పొప్పుల పట్టిక ''అందమైన హస్తానికి ఆరవవేలు'' అన్నది బాగాలా? [లేదా అనుటకు నెల్లూరు దేశ్యం] ఈ పుస్తకపఠనం మాటకారికి గడుసుసామెతలను అందిస్తుంది.

*శ్రీ చెరువూరు కోదండరామరెడ్డి*

## కళిఙ్గదేవ

[రచన : జి. ఆర్. వర్మ, ప్రచురణ : వర్మన్ పబ్లికేషన్సు తాడేపల్లి గూడెం. పుటలు : 203; చిత్రఫలకములు : 11; వెల. రు. 30 లు – 1971]

''కళిఙ్గదేవ'', శ్రీ జి. ఆర్. వర్మగారి ముద్రితా ముద్రిత సచిత్ర రచనల మూడవ సంపుటి. ఇందులో ఉభయకుశలోపరి, పోషకాభిమానులు, ప్రకటనలు, ఆశీస్సులు, అభిప్రాయములు, సమీక్షలు గాక 21 శీర్షికల క్రింద వివిధ విషయములపై చర్చచేయడం జరిగింది.

## నీరు - నారు :

ప్రాచీన నాగరికతా కేంద్రాలైన యూఫ్రటిస్, నైలు, సింధు తీర ప్రాంతీయుల చరిత్ర, ఆదిమ మానవుని వివిధ జీవిత దశలు, సింధు సంస్కృతి వ్యాప్తి, ఆ నాగరికతకు కారణ భూమితులు ఆర్యులా లేక ద్రావిడులా, హరప్పా వారి మచ్చిక జంతువులు మరియు వారి ఆహార విషయముల గురించి, శ్రీ వర్మగారు సూచ్య ప్రాయముగ చర్చించిరి.

## సుదేష్ణా పుత్రులు :

నియోగాచారపు పురాతనత్వము [illegible] చర్చించిరి. శ్రీ వర్మగారు, P. V. Kane: History of Dharma Shastra, Vol. II, Part. I, Poona, 1941, pages 599–607; Nagapur University Journal; VOL. XVII, No. 1, 1966, pages. 21–25. చూచినట్లయిన ఈ విషయముపై నిశితమైన విమర్శ చేసి వుండేవారు. ఐతరేయ బ్రాహ్మణము నందు ఆంధ్రులను సుదేష్ణ పుత్రులను కలిపి చెప్పినందువల్ల వీరిరువురు ఇరుగు పొరుగువారై వుంటారని, బౌద్ధుల కాలంలో వీరు వింధ్య (మధ్యప్రదేశ్) ప్రాంతాల నుండి కృష్ణా గోదావరీ ప్రాంతాల చేరినట్లు, ఆదిలో ఆంధ్ర కళింగాంతర్భాగముగ నుండెడిదని శ్రీ వర్మగారు భావించిరి (పుటలు. 9–10).

## కళింగ

కళింగమునకు తమిళాన నాజూకు అని అర్థము. కళింగమున కాళింగు లెక్కువ. కళింగపట్నమునకు పూర్వ నామములు కన్నగర,

కాటికర్దన, కార్తికేయధామము (పుట 13). ''ఆగ్నేయాసియాలో క్లింగ్, కోయంగ్, హోలింగ్, తిలంగ్, త్రైలంగ్ శబ్దాలు కళింగనే సూచిస్తాయట'' (పుట. 14) అని శ్రీవర్మగారు ఒక నూతన నిరాధారమైన సిద్ధాంతమును ఈ శీర్షికలో పొందుపరచిరి. కళింగ క్రీ.పూ. 6వ శతాబ్దానికి పూర్వమున్నదని, శిశునాగులు, నందులు మరియు మౌర్యులనాడు కళింగ మగధ సామ్రాజ్యములో నంతర్భాగముగ నుండెడిదని వ్రాసిరి. కళింగ–సింహళ రాజుల మధ్య జరిగిన వివాహములను, సముద్రగుప్త–హూణుల కళింగపై దండయాత్రలను, కళింగను పాలించిన ఇతర రాజవంశముల చరిత్రను గురించి, పది పుటలలో చాల చక్కగ శ్రీవర్మగారు వివరించిరి.

శ్రీ వర్మగారు కళింగ స్త్రీల గురించి :

''మహాభారతమున మధిరాసక్తలైన మగువల జాబితాలో కళింగ స్త్రీలున్నారు. ఉత్కళ, కళింగ, కాన్యోధ, దక్షిణ కోసల గౌడ లక్ష్మణసేనుని సామంత రాజ్యాలు. ప్రతిపత్తు (పాడ్యమి) నాడు లక్ష్మణసేనునికి కళింగ స్త్రీల వర్ణించేవారు. అతని శాసనాలలో న్యూకళింగ భామినీ కామకేళీవిలాస (అను బిరుదు)వుందట''. (పుట. 21).

## త్రికళింగ

కళింగకన్నా త్రికళింగ ప్రాచీనము. తొలిగాంగ ఇంద్రవర్మకు త్రికళింగాధిపతి బిరుదము గలదు. (పుట. 26) తొలిగాంగులలో త్రికళింగాధిపతి, కళింగాధిపతి బిరుదులు వహించిన రాజులు గలరు. దీని నాధారముగ, శ్రీ వర్మగారు త్రికళింగ, కళింగ వేర్వేరు ప్రాంతములైయుండవచ్చునని యూహించిరి. ఇది క్రీ. శ. 6–9 శతాబ్దముల మధ్య జరిగి యుండవచ్చునని కూడ భావించిరి. గాంగ త్రికళింగ ధిపతుల రాజధానులు క్రీ. శ. 1135 వరకు శ్రీకాకుళం జిల్లాలో వుండెడివని, త్రికళింగ జనులు వాయుర్యోత్తరాల నుండి పారివచ్చిన వారసులని వ్రాసిరి (పుట. 27). దేవతా వాచకమైన తిలింగ్, త్రైలింగ్‌ను పండితులు త్రికళింగ చేసినారాయను సంశయము, మరియు తెలగ, తెలుంగి, తెలుగు, పదాంతల్లి తిలంగ్, తిల్లింగ్, త్రైలంగ్ అయ్యిందునా? అని వెలిబుచ్చిన శ్రీ వర్మగారి వూహ నిరాధారములు. (పుట. 27).

## సప్తకళింగ - ఉడ్ర - ఉత్కళ :

చక్రకూట నాగవంశీయుడైన సోమేశ్వరుడు (క్రీ. శ. 1068–98) సప్తకళింగాధిపతి బిరుదాంకితుడు. ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్‌లోని కొన్ని భాగముల కలయికయే సప్త కళింగమని శ్రీ వర్మగారు వ్రాసిరి. ఉత్కళ, ఉత్తర కళింగ, ఉడ్ర వేర్వేరు ప్రాంతాలని; కళింగ, త్రికళింగలంత ప్రాచీనము కావనిరి. భగల్పూర్, బాదల్, రాష్ట్రకూట, భువనేశ్వర, ఆదిల్‌పూర్ శాసనములలోను, మరియు ''మదాలన పంజి'' నందున్న ఒడ్ర, ఉత్కళ, ఒడ్డర ప్రశంసలపై చర్చ జరిపిరి. ఉత్కళ, ఒడ్ర వుత్పత్తుల గురించి కూడ శ్రీ వర్మగారు ఈ శీర్షికలో వ్రాసిరి.

## మహేంద్రగిరి :

మహేంద్రగిరి తూర్పు కనుమలలో నొక భాగము. దీనికి మరియొక పేరు మందసా కొండ. శ్రీ వర్మగారి యభిప్రాయములో కాళిదాసు–దండి నుండి కాకతీయులవరకు, కళింగరాజులు మహేంద్రనాథులు. తొలిగాంగుల దైవమైన గోకర్ణేశ్వర స్వామి మహేంద్రాచలవాసి. కామార్ణవుడు మహేంద్రాచలవాసి కృపచే కళింగ రాజాయెను (పుటలు 34–35).

## కళింగ గంగు - ఖబడ్దార్ కవి :

ఈ శీర్షికలో శ్రీ వర్మగారు వేములవాడ భీమకవికి, రాజ కళింగ గంగుకు మధ్య జరిగిన సంఘటనను గురించి వివరించిరి. ఈ సంఘటనపై పలు పరిశోధకులు వెలిబుచ్చిన అభిప్రాయములను నిశితముగా విమర్శించిరి. వేంగి రాజకీయ చరిత్రపై శ్రీ వర్మగారికున్న పరిజ్ఞానమునకు ఈ శీర్షిక యొక మచ్చు తునక.

## నగరం

ఖారవేలుని రాజధాని ముఖలింగ నగరమని భావించిన పరిశోధకుల వూహ సరైనదికాదని శ్రీ వర్మగారు సహేతుకముగ జూపిరి. జైనుల కళింగ నగరము, గాంగుల కాలమునాటి కళింగ–దంత పురాలగురించి యీ శీర్షికలో సమగ్రచర్చ జరిగింది. ఈ సందర్భములో, శ్రీ వర్మగారు, చైనా యాత్రికుని రచనలు, పురావస్తు శాఖవారి పరిశోధనా ఫలితాలను, పాశ్చాత్య చారిత్రికుల అభిప్రాయములను, చాల చక్కగ అవగాహన చేసుకొని ఇచ్చట పొందుపరచినారు.

## గంగా-వంశీ-నదీ :

కళింగ గాంగులు గంగాతీరస్థులు. వివిధ కాలాల్లో కళింగ రాజ్య విస్తీర్ణంబట్టి జూచినా గాంగులగంగ గంగానది అనిపించదు. మరి గాంగుల గంగ ఏది ? ఈ విధముగ శ్రీ వర్మగారు ప్రారంభించారు ఈ శీర్షికను. కదంబ గాంగులు, కళింగలోని గంగామల్ల కదంబులు, క్రీ.శ 10–11 శతాబ్దములలోని దక్షిణాపథ రాజుల వంశోత్పత్తిని గూర్చిన వింత విషయాలను విపులముగ చర్చించి; చివరకు గంగామల కులస్థులు, గంగాన్వయుల పాలనా చరిత్ర, వంశధార ప్రాంతమునుండే ప్రారంభమైనదని వ్రాసిరి.

చోడగంగు క్రీ. శ. 1078 వేయించిన ముఖలింగ తామ్ర శాసనపు మూలమును, ఆ శాసనమునందున్న ముఖ్య అంశములను ''ముఖలింగ రాగి పతా'' అను శీర్షికలో చర్చించిరి.

## ముఖలింగము :

"శ్రీ ముఖలింగేశ్వర మహత్మ్యము", "స్కాంధపురాణము"లలోనున్న కళింగ శబరులజన్మవృత్తాంతమునకు సంబంధించిన గాథలను గురించి విపుల ప్రశంస చేయడం జరిగింది ఈ గాథను వివరించు శిల్పము, మధూకేశ్వరాలయానకు ఎదురుగనున్న ప్రహరిపై మలచబడియున్న విషయమునుకూడ శ్రీవర్మగారు పరామర్శించిరి. ముఖలింగనామోత్పత్తిని గురించి, అచ్చటున్న లింగ అపూర్వత్వమును గురించి, ఆ ప్రాంతమునకు చేరు వివిధ మూర్తుల గురించి విపులముగ వ్రాసిరి. ముఖలింగము పరిసర ప్రాంతములోనున్న దేవాలయములు, వాటి కాల నిర్ణయమును గురించి సూచ్యముగ వ్రాసిరి. అన్నిటికన్నా ముఖ్యమైనది మధూకేశ్వర దేవాలయమని, దానిలో సప్తమాతృకలు, గరుడారూఢ విష్ణువు, శివపార్వతులు పాచికలాడుట, సప్తాశ్వరథియైన సూర్యుడు, ప్రముఖమైన శిల్పములని వ్రాసిరి శ్రీ వర్మగారు సోమేశ్వరు, భీమేశ్వర, మధూకేశ్వరదేవాలయములలోని ముఖ్యశిల్పముల ప్రతిమా లక్షణములను వివరించివుంటే చాల బాగుండేది. మధూకేశ్వరాలయానికి ఈశాన్యమునందున్న రత్నగిరి కొండను దర్శించకయే శ్రీ వర్మగారు అచ్చటి శిల్పమును గురించి చర్చించుట పరిశోధక లక్షణముగాదు. "పొరపాటు" అనుట దానికి జవాబు కానేరదు.

## వారాహీ-మధుకేశ్వరపత్ని :

శ్రీ వర్మగారు ఈ శీర్షికను : "ప్రపంచ తెలుగు మహాసభా సారుధులు ఎరుగరో, ప్రాంతీయ ప్రజా ప్రతినిధులూ, మంత్రులూ మరచారోగాని ఈ సభలలో తెలుగునాటి రాజులు కళింగ గాంగుల ప్రశక్తిలేదు......గాంగులగూర్చి ఒకే ఒక వ్యాసకర్త పదిపంక్తులు వ్రాసెను. అందులో మధుకేశ్వరాలయపు ఉత్తర ప్రాకారాని కంటియున్న చిరుదేవళంలో ఉన్నది వారాహి అనీ, ఆమె మధుకేశ్వరుని దేవి అని ఉంది" అని ప్రారంభించారు. ఆంధ్రదేశమును కొన్ని శతాబ్దముల పర్యంతము పాలించి, ఆంధ్రులకు అజరామరమగు కీర్తి ప్రతిష్ఠలను తెచ్చి పెట్టిన కళింగ గాంగుల చరిత్ర "తెలుగు మహాసభా సారథుల" దృష్టి నాకర్షించలేదంటే కడు విచారకరమైన విషయము. ఈ విషయ ప్రకటనకు శ్రీ వర్మగారు అభినందనీయులు.

శ్రీ వర్మగారు వారాహి మధుకేశ్వరుని పత్నికాదని వూహించిరి. కాని ఆ మూర్తి రాజరాజేశ్వరియా, కిరాత వరాహియా లేక మరేదైనా మూర్తియా అని సంశయమును వెలుబుచ్చిరి. శ్రీ వర్మగారిచ్చిన వర్ణననుబట్టి ఆమూర్తి దుర్గాదేవియైయుండునని నా వూహ. చూడుము : **J. N. Banerjea; The Development of Hindu Iconography, Calcutta, 1956, pages,** 489-509. ఇదే శీర్షికలోనే, పంచాయతన పద్ధతి, బౌద్ధ—హైందవదేవాలయముల మసీదులుగా మార్చిన సంఘటనలు, శిరిమాదేవి, అలంపురపు కబంధమూర్తి, సప్తమాతృకలు, సింహము, వృషభము, పంది, ఎలుకల ప్రాముఖ్యత (బాబిలోనియా, పైప్రసు, గ్రీసు, ఈజిప్టు మరియు క్రీటు దీవులలో), జాజిపుర బౌద్ధక్షేత్రము, ఇతర దేశాలలో నృసింహమూర్తి గాథల గురించి శ్రీ వర్మగారు చర్చించిరి. ఈ శీర్షికలో, శ్రీ వర్మగారు వ్రాసినట్లు "అసందర్భ, అప్రస్తుత, అధిక ప్రసంగము" (పుట. 117) ఎక్కువగ కనుపించుచున్నది.

## గోకర్ణ మధూకేశ్వర :

క్రీ. శ. 7వ శతాబ్దము మొదలు 11వ శతాబ్దమువరకు వివిధ రాజులు వేయించిన శాసనములలోని గోకర్ణ—మధూకేశ్వరుల ప్రశంసల గురించి ముచ్చటించబడినది. మధూకేశ్వరాలయ శిలాశాసనములలో కనుపించిన దేవుని వివిధ నామములను, దీపదానములు చేసిన రాణులను మరియు మధూకేశ్వర ఆలయ నిర్మాణ కాలమును గురించి సమగ్రమైన చర్చ జరిగినది. శ్రీ వర్మగారు **K. C Panigrahi: Archaeological Remains at Bhuvaneswar 1966; R. Mitra: The antiquities of Orissa, VOLS 1-II, Reprint–July 1961; K. Sundaram: The Simhachalam Temple, Waltair, 1969,** గ్రంథాలను చదివుండినట్లయిన ఈ శీర్షికను ఎంతో రామణీయకముగ, పరిశోధకుల మన్ననపొందే విధంగా రచించ వీలుండేది. కాని "వాస్తు ప్రతిమ శిల్ప సాంప్రదాయాలను గూర్చి వ్రాయుట కనర్హుడను" అని శ్రీ వర్మగారే వ్రాసుకొనినందున పై దేవాలయముల వాస్తు శిల్ప సంపదలను గురించి సమగ్రమైన విమర్శ చేయలేకపోయిరి.

## కళిఙ్గదేవ

భుజములపై, తలలపై ఆకులు మరియు కొమ్మలున్నట్లు చూపబడిన మూర్తులగురించి; అరేబియా, ఈజిప్టు దేశాలలో చెట్ల పవిత్రత మీదనున్న నమ్మకాలగురించి, బుందీ రాజవంశ కులదేవత గురించి, జన జీవన గాథలలో వృక్ష ప్రమేయాన్ని గురించి విప్పచెట్టు ప్రత్యేకతను గురించి, విప్పచెట్టునుండి మధూకేశ్వరుడు ఉద్భవించిన ఉదంతమును గురించి చర్చించిరి.

"కళిఙ్గదేవ" శీర్షికక్రింద పై విషయములు చర్చించుట అప్రస్తుతమూ, అసందర్భము.

## కళింగాన కాలూనితే :

జైన బౌద్ధమతములు కళింగములో ప్రవేశించుట్లు ఆ మతలను పోషించిన రాజులు, చీనా యాత్రికుని రాకనాటికి కళింగలోని మత పరిస్థితులు, లకులీశ—పాశుపతశైవము, బౌద్ధ సంఘారామములలో ప్రవేశించిన భోగిలాలసతను గురించి శ్రీ వర్మగారు చక్కగా వివరించిరి.

## ఆదిమకాండ :

ఈ 'ఆదిమకాండ' శీర్షికలో కాలప్రభావమును గూర్చి దైత్యులు—దశ్యులగురించి, అగ్నిసంభవులు, ఆదివాసుల ఆచారాల

పురాణేతిహాసాలలోని చేర్పులు మరియు మార్పులు, మౌర్య—గుప్తుల పరిపాలనా కాలమునందలి గ్రామీణ వ్యవస్థ, బ్రాహ్మణ్యం దిగజారుటకు కారణములు, నీలగిరి తోడాలు, మద్యపాన నిషేదము మొదలగు విషయముల కూలంకషముగ చర్చించిరి.

## గాంగులు :

కళింగను శైలోద్భవులు, భౌమకరులు, సోమవంశీయులు మరెన్నో రాజవంశములు పరిపాలించినవి. అందరికన్నా గాంగులు సుప్రసిద్ధులు. వీరు ఆదిలో సామంతులుగ నుండి తరువాత సర్వస్వతంత్రులై మహోజ్వలముగకళింగను పాలించిరి. వీరికి చాళుక్య, చోళ, వైదంబులతో వివాహసంబంధములు గలవు. శ్రీ వర్మగారు ఈ శీర్షికలో గాంగుల గురించియేగాక, కర్ణాటక జాహ్నవేయుల వంశోత్పత్తి, గొండ్లు, శబరులు, చోడగంగు వంశగాథలు, పురగిరి క్షత్రియులు మొదలగు సంశములను కూడ చర్చించడం జరిగింది.

## అవతారాలు :

భారతీయ అవతారాల సంఖ్యకు ఇరాన్ అవతారాల సంఖ్యకు మధ్యనున్న బేధమును శ్రీ వర్మగారు చర్చించిరి. కళింగాలయ శిల్పములలోనున్న అవతారమూర్తుల గురించి, పూరిదేవుడు ఆదిలో శబరదైవమని వెలుబుచ్చిన పరిశోధకాభిప్రాయముల గురించి, ప్రాచీనములో కళింగ కుత్తరాననున్న రాజ్యాలలో ప్రముఖముగనున్న సోదర — సోదరీ పూజలను గురించి, బుద్ధావతారమును గురించి, సాలిహుండ కాలమును గురించి నిశిత పరిశీలనాత్మక దృష్టితో చర్చ జరిపిరి.

## కాళింగులు :

బ్రాహ్మణులు గాంగులనాడు అసంఖ్యాకంగా కళింగ చేరినట్లు, వారు భూదాన గ్రహీతలై, తరువాత భూకామందులై భూస్వామ్య వ్యవస్థకు దారి తీసినట్లు శ్రీ వర్మగారి అభిప్రాయము. బ్రాహ్మణులు సముద్రయానము నిషేధించుట నౌకా వాణిజ్యమునకు ఒక గొడ్డలిపెట్టు అని శ్రీ వర్మగారు చాల చక్కగ చెప్పిరి. కళింగ వైశ్యులకు తూర్పు దేశాలతో వున్న వర్తక సంబంధాలను గురించి వివరించిరి. భౌమకర — గాంగులనాటి వాణిజ్య కేంద్రాల గురించి, పెనుగొండ వైశ్యుల గురించి, పరిపాలనా ప్రాంతవిభాగాల గురించి ముచ్చటైన చర్చ చేసిరి.

ఈ సచిత్ర రచనల సంపుటిలో 114 చిత్ర ఫలకములు గలవు. ఏ శీర్షికలో కూడ ఈ చిత్రఫలకముల సంఖ్య నివ్వటంగాని, వాటి ప్రాముఖ్యతను గురించి చర్చించుటగాని లేకపోవుట విచారకరమైన విషయము. ఈ సంపుటిలో శ్రీ వర్మగారు, కొన్ని ఆధార రహితమైన అభిప్రాయముల వెల్లడించుట జరిగింది. కొన్ని మాత్రమే, స్థలాభావమువల్ల, ఈ క్రింద పొందుపరచుచున్నాను.

1 ''యవలు తిన్నది ఆర్యు:, అది యవ్యనాటిక కాబట్టి హరపావారు ఆర్యులంటారు. వారి భాష సంస్కృతమ్ — సంస్కృతమ్ నాటి భాషల సంస్కరణకాదా?'' (పుట. 5)

2 ''మన దేశాన బ్రాహ్మీ లిపివారు ఆర్యులు'' (పుట 5)

3 ''పుండ్ర, పుళింద లోకరే — వింధ్య — కృష్ణానది మధ్య ఆంధ్రులే పుళిందులు'' (పుట. 10).

4 ''రాజుల దండయాత్రలలో భాషా సంస్కృతి 'రవాణా' కాదు. మతవాణిజ్యాలతో వ్యాప్తికావడం పురాతన చరిత్ర''. (పుట. 11) శ్రీ వర్మగారు 'పద్మశ్రీ' సి. శివరామమూర్తిగారి ''The Royal conquest and the cultural migrations in South India'' అనే గ్రంథాన్ని చదివి వుంటే పై అభిప్రాయమును వ్రాసి వుండేవారు కారు.

5 ''హరప్పావారు నాగులట...'' (పుట. 12)

6 ''మన పురాణాలలో పేరుచివర అశ్వయున్నవారు ఆర్యులైన పారశీకులు'' (పుట. 15)

7 ''కాకతి రుద్రదేవుడు వేంగిజయింపవచ్చాడు. కాని వెలనాటి వీరుడు వస్తున్నాడని విని పారిపోయెడ నే వైనం వుంది'' (పుట. 43). ఈ సందర్భములో శ్రీ వర్మగారిని **Journal of the Oriental Institute, Vol. 4, June 1971, pages 450-460** చూడగోరుచున్నాను.

8 ''బహు పురాతన కాలము నుండి దండయాత్రలూ — విజయాలు రాజ్య స్థాపనలు చేసిన వారిగూర్చి చర్చిస్తేతేలేది— సుమేరియనుల నాటినుండి ఈ విజేతలు పార్వతేయులు — దక్షిణాపథరాజులలో అనేకులు పార్వతేయులు'' (పుట.55)

9 ''ఆగ్నేయా సియా, క్లింగ్, కోయింగ్, హోయింగ్, హోలింగ్, ట్లింగ్, వాచ్యాని (కళింగ) ప్రాంతీయులే గావచ్చును'' (పుట. 118)

10 ''మగధ రాజులు శిశునాగులు. శేషనాగుల ఏలం (యుగోస్లోయా) ప్రాంతాల నుండి విస్తృతంగా వ్యాపించిన శక్తి సంపన్నులట'' (పుట. 169)

ఈ సంపుటి రచన కుపయుక్తమైన గ్రంథముల జాబితా లేకుండుట విచారకరమైన విషయము. దీని వెల, విలువకన్నా ఎక్కువగా నున్నట్లున్నది. ఈ సంపుటిలో వెల్లడించిన పండితాభిప్రాయముల ప్రకారము, శ్రీ వర్మగారు చాల ఎక్కువగ శ్రమించి రచించిన గ్రంథముగ ''కళింగదేశ'' కన్పించుచున్నది. పండితులు మరియు పరిశోధకులు ఈ సంపుటి నెక్కువగా ఆదరిస్తారని ఆసిస్తున్నాను.

డాక్టరు వై. జి రెడ్డి

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**